# అభినవసరస్వతి

లేక

## నవ నాగరకత

(సాంఘిక నాటకరాజము)



రచయిత

మరంగంటి పార్థసారథి, బి. యే,

తహశ్శీలుదారు - మచిలీపట్నం,



బెజవాడ:

ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1938

 [వెల రు 1—0—0.

కృష్ణాజిల్లా కలెక్టరుగారగు

**మహారాజరాజశ్రీ టి. భాస్కరరావు నాయుడుగారికిని,**

**వారినతీమణి శ్రీమతి లక్ష్మీభాస్కరరావుగారికిని యొసంగిన**

కృ తి స మ ర్ప ణ ము.

ఉ. శ్రీకరుఁడు న్నృధీవర వ ♦ శీకరుఁ డాత్మజనావనుండు నా
శ్రీ కమలామనోహరుఁడు ♦ శీతలదృష్టుల గౌరవించి య
స్తోకసుఖంబుల న్నొసగి ♦ శుభ్రయశంబు చిరాయురున్నతు
ల్ప్రకటలీల వేయొసగు ♦ భాస్కరరావుకు లక్ష్మిదేవికిన్.

సీ. కీర్తివిస్తారుండు ♦ కృష్ణసామి యఖండ
ముదమున సబుజడ్జి ♦ పదవినందె
ప్రజ్ఞాధురీణుండు ♦ వరదరాజులనాయ్డు
సబుజడ్జి గద్దెపై ♦ సన్నుతిఁ గనె
దొడ్డవారిలో మేటి ♦ దొరసామి సర్కిలు
పోలీసు పదవిలో ♦ మేలొనర్చె
విదితయశోఘను ♦ ల్విద్యాధురీణులై
విఖ్యాతపదవుల ♦ వెలసినారు

తే. నీదుతండ్రియు పెదతండ్రి ♦ నీదుమామ
బంధువర్గంబువారలు ♦ వారి మించి
కృష్ణమండలంబునకెల్ల ♦ కీర్తివైభ
వంబు లొనగూర్చి ప్రభువువై ♦ వరలుమయ్య!

చ. సరస రసాగ్రగణ్యా! బుధ♦సంస్తవశోభితపూతచర్య! నీ
పరమపవిత్రజీవితము ♦ బాధలమ్రగ్గెడివారి బ్రోచుచున్
దురితచరిత్రుల న్దునిమి ♦ దుష్టుల శిక్షణఁ జేసి శిష్టుల
న్గరుణను బ్రోచి కావగను ♦ గడ్పెదుగాదె సుధీవరాగ్రణీ॥

తే. శ్రీమహావిష్ణు సతియైన ♦ సిరియుఁబోలె
పరమశివునికి రాణియౌ ♦ పార్వతివలె
బ్రహ్మయర్ధాంగి శారదా ♦ రమణిఁబోలె
వలచి వరియించె లక్ష్మి ని♦న్భాస్కరాఖ్య!

చ. సిరియును విద్యయున్గలవు ♦ స్త్రీజన సంఘపురోభివృద్ధికై
నిరతము యత్నముల్సలిపి ♦ నేర్పుమెయి న్జరియింపుభర్తతో
పరహిత కార్యము న్మసిగి ♦ పావనకీర్తి గణింపుచుండు నీ
పరమపవిత్ర లక్ష్మిసతి ♦ భాస్కరుభాగ్యము లెన్న శక్యమే!

తే. భాస్కరాగ్రణి! మహలక్ష్మి! ♦ భక్తిమీర
హిందుసంఘపు దోషము ♦ ల్పొందుపఱచి
రచన జేసిన నాటక♦రాజ మిదియె
కృతి యొసంగితి గైకొను ♦ డింపుమీర॥

గ్రంథకర్త.

# ఇందు వచ్చు పాత్రములు

కేశవరావు—అతనిభార్య సుశీల కుమారుఁడు గోవిందరావు. కుమార్తెలు : విమల, అనసూయ, ప్రభావతి. తండ్రి నారాయణరావు. తల్లి పార్వతి. బావమరది శివరావు.

విష్ణురావు—అతనిభార్య హైమవతి. కుమారుఁడు మాధవరావు. కోడలు ప్రభావతి. కొమార్తె సరస్వతి. మనుమఁడు కృష్ణమూర్తి.

పద్మనాభరావు—విమల భర్త.

అచ్యుతరావు—అనసూయ భర్త.

వామనరావు—పద్మనాభుని తండ్రి. భార్య కాంతిమతి.

జనార్దనరావు—అచ్యుతరావు తండ్రి. భార్య సుప్రభ.

మధుసూదనరావు—సరస్వతి భర్త.

మహమ్మదుఖాన్—వైద్యవిద్యార్థి, ధనవంతుఁడు.

జాన్—పంచమకుల వైద్యవిద్యార్థి.

వెంకటశాస్త్రి, పుల్లంభొట్లు—బ్రాహ్మణపురోహితులు.

పేరిశెట్టి—వైశ్యుఁడు.

విక్రముఁడు—భారతి భర్త.

## స్త్రీలు.

సరస్వతి—విష్ణురావు కూతురు.

విమల—కేశవరావు కూతురు. పురుషవేషమున విమలాదిత్యశాస్త్రి.

అనసూయ—కేశవరావు కూతురు. పురుషవేషమున ప్రభాకరశర్మ.

సుశీల—కేశవరావు భార్య.

కాంతిమతి—వామనరావుభార్య.

సుప్రభ—జనార్దనరావుభార్య.

ప్రభావతి—మాధవరావుభార్య. కేశవరావు కుమార్తె.

సరోజిని—ఆంగ్లయువతి. మాధవరావుభార్య.

పార్వతి—నారాయణరావుభార్య.

హైమవతి—విష్ణురావుభార్య.

భారతి—వామనరావు కొమార్తె

రుక్మిణి—వామనరావు విధవసోదరి.

పద్మిని—వారనారీమణి.

శశిముఖి—పద్మిని తల్లి.



# అభినవసరస్వతి

## ప్రథమాంకము

### ప్రథమరంగము

[వృద్ధులు, నారాయణరావు, పార్వతి, వారికొమారుఁడు కేశవరావు, కోడలు సుశీల, చిన్నపిల్లలు, విమల, అనసూయ, కొమారుఁడు గోవిందరావు, సుశీలయన్న శివరావు కచ్చేరిసావిడిలో నాసీనులై మాట్లాడుచుందురు ]

పార్వతి—నాయనా! కేశవా! నీతండ్రిగారు మూడుకాళ్లముదుసలైనారు.

తే॥ గీ॥ కనులు గనరావు కర్ణము ♦ ల్వినఁగరావు
కురులు దెలుపయ్యె దేహంబు ♦ గ్రుంగిపోయె
వార్ధకంబునఁ రోగంబు ♦ బ్రబలనయ్యె
క్షణము యుగముగఁ గాలంబు ♦ గడుచుచుండె
నెపుడుమరణంబు గలుగునో ♦ యెఱుఁగరాదు 1

వారు చల్లఁగా జీవించియుండఁగానే చిన్నపిల్లలకుఁ గల్యాణమహోత్సవంబు గావించుచో నైదురోజులు నట్టింట ముసలిముత్తైదువతనముఁ జేయవలయునని యున్నది! నాముద్దుచెల్లింపుమా తండ్రీ!

నారాయ—నాయనా! నేను బ్రతికినన్నాళ్ళింక ముందు బ్రతుకఁబోను. క్షణక్షణంబు నను దైవాజ్ఞకెదురుచూచుచున్నాను. పరమేశ్వరుఁడు నన్ను మఱచెనేమో కాని లేకున్న నింతకుమున్నే యమధర్మరాజు హాజరువారంటు పంపవలసినది! ఉత్తరక్షణము మనది కాదు! ఊరు పొమ్మనుచున్నది; కాడు రమ్మనుచున్నది! నాకండ్లముందే కన్యాదానం బొనరించినచోఁ జూచి సంతసించెదను.

కేశవ—కన్నులుతెరువని కసికందులు: వివాహమనేమో యెఱుంగని బాల్యావస్థయందున్నారు.

సీ॥ పుట్టి పుట్టఁగలేదు ♦ యిట్టిపట్టికి నెట్లు, పరిణయం బొనరించి ♦ ప్రతిభ గాంతు
ప్రాఁకి ప్రాఁకఁగలేదు ♦ పసికూన కే నెట్లు, కల్యాణమును జేసి ♦ ఖ్యాతి గాంతు,
నడిచి నడువలేదు ♦ నలినాక్షి కే నెట్లు, వైవాహికము జేసి ♦ వన్నె గాంతు
పలికి పల్కఁగలేదు ♦ పద్మాక్షి కే నెట్లు, పెండిలియొనరించి ♦ పేర్మి గాంతు
తే॥ గీ॥ కన్ను దెరువని యర్భకు ♦ లన్ను మిన్న, లెట్లు పరిణయ మొనరింతు ♦ నేమి సేతుఁ
గష్టసుఖములఁ దెలియని ♦ కన్య లేడ, పరిణయం బేడ వలదయ్య ♦ వలదు తండ్రి.

సుశీల—మీ మాటల కేమిలెండి! ప్రతిదానికి వేళాకోళాలు వెక్కిరింపులును. మనపిల్లల నడుగుదా ముండండి! అమ్మా! మీకుఁ బెండ్లి కావలెనా!

విమల—అమ్మా! తప్పకుండఁ గావలెను!

అనసూయ—అక్కయ్యకంటె నాకే ముందుఁ గావలెను.

సుశీల—చూడండి! పెండ్లియనిన నెంత ముచ్చట పడుచున్నారో నాచిట్టితల్లులు! మగవారి కేమి తెలియును? ముచ్చట్లా యచ్చట్లా! వేడుకలా వినోదములా! ఏమియు నక్కఱలేదు! బ్రహ్మదేవుఁడు మిమ్మెట్లు సృజించినాఁడో! ఏమియుఁ దెలియదు. వట్టి జడస్వరూపము! మిమ్మును గట్టుకొని యేమి సుఖపడినానో పడినాను.

కేశవ—ఇప్పుడా గొడవ యెందుకు! రామాయణములోఁ బిడుకల పోట్లాటయన్నట్లు! ఎందుకమ్మా పెండ్లంటే మీ కంత సంబరము?

విమల—ఎంతచక్కఁగాఁ బల్లకిలో నూరేగవచ్చు! బాజాలు, పేరంటాళ్లు, పువ్వులు, బుక్కాయి, అన్నియు వచ్చును. ఒంటినిండ నగలు పెట్టుకోవచ్చు! క్రొత్త బట్టలు గట్టుకోవచ్చు.

అనసూయ—నాన్నగారు! పెండ్లిలో బూరెలు పప్పులు వండెదరండి! కావలసినన్ని తినవచ్చు. పిల్లలు చాలామంది వచ్చెదరు. వాండ్లతో నాడుకోవచ్చు.

కేశవ—అహా! ఎంత యజ్ఞానము! ఎంత మౌఢ్యము.

సీ॥ వైవాహికం బన్న ♦ భామానుణులఁ గూడి, పేరంటములు గాదు ♦ పిన్నలార
కల్యాణమన్నచోఁ ♦ గనకాంబరముఁ దాల్చి, సిగ్గు జెందుట గాదు ♦ చేడెలార
పరిణయం బన్నచోఁ ♦ బసుపుఁ బారాణితో, నూరేగుటయు గాదు ♦ యువతులార
యుద్వాహ మన్నచో ♦ నూహించి తలఁబ్రాలుఁ జల్లుటే కాదుసూ ♦ పిల్లలార
తే॥ గీ॥ జన్మమున్నంత కాలంబు ♦ జగతిమీఁదఁ, జన్మవీడిన పరలోక ♦ సదనమందుఁ
బ్రాణనాయకు పదముల ♦ భక్తిఁ గొలిచి, దైవసమునిగఁ జూచుటే ♦ తల్లులార.

సుశీల—మీ మెట్టవేదాంతములు, పాతివ్రత్యమహిమ, యిప్పటినుండి నూరిపోయ నక్కఱలేదు. వాండ్ల కేమి తెలియునా? ఆరవగొడ్డుమాదిరిగా నుండును. నాచిట్టితల్లులారా మీ రెవరిని బెండ్లిచేసుకొనెదరమ్మా!

విమల—అమ్మా! నేను నాన్ననే పెండ్లిచేసికొందును.

అనసూయ—అమ్మా! నేను నిన్నే పెండ్లిచేసికొందును.

సుశీల—ఛీ! ఛీ! ఛండాలులారా! అట్లనఁగూడదు. తెలివితేటలు లేవు, ఏపాడులేదు! ఛీ! అవతలకుఁ బొండి (అని యిద్దఱిని గొట్టి పంపివేయఁగా, వా రేడ్చుచు వెళ్ళిపోవుదురు.)

కేశవ—అధము శుభ మెఱుంగ కెట్లు మాట్లాడుచుండిరో వింటివా! ఇట్టి పసికూనల కేనా పెండ్లి

ఉ॥ మాటల నేర్పుటో, మధుర♦మంజుల సుస్వరము లెలంగఁగాఁ
బాటలఁ బాడుటో, యువతి ♦ వర్గముతోఁ జెలరేఁగి ప్రేమతో
నాటల నాడుటో, తెలియ ♦ నక్కట యీ పసికూన లేడ నిం
కేటికి పిన్న పాపలకు ♦ నిడ్డు వివాహపు సంప్రదింపులున్. 4

సుశీల—ఏదో సాకు దొరకినది! ఐనను మీ రేనాఁడు నాముద్దు చెల్లించినా రీ నాఁడు చెల్లించుటకు? ఎప్పుడు మీయింటిలోఁ బాదంబు బెట్టితినో యప్పుడే నాముద్దు ముచ్చటలకుఁ దిలోదకంబులు వదులుకొంటిని. ఇప్పుడు కాకపోయిన ముప్పది నలుఁబది యేండ్లు నిండిన తరువాతఁ బెండ్లి చెయ్యాండి! ఇట్టి పెండ్లిండ్లు కావలె ననియేకదా శారదాచట్టము వచ్చుచున్నదఁట! అది వచ్చిన తరువాత మీరు పెండ్లిచేసినను సరే, లేకున్న వాండ్లే యెవరినో గుప్పుచప్పుమనకుండఁ గట్టుకొందురు! అప్పుడు మీ నా సంప్రదింపు లేమియు నుండవు.

నారా—కేశవా! చెప్ప మఱచితి! శారదాచట్టము వచ్చుచున్నయది కదా ప్రళయ భీకరాకారముతో!

సీ॥ నిద్రించు జనులపై ♦ నీరధి పైఁబడి, జలములో సర్వంబుఁ ♦ గలిపినట్లు
లోకఁ ద్రొక్కునట్లు ప్రచు ♦ భీకరావేశమై, విషవహ్నికీలల ♦ విడుచునట్లు
ఆకొన్న సింగంబు ♦ హస్తిమస్తకముపైఁ, గుప్పించి చెండాడి ♦ కూల్చినట్లు
కలరా మహామారి ♦ కడుఘోరరోగము, ల్ప్రజఁ బీల్చి బాధలఁ ♦ జఱపునట్లు
తే॥గీ॥ శారదాయాక్టు మన పాలి♦జమునియాజ్ఞ, ఎపుడు పైఁబడి కులకట్టు♦కట్టిముప్పుఁ
గలుగఁజేయునో తెలియఁగా♦వలనుపడదు,నిదుర మేల్కొంచిశుభముల♦నిండుఁబ్రేమ
జేసి గట్టెక్కి మనవలెఁ ♦ జిన్ని కుర్ర. 5

సీ॥ పరమేష్ఠినుండి నీ♦తరము వచ్చినదాఁక, యాహితాగ్నులమని ♦ యశముఁగాంచి
తండ్రి తాతలనుండి ♦ ధర్మతత్పరులమై, కులశీలములయందుఁ ♦ గొలఁదిమీఱి
తండ్రివంశమునందుఁ ♦ దల్లివంశంబున, బ్రాహ్మణాచార సం♦పత్తి నెఱపి
వేదవేదాంగాది ♦ విద్యలయందెల్ల, నసమానులని కీర్తి ♦ యందఁగల్గి
తే॥గీ॥ చెట్టు చెడిపోవునాఁటికిఁ♦బుట్టుఁగుక్క, మాఱి పించెలనెడుమాడ్కి ♦ నీతిజాతి
మహితశీలంబు మర్యాద ♦ మంటఁగలిపి, వైవసెంచితె దుష్టుఁడా ♦ పరమమూర్ఖ. 6

మేము బ్రతికియుండఁగా వివాహము చేసితివా సరియే! లేకున్న వృద్ధుల మగు మమ్ము నొక కావడిలో వేసుకొని యేయర్ధరాత్రియో గంగలోఁ ద్రోసివచ్చి యటుపై నీయిష్టము వచ్చిన శ్లేమాలమాదిగలకో క్రైస్తవులకో నీపిల్లల నంటఁగట్టుము. మేము బ్రతికియుండ నీ దురాచారంబులు సహింప లేకున్నాము

పార్వ—ఎందుల కంత క్రూరముగా బల్లెముతోఁ బొడిచినట్లు మాట్లాడెదరు! చిన్నవాఁడా! లిట్టి కొట్టి బుద్ధులు చెప్పుటకు! వానికిమాత్రము శారదాచట్టము వచ్చినచోఁ గొంపలంటుకొనునని తెలియదా! నాయనా! కుమారా!

సీ॥ వంశమర్యాదలు ♦ వన్నె వాసికి నెక్కఁ, బరిణయంబొనరించి ♦ ప్రతిభఁగాంచు
తల్లిదండ్రులయాజ్ఞఁ ♦ దలదాల్చి పిన్నల, కల్యాణమొనరించి ♦ ఘనతఁగాంచు
ప్రాణేశ్వరికి ముద్దు ♦ బాగుగాఁదీర్పంగ, వైవాహిక మొనర్చి ♦ వాసిఁగాంచు
బంధుమిత్రులయందు ♦ బహుగౌరవముబొందఁ, బెండ్లిండ్లువేఁజేసి ♦ పెంపుఁగాంచు
తే॥గీ॥ వృద్ధులగుమమ్ముదయఁజూచి ♦ వృద్ధిఁగాంచు, సంఘబలగంబువిడఁబోకు ♦ శాంతిగలిగి
కులముపెద్దలయానతు ♦ ల్గూలఁద్రోసి, సంఘమర్యాదఁదప్పకు ♦ సదయహృదయ. 7

గోవింద—మీ మీ సంతోషంబులు చూచుటయేగాని బాలికల కష్టనష్టములు చూడ నక్కఱలేదా! ఏమియు నెఱుంగనిపసిహూనల నిప్పటినుండియు సంసారతాప త్రయంబునఁ గూలఁద్రోయవలసినదేనా! జనకా!

సీ॥ బొమ్మపెండ్లిండ్లకుఁ ♦ బొంగిగంతులువైచు, బాలిక లత్తింట ♦ వఱలుటెట్లు,
ఆటపాటలయందు ♦ నలరారు బాలికల్, ప్రాణేశునాజ్ఞలఁ ♦ బరఁగుటెట్లు,
తల్లిదండ్రులయాజ్ఞ ♦ నొల్లనిపసిహూన, లత్తమామలసేవ ♦ నలరుటెట్లు,
కుడిచికట్టఁగలేక ♦ తడఁబడు కన్యలు, పిన్నపాపలఁగని ♦ పెంచుటెట్లు,
తే॥గీ॥ చదువుసంధ్యలు నేర్వని ♦ చంచలాక్షు, లింతసంసారవారాశి ♦ నీదుటెట్లు
ధైర్యసాహసములఁజూపి ♦ తలిరుఁబోండ్ల, పెండ్లిశుభములనిపుడాపి ♦ పెంపుఁగనుఁడు. 8

శివ—అబ్బాయి! గ్రుడ్డువచ్చి పిల్లను వెక్కిరించినట్లు పెద్దలు సంసారగోష్ఠి మాట్లాడుచుండ నీ వకటా వికటపుఁ బ్రసంగముఁజేసి మఱింతకష్టపెట్టకు. నీచదువు సంధ్యలలో బ్రజ్ఞఁజూపు మదియే పదివేలు.

గోవిందు—నేనేమి యస్వతంత్రపుఁ బ్రసంగముఁజేయలేదే! కాటికిఁగాళ్ళు సాచుకొన్న వారందఱు సలహా లివ్వవచ్చునుగాని నాకుఁ దోచినది నేనుజెప్పఁ గూడదా! లోకులు పలుగాకులు! వారి నోరుతీట తీరునట్లు మాట్లాడెదరు. వేగిరపడి శుభకార్యమొనర్చినచో నాజన్మాంత మా పసిపిల్లలయుసురు మనము పోసుకొందుము, గాని యీబంధుజాలమున కేమి! పూర్వాచారపరాయణుల మని పసిపిల్లలగొంతు కోయుదుమాయేమి? పసిబాలుఁడనైనపుడు నాపెండ్లి చేసితిరి చాలదా! చదువు సంధ్యలు గంగలోఁగలసినవి.

సీ॥ తొల్లింటి యాచార ♦ మెల్ల పుణ్యంబని, సహగమనంబును ♦ సలుపనగునె
స్వర్లోక సౌఖ్యంబు ♦ వచ్చునటంచును, గంగలోఁబసిబిడ్డఁ ♦ గలుపఁగలమె
చానున్న పితరుల ♦ సంతోషమనియెంచి, పసికూన పెండిలి ♦ వలెనె చేయ
క్షుద్రదేవతప్రీతి ♦ భద్రంబటంచును, బలియిచ్చి పాపంబు ♦ బడయఁగలమె
తే॥గీ॥ దేశకాలంబు పాత్రము ♦ ధీరమతిని, గాంచి చదువులు సంధ్యలు ♦ మించి నేర్పి
తలిరుఁబ్రాయమువచ్చిన ♦ జలరుహాక్షి, పెండ్లియొనరింపవచ్చునో ♦ పేర్మితండ్రి. 9

సుశీల — నీవేమి చేదుమేనితివారేమి వివాహమగుటచేత గుఱ్ఱమువలెయెదిగి కోడలత్తింట గాపురమునకు వచ్చుటకు సిద్ధముగానుండఁగా, నీవును నీతండ్రిగారును గుడ గుడ యాలోచనలజేసి యిప్పుడు కాదప్పుడని వాయిదాలు వేసి తప్పించుకొని తిరుగుచున్నారు. మీకిద్దఱకు నాకోడలు నాయింటిలో నడుగుఁబెట్టుట గిట్టదు, ఏమిముల్లె ఖర్చవునో యని భయము.

శివ — చెల్లెలా! మూల్గెడి నక్కమీఁద తాటికాయపడినట్లు నీ వాప్రశంస తెచ్చి నొప్పించుటెందులకు! బావా! దేశకాలపాత్రాదులు బాగుగా నాలోచింపుము! నీ యభిప్రాయంబులు బాగుగనేయున్నవి; కాని తాఁబట్టినకుందేటికి మూడేకాళ్లని వితండవాద మొనరింపనగునా? మనసంఘముకట్టుబాట్లన్నిఁటిని పాటిఁపుచుఁ గ్రమముగా నభివృద్ధిలోనికి రావలయును గాని, సంఘంబును వదలిపెట్టి యిష్టమువచ్చినట్లు చేతునని మొండిపట్టుఁ బట్టఁగలమా! నీ వాడపిల్లలుగలవాఁడవు! మంచిసంబంధ బాంధవ్యంబులు రావలెను. సంఘసంస్కారాభిలాషచే ముందువెనుక లారయక మిట్టపల్లంబులు చూచుకొనక పరుగెత్తినచోఁ గాళ్లు విరుగఁబడెదము. మూరెడు పోనేల, బారెడు కుప్పింగనేల! కార్యాకార్యంబులాలోచింపక యవ్యక్తంబొనర్చినచో మనపని యస్తవ్యస్తమగును. గతజలసేతుబంధనముచే లాభముండదు.

కేశవ — బావా! శారదాచట్టము వచ్చి మనకొంపకు నిప్పంటించునట్లున్నది. మీ రందఱు నన్నుఁ బెండ్లి పెండ్లియని పీకుకొని తినుచున్నారు. పెండ్లి పని పిల్లలకుఁ జేసినచో నాయుద్యోగంబునకు నీళ్లు వదలవలసి వచ్చునట్లున్నది! కలక్టరా కాలాగ్నిరుద్రుడై నాపైని నిప్పులుచెరుగును! పోనీ ప్రస్తుతమాపుదమా యన్నచోఁ దల్లి దండ్రులు గొంతుక కురిపోసుకొనెదమనుచున్నారు. ముందుకేగిన నుయ్యి, వెనుకకేగిన గొయ్యి యన్నట్లున్నది నాబ్రతుకు. పిల్లలా ముక్కుపచ్చలారని పసికందులు! ప్రాణేశ్వరియా మాఘాగ్రేసర చక్రవర్తిని. తల్లి దండ్రులా గరడుకట్టి ఘనీభవించిన పూర్వాచారపరాయణులు! నా మనస్సు పరి పరివిధముల చేయిఁబెట్టి కలంచివైచినట్లున్నది. నాకేమి చేయుటకును చేతులాడకున్నవి. ఉన్నది యుండఁగాఁబై పెచ్చుగ నాడపిల్ల వివాహంబన్నచో ధనము రెండుచేతులతో వెదఁజల్లవలయు.

సీ॥ పసుపుమిసిమిచాయ ♦ వరుఁడుగావలెనన్న, స్వర్ణాభిషేకంబు ♦ సలుపవలయు
ధనధాన్యసంపత్తి ♦ దాల్చిన యువకుని, కోరికలన్నియుఁ ♦ గూర్పవలయుఁ
జదువుసంధ్యలయందుఁ ♦ గుదురైనవానికి, వెండిబంగారముల్ ♦ బెట్టవలయు
నిండ్లు వాకిండ్లతో ♦ నెసఁగుటగల్గుచో, భూములన్నియుఁ దీర్చి♦పంపవలయు
తే॥గీ॥ నిప్పుడెటనుండి తెత్తు నే♦నింతధనము, నెందఱకల్యాణములఁజేసి♦హెచ్చుఁగాంతు
నవనిధానంబు లెప్పుడో ♦ నాశమయ్యెఁ, పొలములమ్మిన రాదుగా♦వలయుధనము.

సుశీల—ఏమి పేదయఱపు లఱచెదరండి మీ సూట్లకు బూట్లకు, మీ కాఫీలకు పుపమాలకు, మీసైకిళ్లకు కళ్లజోళ్లకు నన్నింటికి డబ్బువచ్చును గాని పిల్లల పెళ్లియనిన డబ్బు లేదనియెదరా! ఏ యెండ కాగొడుగుఁబట్టవలెను. పిచ్చి ఛాందసముఁ బెట్టుకొనకండి! ఎవరి తలవ్రాత యెటులుండునో యట్లే జరుగును. "నొసటన్ వ్రాసిన వ్రాతకన్నఁగలదే! నూరేండ్లు చింతించినన్" యని పెద్దలందురు గదా? మనము మీన మేషంబులు లెక్కించుచుండుట చేతనే కాఁగల సంబంధములన్నియు మీఱిపోయె? ఏరెండవ పెండ్లివానికో మూడవపెండ్లివానికో ముదుకకో ముసలికో యెవరికో యొకనికిచ్చి ముడి వేయించండి. శారదాచట్టము వచ్చినతరువాత మనపాట్లు కుక్కలకు గూడ నుండవు.

కేశవ—నీ కేమి చెప్పెగవు! నీవుదళమువేసుకొని పుట్టినావు గనుక నేనొప్పియుఁ దెలియకున్నది. ఈ పసికూనలను దీసుకొనిపెళ్లి చావునకు మొగమువాచిన యే ముసలి తొక్కున కంటగట్టమందువు. పెండ్లిచేయుమని పట్టుఁబట్టఁగలవు గాని, సొమ్ము మాటవచ్చినపుడు గుప్పుచప్పు మనజాలవు.

సీ॥ పెద్దపిల్లకుఁ బెండ్లిఁ ♦ బెంపుగాఁగావింప స్వార్జితధన మెల్ల♦సమసిపోయెఁ
బద్మాక్షికల్యాణ ♦ వైభవంబుల చేతఁ, దరుణిసూభరణముల్ ♦దాటిపోయె
శ్రేయసిమురిపెంపు ♦ విన్నాణముల చేతఁ బిత్రార్జితం బెల్ల ♦ వీడవలసె
నధికారి మెప్పుకై ♦ యగచాట్లు పడిపడి, యప్పులపాలయి ♦ యుడలవలసె.
తే॥ గీ॥ గట్నములు కొన్ని లిప్పుడే ♦ కరణివచ్చు, మిత్రబాంధవవర్గంబు ♦ మెత్తురెట్లు
వేడుకలు వినోదంబుఁగా ♦ వించు టెట్లు, కన్నుపొడిచిన ధనమేడ♦గానరాదు॥

సుశీల—నన్నేమి చేయుమందురు! నాకున్ననగ నాణెంబు లిదివరకే తమ కప్పగించితి. మూసివాయనపుము త్తెమువలె నుంటిని! పట్టిదీపస్తంభమువలె చేసి కూర్చుండ బెట్టితిరిగదా! తోడి తహశ్శీల్దారులయొక్కయు మేజస్ట్రీట్లయొక్కయు భార్యలు పగలుకంటఁబడిన రాత్రికలలోనికి వచ్చునంత సౌందర్యహీనలైనను, బంగారుప్రతిమలవలె విలువెల్ల బంగారుతొడుగు ధరించియుండ మీరు నన్నిట్లా నర్పితిరి. న్యాయమని, ధర్మమని మీరుముక్కుమూసుకొని మడిగట్టుకొని యొక మూలఁగూర్చుండఁబట్టి మనకీ స్థితివచ్చినది.

కేశవ — నీ పంచాంగము విప్పకు. ఎటులైనను దప్పకున్నది. ఏదోమార్గముఁ ద్రొక్క దను. వివాహంబులకై మీరు మీ ప్రయత్నంబులలో నుండుఁడు. నేనొక్కఁడనే మూర్ఖపుఁబట్టుఁబట్టిన నో ముప్పువాటిల్లునని తోఁచుచున్నది.

సీ॥ మరణశయ్యాలయందు ♦ మ్రగ్గిక్రుంగుచునున్న, తల్లిదండ్రులయాజ్ఞఁ ♦ దప్పుటెట్లు
సహధర్మచారిణి ♦ సదమలచారిత్ర, ప్రాణేశ్వరికి ముద్దుఁ ♦ బాపుటెట్లు
కష్ట సౌఖ్యములందుఁ ♦ గను జెప్పనలేఁగాచు, బంధుకోటిని భంగ ♦ పఱచుటెట్లు
ప్రాక్తనాచారసం ♦ బంధంబుఁ దెగఁగోసి, నూతనాచారంబుఁ ♦ బాతుటెట్లు
తే॥ గీ॥ ధర్మమొకవంక గులసూత్ర ♦ ధరణిమీఁద, బంధుమిత్రుల విడనాడి ♦ మఱలరాదు
పాపమునుఁగాక పుణ్యంబు ♦ వచ్చుగాక, మీయనుజ్ఞలె తలఁదాల్తు ♦ మిత్రులార.

నారాయ — నాయనా! మేము ధన్యులము శుభస్యశీఘ్రమందురు గావున వెంటనే శుభకార్యంబులొనర్చుము.



## ద్వితీయరంగము.

[విష్ణురావు, మాధవరావు, హైమవతి, సరస్వతి, ప్రభావతి, సుఖాసీనులై మాట్లాడుచుందురు.]

హైమ — మాధవా! నీ వింగ్లండు గింగ్లండు వెళ్లుట నాకెంతమాత్ర మిష్టముగాదు న్యాయవాది పరీక్షయందుత్తీర్ణుఁడవైనందునఁ బట్టాపుచ్చుకొని పనిచేయ రాదా! లేకున్న మీ నాయనగారే యే హైకోర్టుజడ్జీగారినో కాళ్ళు కడుపులు బట్టుకొని మునసబుఁ బని వేయించెదరా పనిజేయరాదా! ఏమంత పదిమంది యున్నారని! నీవేమి సంపాదించి మా నెత్తి నెత్తనక్కఱలేదు. ఉన్నది వాడుగాకుండఁ జూచుకొన్న నదియే పదివేలు! చూడజుట్టమును మొక్క దైవమును లేని యావిదేశంబులలోఁ గడుఁగర్భకుండవగు నీవెట్లు కాలంబు గడిపెదవో కదా?

ప్రభా — అత్తా! అక్కడ స్త్రీలు బహుదుర్మార్గురాండ్రట కాదా! మనదేశపు వారిని నిముషములో వలలో వేసుకొందురట. అందులో నడివయస్సులోనున్న వీరచటకుఁ బ్రయాణమేందులకు? అచటకు వెళ్ళిన వీరు తిరిగి మనకు దక్కుదురనుట కల్ల.

మాధ — నీవిప్పుడు పానకములోఁ బుల్లవలె యడ్డమురాకు. వీకు నమ్మకము సంగినచో వెళ్ళెదను లేకున్న. పెద్దలు జననీ జనకుల యనుమతిఁ బడయనిమ్ము. అమ్మా! పూర్వకాలపు రోజులు మారినవి. బ్రాహ్మణుల కుద్యోగంబులు దూరంబులై పోయినవి. ఇంగ్లండులో బారిష్టరు పరీక్షయో కలక్టరు పరీక్షయో ప్యాసైనంగాని దప్ప మన కుద్యోగంబు లిచ్చువారులేరు. డబ్బుకు ముప్పదిమంది పిల్లలు వెంటఁబడి తిరిగెడి రోజులలోఁ బ్లీడరీ చేయుటకన్న ముష్టియెత్తుకొనుట మేలు కాన నా ప్రయాణమునకు నీవెట్టి యాటంకమును జెప్పకుము.

విష్ణు—మాధవా! నీవు చెప్పినట్లే కావచ్చును? పెద్దలలో మాత్రము లక్షలకొలంది ధనము నార్జించినవారు లేరా? నీవింకను బల్లఁగిట్టక పూర్వమే వందలు వేలు ధనము గావలెనన్నఁ జెట్టునుండి కోసుకొనివచ్చు పదార్థము కాదుగదా? తెలివి తేటలుండవలెను. కష్టపడి పని చేయవలెను. పైఁగా నదృష్టముండవలెను. కడుపులోఁ జల్లకదలకుండఁ గుడిచి కూర్చుండి ప్రాక్టీసు రావలెనన్న వచ్చునా?

మాధ—జనకా! నేను కష్టపడి పని చేయలేనండి! ఒక సంవత్సరము బారిష్టరు చదివి యుద్యోగము సంపాదించినచో హాయిగాఁ గాలుమీఁదఁ గాలు వేసుకొని సుఖింపవచ్చును. సర్వముఁ దెలిసిన తామే యభ్యంతరపెట్టినచో మాయమ్మ దిగులుఁ జెందదా?

హైమ— మాధవా! దిగులని నెమ్మదిగాఁ బలుకుచున్నావా? నాగుండెలలోఁ బిడుగు పడినట్లైనది.

సీ॥ ప్రేమతో నిన్నుగా ♦ రాము సేయని నాఁడు, కంటికి నిద్దుర ♦ గలుగదయ్య
పొత్తున నినుగూడి ♦ భుజియింపకున్నచో, నన్నంబు సున్నమే ♦ యగును సుమ్ము
నీవచోవిభవంబు ♦ నెమ్మితో విననిచో, మనసు దుర్భరదుఃఖ ♦ మలినమగును
గొడుకుఁ గోడలుఁ గూడి ♦ కూర్మితో సేవింప, సుఖియించు నాశ నేఁ ♦ జొక్కుచుంటి
తే॥ గీ॥ నిన్ను విడనాడి బ్రతుక నే ♦ నేరసుమ్ము! దినము యుగముగఁ గడచును ♦ మనసునందు
మమ్ము మఱువంగఁ బోకుమో ♦ మాధవార్య చదువుసంధ్యలు నేర్చవే ♦ కదలిరమ్ము.

మాధ— తల్లీ! నీవింత చెప్పవలెనా! క్షణమైనను మిమ్ము మఱచియుండగలనా! వచ్చెడిసంవత్సర మీపాటికి తిరిగివచ్చివేయుదును కదా? నీ ముద్దుల కోడలు మీకు పరిచర్యఁ జేయుచు నేను దగ్గరలేని కొఱఁతను దీర్చుచుండును.

విష్ణు—మాధవా! నాకరువది సంవత్సరంబులు దాటినవి. ఏనాఁటికేమి కలుగునో తెలియదు! నీవు తక్షణమే చదువుఁ బూర్తిఁ జేసి రావలయును.

సరస్వతి—నాన్నగారు! నేను చెన్నపట్టణములో డాక్టరు పరీక్ష జదువవలెను! నేను గూడా వెళ్ళవచ్చునా?

ప్రభా—వదినా! మీకు నాను నింకను జదువేమిటి!

సీ॥ చదువుసంధ్యలయందు ♦ సన్నుతిఁ గాంచిన, నుద్యోగములు సేయ ♦ నూహగలదె
"ఎంయేలు, బియ్యేలు, యెం. బి. సి. యెం"లను, డిగ్రీలు గాంచిన ♦ కీర్తిగలదె
బహుళకావ్య ప్రౌఢి ♦ బ్రతిభ చేవెలసిన, గవికుల మణులమై ♦ గ్రాలఁగలదె
వేలకు వేలుగా ♦ వెచ్చించి చదివిన, వారలుద్యోగము ♦ ల్బడసిరమ్మ
తే॥ గీ॥ యన్నపానంబులను బాసి ♦ యంతులేని, చదువుఁ జదివినవారెల్ల ♦ శ్రమల మిగుల
బడుచు నుండగ మనకేల ♦ పాడుచదువు, సర్వసుగుణాలవాలయో ♦ సన్నుతాంగి.

సీ॥ ఇల్లువాకిలి యొడ•లెల్ల గుల్లగఁజేసి, చదివిరికొందరు • చతురమతులు
అప్పుసప్పులుజేసి • గొప్పతాహతువకై, విద్యలనేర్చిరి • వెఱ్ఱులగుచు
ఈనాముఁదెగనమ్మి • యిల్లాలునగలమ్మి, న్యాయశాస్త్రపరీక్ష • లందినారు
పిత్రార్జితఁపుసొమ్ము • వేలాఁకువ్యయముఁగా,వించి డాక్టరులయి • వెలసినారు
తే॥ గీ॥ కంచుకాగడ వెలిఁగించి • కలికిలోక, మంతయును వెదకినఁగాని • యాశలేదు
పనులుగఅవయ్యె•జీవిత•బాధహెచ్చె,చాలునుద్యోగమడియాస•చదువుచాలు. 3

సీ॥ చెప్పులుఁగుట్టుచు • జీవనంబునుజేయు, పట్టభద్రుండైన • ప్రభులుఁడొకఁడు
పాకివారలబోలె • పౌరవిధులఁజిమ్మ, సర్వకళాభ్యాసి • చతురుఁడొకఁడు
కాఫిహోటళ్ళలో • రేపుమాపును సేవ,జేయఁబోల్పడు నొకఁడు • న్యాయవాది
యున్నవికర్రయశాల • మిన్నఁగా నేర్పున్న. ప్రఖ్యాత విద్యావి•భాసితుండు
తే॥ గీ॥ చదువునేర్చిన పురుషులే • సకలకష్ట,నష్టములనున్ని పలుపాట్ల • నాశమందు
చుండ నుద్యోగమెటువచ్చు•నువిదలకును,చదువుచాలింపుమింక నో•చంద్రవదన'

సరస్వతి—వదినా? నీగడుసుమాటలకేమిలే! మేము స్కూలులో రాత్రింబవళ్ళు యఘోరించి చదివిమిడికినదానికన్న నీవువంటయింటిలో బాదుకొని యుండియే గడసుమాటలు నేర్చితివి. నీభర్త యింగ్లండుకు వెళ్ళి డబ్బుతగులవేసి చదువ వచ్చునుగాని నేను చెన్నపట్టణము జదువుకొనుటకు వెళ్ళరాదా! నాచదువు చూచి యూరిలో వాండ్లందఱుఁ గన్నులలో నిప్పులు బోసుకొనుచున్నారు. నేనుగూడ వాండ్లవలె వంటయింటిలో మ్రగ్గియుండలేదని కాబోలు! ఎవరి యింటిలో నుండిమో గుప్పెడు మెతుకులకు వచ్చిన నీవా నాకు చదువక్కఱ లేదని గఱిగియుదానవు!

ప్రభా—సరస్వతీమతల్లీ! శాంతింపుము! శాంతింపుము? కల్లకపట మెఱుంగక నీతో మాట్లాడినందులకు జెప్పునగొట్టి బుద్ధిచెప్పితివి.

హైమ—అమ్మా! నీవు సరస్వతీనామముఁ బెట్టినందులకు నీ చదువు సంధ్యల కంతు పొంతు కనఁబడకయున్నదే) నీవు చదివినది చాలదా? నీవు వివాహమాడు వయస్సు రాలేదా? ఇంకను విద్యాలయంబుల కఱిగి చదువుకొనుచుండినచో తోడి బంధుజాలములోఁ దలవంపులుగావా?

సర—అన్న సప్తసముద్రములుదాటి యింగ్లండునకు వెళ్ళిన బంధుజాలములో దల వంపులు కావుగాని నేను కలాశాలకేగి చదువుకొన్నచోఁ దలవంపులా? ఎంత పక్షపాతమమ్మా? మొగపిల్లలే చదువుట కర్హులైనచో నీవు మొగపిల్ల లనే కనక యాడుపిల్లలనుగూడ గంటివేమి! కనినదానవు నా చిన్నతనంబు ననే యే ముసలిముదుకకో వివాహంబుజేసి యతని ప్రాణంబులు గుటుక్కు మనుటతోడనే పుట్టింట వంటకుంపటి నెత్తిపైఁబెట్టి గరిటయుఁ గొప్పెరయుఁ చేతికీయక తగుదునమ్మా యని విద్యఁ జెప్పింప నేల? నేనత్యంతాసక్తితోఁ

జనువుకొనెదనని పలికినంతనే యీ పుల్లవిరుపుమాటలతో నా యుత్సాహమంతయు గంగపాలు జేయనేల.

ఉ॥ తల్లిరో! కూతుఁగాంచుట వృథా సుకుమారుల గాంచవైతివే
పిల్లఁడుమాత్రమేజడివి ♦ వేలకువేలు ధనంబుగూర్చునే
పిల్లపతింపఁగాఁ దగదొ! ♦ విద్య యశంబు గణింపరాదొకో
పిల్లఁడు హేమపుంబ్రతిమ ♦ పిల్ల యసహ్యపు మట్టిగడ్డయే. 6

సీ॥ నవమాసములు మోసి ♦ నను గన్న దినమున, నన్నునుగనలేదె ♦ యంచితముగఁ
బంచభక్ష్యాన్నమ్ము ♦ బైడిపాత్రయందు, నాకు నన్నను బెట్టి సాకలేదె
యీడుజోడుగఁ బెంచి ♦ యింపుతోఁ బ్రేమించి, కోరినకోర్కులఁ ♦ గూర్పలేదె
యక్షియుగ్మముఁబోలె ♦ నల్లారుముద్దుగాఁ బెద్దవారలఁజేసి ♦ పెంపలేదె
తే॥ గీ॥ యన్నపానాది సుఖముల ♦ యందు మఱియు। నాటపాటలఁ ♦ గ్రీడావిహారములను
నొక్కవిధమున నముఁ బెంచి ♦ యుత్పలాక్షి, చదువుసంధ్యల వేరుగా ♦ సాకనేల.

సీ॥ న్యాయమన్యాయంబు ♦ నవధరింపఁగ జేయ, విద్యకంటెను వేఱువిధము ♦ గలదె
అజ్ఞానమనియెడు ♦ నంధకారముఁ బాప విద్యకంటెను వేఱు ♦ విధము గలదె
స్త్రీల స్వాతంత్ర్యంబు ♦ ధీరతస్థాపింప, విద్యకంటెను వేఱు ♦ విధము గలదె
పరమపతివ్రతా ♦ ప్రాభవంబును జూప, విద్యకంటెను వేఱు ♦ విధము గలదె
తే॥ గీ॥ దురితములనెల్ల దహియించి ♦ దుఃఖమడఁచి, సద్గుణంబులఁ బోషించి ♦ సాధుమార్గ
చరితమొనగూర్చి సంపద ♦ జాలనొసఁగు, విద్యకంటెను భాగ్యంబు ♦ వేఱుకలదె.

ప్రభా—వదినా? మీకుఁ దెలియని ధర్మంబులు లేవుగాని నా మనవి చిత్తగింపుఁడు.

తరల॥ అతివరో వినవమ్మ దెల్పెద ♦ నార్యధర్మవిధానముల్
సతులు నాథుల యాజ్ఞ చొప్పున సంచరింపఁగ మేలగున్
బతియె ప్రాణము దైవము న్నతి ♦ వానిఁగొల్వక యున్నచోఁ
బతితయై నరకంబునంబడు ♦ వంతజెందుచు నిచ్చలున్. 8

చ॥ ధనమును ధాన్యమున్సిరులు ♦ తన్వికి భూషలుగా వొకప్పుడున్
జనముల నిందయున్ స్తుతియు ♦ సాధ్వి గణింపద యెట్టివేళలన్
ఘనమగు విద్యయున్ గళలు ♦ గాంచఁగ నక్కఱలేదు భక్తితో
బెనిమిటి పాదపద్మములు ♦ బేర్మిభజించినఁ జాలు సాధ్వికిన్. 9

సీ॥ సతులు బిడ్డలవీడి ♦ సభలకేతెంచుచుఁ, బురుషులతోఁగూడి ♦ తిరుగరాదు
ప్రాణేశ్వరునివీడి ♦ పరసీమకుంబోయి, విద్యావినోదము ♦ నెంపరాదు
అత్తమామలుసేయు ♦ యాజ్ఞలయందును, వర్తించి ప్రేమతో వఱల ♦ వలయు.
పెద్దపిన్నలయందు ♦ బిడ్డపాపలయందు, భక్త్యనురాగము ♦ లబుపవలయు
తే॥ గీ॥ కాఫిహోటళ్ళుసినిమాలు ♦ గాంచరాదు, క్లబ్బుడ్రామాలనాటకాల్ గనగరాదు
పూర్వనారీమణులఁగాంచి ♦ బుద్ధిగలిగి, పరమసాధ్వీమహత్త్వంబుఁ ♦ బడయవలయు

సీ॥ జమునితోఁ బోరాడి ♦ సత్యవంతునిఁ బొంది, సావిత్రి సుఖములఁ ♦ జాలఁ బడసె
దిక్పాలురను వేడి ♦ ధీరు నైషధుఁ గూడి, దమయంతి సత్కీర్తి ♦ ధరణిఁ గాంచె
దండకాటవి కేగి ♦ దాశరథిఁ గొల్చి, సీతామహాదేవి ♦ ఖ్యాతిఁ గాంచె
బాండవపత్నియుఁ బలు కన్నములఁ బొంది, సాధ్వీమణులలోన ♦ సన్నుతిఁ గనె

తే॥ గీ॥ మున్నరుంధతియు ననసూయ ♦ మొదలుగాఁగ, సతులు పతిని దైవంబుగా ♦ సన్నుతించి
ధరణిపై జంద్రతారక ♦ లుఁ గనుటకు, గొప్ప యశమంది రవ్వారిఁ ♦ గొలువవమ్మ.

సీ॥ కన్నుల గానని ♦ చిన్నారపసికూన, లింట్లోనఁ బడి మ్రగ్గి ♦ యేడ్చుచుండ
జెమట నెత్తురు నోడ్చి ♦ సిరులు సంపాదించు, ధవుఁడు భార్యకునయి ♦ నవయుచుండ
జీవికి మఱచి పట్టి ♦ చెడుకోర్కె మునమున్ని. యుత్తమాములు నంగ ♦ లార్చుచుండ
దోడికన్నెలఁ జూచి ♦ దోషంబు లెన్నుచు, గర్వాంధురాలని ♦ కసరుకొనఁగ

తే॥ గీ॥ బంతి బ్యాటును జేపట్టి ♦ కలను సతికి, గల్గు సభ్యత్వ మొప్పదు ♦ కాంత కెపుడు
నాట్యరంగంబు వలవదు ♦ నాతి కెపుడు, పరపురుషుతోడి స్నేహంబు ♦ జడతి
సుగుణ. సంపదను ద్రుంచుఁ దద్రోయు ♦ జపలగతుల. 12

మాధ— నాన్నగారూ? నాకీపరమ ఛాందసమూఢశిఖామణిని దీసుకొనివచ్చి యంటగట్టినారేమి? చెల్లాయి "పెళ్లివద్దు పెదబాబో" యనుచుండఁగా నీమూర్ఖరాలు దానిచే యొద్ద ప్రతివ్రతా ధర్మములు నూరిపోయుచున్న దేమి కర్మము? చెల్లెల క్రొత్తగు వచ్చిన్ని రోజు లుత్సాహముగా జదువుకొననిండు! దానికి విసుగుపుట్టి యుండే వానివేయును.

విష్ణు— అమ్మా? ముక్తవయస్కవు అవివాహితవు నీవొంటరిగా చెన్నపట్టణములో జదువుట నాకింగీకారము కాదు. విద్యార్థ లోకతాయులు "బ్రహ్మచారీ శతమర్కటః" యని పెద్దలు చెప్పఁగా వినవుగదా? నీకులశీలమర్యాదలు మంటగల్పుదురు! నీసుపవిత్ర చరిత్రమునకు గళంక మాపాదించెదరు.

ఉ॥ కూళలు దుర్మదాంధులును ♦ గుత్సితమార్గవిచారతత్పరుల్
హేళనఁ జేసి గౌరవము ♦ హీనమొనర్చి మహాపవాదముల్
జాలయొనర్చి కీర్తియును ♦ జయ్యనఁ బాపెద రట్టివారిలో
నేలవసింప? విద్య లభియించితి విఁతియె చాలు దల్లిరో. 13

సీ॥ శీలసంపదలతో ♦ జెలగివర్తించిన, నపవాదు తప్పఁబో ♦ దన్నుమిన్న
కన్నెత్తి పురుషుని ♦ గాంచక యున్నను, గల్లలఁ గపటంబు ♦ లల్లుచుంద్రు
పోకిరివిద్యార్థి ♦ పోకమూకలఁ గూడి, వన్నెవాసియుఁదూల ♦ బాధబఱచు
దుష్టవర్గము మీటి ♦ కష్టవార్నిధిఁ ద్రోయ, చిన్నపెద్దలు రారు ♦ ప్రేమజూపఁ

తే॥ గీ॥ వాయసంబులు గుమిగూడి ♦ ప్రబలుచోట
గోకిలంబొంటినున్నచో ♦ గొప్పయగునె?
పురుషవిద్యార్థిమూకలో ♦ బువ్వబోడి

చదువుసంధ్యలు సాగునే ♦ చతురయైన
విద్యచాలింపుమమ్మ యో ♦ విమలచరిత. 14

సరస్వతి—జనకా! మీరు నా బాల్యమందు గఱపిన విజ్ఞానమంతయు మఱచితిరా? మీ సంఘసంస్కారాభిలాష స్వవిషయములో వెనుకంజవేయుచున్నదా? విద్యాభ్యాసంబునకును యౌవనంబునకును సంబంధమేమి? సంఘసంస్కర్తల బాలికలును బాలురును గలిసిమెలిసి యేకకళాశాలయందు విద్య నభ్యసించుటలేదా? పాశ్చిమ దేశంబులందెల్ల యువతీయువకులు స్త్రీపురుషవిభక్తులేక సర్వకళాభ్యసనం బొనర్చుటలేదా. మీవంటి సంఘసంస్కర్తలే తమ యాదర్శంబుల నాచరణలో బెట్టకున్న మీ సంఘసంస్కార ప్రచారమంతయు వట్టి బూటకము గాదా? మీ గంభీరోపన్యాససారాంశమంతయు భస్మంబులోఁ బోసిన పన్నీరువలె నిష్ప్రయోజనంబు గాదా? మీ స్త్రీపురుష సమానవ్యక్తి స్వాతంత్ర్యాభిలాష మడవిగాసిన వెన్నెలవలె నిరర్థకంబు గాదా? మీ సంఘసంస్కారచింత మీకన్న సంతానము విషయంబున నుపయోగింపనిచో నట్టి యభిలాష ముండియేమి? మండియేమి; మీరు నాకింక నాటంకంబులు జెప్పక విద్యాభివృద్ధికై సెలవొసంగుఁడు.

హైమ—తల్లీ! ఏదో యుబుసుపోవక సంఘసంస్కారోపన్యాసంబులు గావించిన నిజ మనుకొంటివా? సంఘాభివృద్ధి గావలసినదే. కాని దానికిమాత్రము నీతి నియమంబు లుండవలదా? పదునెనిమిది వత్సరంబులుదాటి సంతానము బడయ వలసిన వయస్సువచ్చినను నామాటఁ జెవిని జొరనీయక చదువు చదువని వేధించుకొని తినెద. వేమిపాపిష్టకర్మము! అమ్మాయి! నీ వెండమావులఁజూచి భ్రమయుచున్నావు, తళుకుబెళుకురాళ్ళన్నియు నికరంబులగు నీలంబులుగావు. పాశ్చాత్యనాగరికతా వ్యామోహంబునఁబడి యనేకకుటుంబములు పేరులేక నాశనమైనవి హైందవ సంప్రదాయంబు లనుసరింపుము. ఎంత విద్యావతి యైనను లలనారత్నంబు గృహిణియై, ప్రాణేశ్వరియై, పరమపతివ్రతా తిలకంబై, మాతృదేవతయై యార్జించిన కులశీల గౌరవ మర్యాదలు, పరీక్షలయందారితేరి యూళ్ళేలినవారికి రాబోవు! ప్రపంచము మోసంబున కాలవాలము. నీవభము శుభ మెఱుంగని పసిబాలవు. నీవు పట్టుఁబట్టక వివాహంబున కనుమతింపుము.

సర—తల్లీ! నీ కృతయుగపుమాటలు నా మనసున కింపుగావు. దేశకాలపాత్రము లనుసరించి యుక్తమైన మార్పు లొనర్చుకొననిసంఘము మారుపేరులేక నాశనమగును. కూపస్థమండూకమువలె నుండుటచేతనే భారతవర్షంబు పేరుప్రతిష్ఠలను గోల్పోయి జీవచ్ఛవంబువలెఁ బడియున్నది. యువతీమండలంబు దీర్ఘనిద్రనుండి మేల్కాంచి స్త్రీ స్వాతంత్ర్యసమరంబు సల్పవలయు. అందులకు నా విధ్యుక్తధర్మ నిర్వహణంబునకై సర్వశాస్త్రపారంగతురాలనగుట యవశ్య

కర్తవ్యంబు, నీ కుమారీరత్నంబు లోక దిగ్విజయ యాత్రార్థంబు రణదుందుభి నినాదంబులు మ్రోగించుచుండ నీవు సంతసించుటకుమారు గాఁ బిరికిమందు బోసెదవేల! శక్తియున్న చోఁ శౌర్యప్రతాపాగ్ని నిరగులుకొల్పుము, లేకున్న చో నోకమూలనొదిగి యూరుకొనుము.

హైమ—నాథా! నేను చిన్ననాఁడే విన్నవించితినిగదా! చిన్ననాఁడు మొలకై వంగనిది మ్రానై వంగునా? దీని వితండవాదము గాంక్షించినచో స్త్రీపురుషవ్యక్తి స్వాతంత్ర్యమునుపిచ్చి తలకెక్కినట్లున్నది. మీ సంఘ సంస్కరణోపన్యాసములు మనల నీగతికిఁ దెచ్చినవి. చేతులారఁ జేసుకొనిన మన ప్రారబ్ధ కర్మ మనుభవింపక బ్రహ్మదేవునివ్రాత దూషించిన ఫలితమేమి?

విష్ణు—ప్రేయసీ! కొనక కన్నసంతానంబు గావున, మముకారంబునఁ బెంచి, విజ్ఞానాభివృద్ధిఁ గలిగింపవలయునని తలంచితిని; ఇట్టిమంకుపట్టుఁ బట్టునని యెఱుంగనైతి! పామునకుఁ బాలుఁబోసి పెంచినవిధంబయ్యె; అనుకొన్న ఫలమేమి యనుభవించెదము. అమ్మా! నీవికఁ జదువుమానవా?

సర—తండ్రీ! నా స్థిరసంకల్పంబు వినుండు.

మ॥ ధనసాహాయ్యముపోవుగాక పితరుల్ దండింపగా నుండినన్
వెనుకన్ముందును సోదరుల్హితులు నన్వెన్నాడి దూషించినన్
ఘనబాంధవ్యపుఁ వర్గముల్ వదలినన్ కష్టంబు పాల్జేసినన్
జన బృందంబులు పాప మెంచినను, నేఁ సాధింతులే విద్యలన్. 15

మ॥ ఇటుసూర్యుండటు పొడ్చినన్బొడుకనీ యింద్రాదివర్గంబులన్
పటుకోపాయతదుర్నిరీక్షణులునై బాధించిశిక్షింపనీ
కుటిలత్వంబునఁ దల్లిదండ్రులును నాకున్శత్రులైపోవనీ
పటుశక్తి న్భళియంచు మెచ్చ కళలభ్యాసంబుఁ గావించెదన్. 16

విష్ణు—అట్లే కావింపుము! కాని నీవివాహ మవశ్యకర్తవ్యంబు గదా?

సర—నేను జదువుకొన్నంతకాలమును పెండ్లిపేరెత్తకండి. నాకరికాలిమంట తలకెక్కును. నాకొఱకై మీరు దేశదేశంబులు దిరిగి వరాన్వేషణముఁ జేయనక్కఱలేదు. నాకిష్టము వచ్చినపుడు, నాకిష్టమైనవానిని, నాకిష్టమైన తెఱంగునఁ బెండ్లి చేసికుందును.

హైమ—కష్టపడికని పెంచి, విద్యాబుద్ధులు జెప్పించి, కనుఱెప్పలుఁబోలెఁ గాపాడి, మాసర్వసౌఖ్యంబులు నీకై ధారవోయుటకు సంసిద్ధులమైయున్న మేము నీకు సకల సద్గుణగరిష్ఠుండైన వరుని నన్వేషింపదగనివారమైతిమా! పిచ్చికుదిరెను రోకలి దల జుట్టుమన్నట్లున్నవి నీప్రసంగంబులు. సద్విద్య వినయాది సద్గుణంబులు గఱపు ననుకొంటిమిగాని నీకిట్టి ముట్టెపొగరును, మనోగర్వాంధకారంబును గప్పునని తలంపమైతిమి. ఈనఁగాచి నక్కలపాలొనరించినట్లు,

నిన్నింత కాల మల్లారుముద్దుగా బెంచి యేమూఢాగ్రేసర చక్రవర్తి పాలు గావింపవలసియున్నదో యెఱుంగరాదు! నీవంటి పరమ మూర్ఖశిఖామణులం జూచియే పెద్దలు "స్త్రీబుద్ధిః ప్రళయావహా" యని వాక్రుచ్చిరి.

సర— వేసినట్లే వేసిన వెఱ్ఱివాఁడే గెలుచునందురు! నీబుద్ధిహీనపుమాటలకు మాఱుబలుకకుండుటయే మేలని యూరకొన్నకొలఁదిని నెత్తికెక్కి బండి నడక సాగించునట్లు నామీఁద గ్రుచ్చిపోదవలెఁ బడుచుంటి వేమి! ఇంతమ్రుచ్చుతనఁ దల్లివని యూరకుంటి గాని వేఱుగాదు. ఇక ముందు నీవు నాతల్లివి గావు. నేను నీకుమార్తెను గాను. కట్టిపెట్టు నీయధిక ప్రసంగము. నీవు నాకొఱకుఁ బ్రాణేశ్వరుని వెదకి యఘోరింపనక్కఱలేదు. నా పెండ్లికి నీపెత్తనమేమియు నక్కఱలేదు. ఇట్టియనవసర విషయంబుల సంబంధముఁ గలిగించుకొన్నచో నే నూరుకొనను.

హైమ— నీవూరుకొనక చేయునదేమి! మీనాన్నగారు సొమ్ము నీపై వర్షించుచుండుటచే నీకు గన్నులు నెత్తికి వచ్చినవి. భూమ్యాకాశంబులు దెలియుచుండుట లేదు. ఆకసంబున చుక్కలెవడు మొలిపించెరా యని తర్కించుచున్నావు. నీవు వివాహమాడకుండ నింటిలోని కాలు బయటబెట్టుటకు వీలులేదు.

విష్ణు— అమ్మా! సరస్వతీ! మే ముభయులము పెద్దవాండ్రమైనాము; పట్టణవాసపు కాపురంబుపై రోసి ప్రశాంతముగా నీపల్లెయందు సుఖజీవనము గడపుచున్నాము. మొగవాఁడుగాన నీయన్న విద్యాభ్యాసంబునకై విదేశంబేగుచున్నాడు. ఉత్తరక్షణము మనది కాదు. ఏనాటి కేమిజరుగునో తెలియదు. సమస్త జ్ఞానంబును దెలిసినదానవు, కోడలు పరిపూర్ణగర్భవతి! మనకు ముందు వెనుక నెవ్వరును లేరు! మీ రిద్దరును సోదరీ రత్నంబులవలె నుండవచ్చును.

సర— అయ్యో! మాయిద్దరి ప్రేమ మెఱుఁగుదుగనా! నిప్పునకు నీటికి యెంతస్నేహమో, యగ్నిహోత్రంబునకు దూదిపింజలకు నెట్టియనురాగమో, వ్యాఘ్రహరిణంబుల కెంత సన్నిహితసంబంధమో, హస్తిహర్యక్షంబుల కెట్టియనురాగమో మా యనురాగ మట్టిదియే. అయినను నేఁడో రేపో పరలోకయాత్రకై మూఁటగట్టుకొనియున్న మిమ్ము కనిపెట్టుకొనియుండి మీ శుశ్రూషజేయు దురవస్థ నాకేమి వచ్చె! మీయింటికోడలుగాన నేఁడు నడుముఁగట్టి చేయుటయును, రేపు కట్టెచుట్టుకొనుటయును బాధ్యురాలు. మీవంటి జీవన్మృతులఁ కన్పట్టి సేవజేసినచో క్షణములో వార్ధక్యంబు వెంటబడును. మీరు సొమ్ము పంపినను సరే, పంపకున్నను సరియే, నేను రేపు చెన్నపట్టణములో వైద్యకళాశాలలో టింగరంగా యని ప్రవేశించెదను. సొమ్ము పంపనిచో జిల్లాజడ్జీగారికూతురు ముష్టియెత్తి తినుచున్నదను కీర్తి మీకాచంద్రార్కముగాఁ గలుఁగుఁగాక!

[అని లేచిపోవును.]

హైమ—నాథా! చూచితిరా చిన్నదాని విద్యాగర్వాంధకారము. మిడిమిడి జ్ఞానఁపు బ్రతుకు లీలాగున నేయుండును. ఈ గర్వాంధకారము పాశ్చాత్య విజ్ఞానములో నేయున్నది. పతివ్రతామతల్లులైన సీత, సావిత్రి, చంద్రిమతి, యనసూయ, యరుంధతి ప్రభవించిన భారతవర్షమం దీనాఁటి కట్టి యల్పమతులు, మందబుద్ధులు, గర్వాంధకారనిమగ్నులు జన్మించుచున్నారు! కుమారా! మాధవా! మన సంసారనాటకము పరీక్షించుచుంటివా! అన్నిఁటికిని పరమేశ్వరుఁడే యున్నాఁడు. నీవు వెంటనే విదేశంబున కేగి విద్యాభ్యాసం బొనర్చి వెన్వెంట బయలుదేరి రావలయును. పరమేశ్వరుఁడు నిన్ను రక్షించుగాక.

సీ॥ ఇంగ్లాండుసీమలో ♦ నింపుగా విహరింపు మధుమత్స్యమాంసము-లానుమయ్యా
పాశ్చాత్యదేశము ♦ లాగుగా వీక్షింపు మాటపాటలతోడ ♦ నలరకయ్యా
నవనాగరికతయే ♦ యవలంబనంబైన సినిమానటీమణిఁ ♦ జేరకయ్యా
పెద్దపిన్నలుజేరి - బుద్ధిజెప్పగరారు కందుకక్రీడలఁ - గడపకయ్యా
తే॥ గీ॥ వేఁటపానంబుజూదంబు ♦ వెలఁదియీవి, యనెడువ్యసనంబులనుఁబ్రీడి ♦ మనఁగదయ్యా
చదువుసంధ్యలుమిన్నఁగా - సాకుమయ్యా, ఆర్యధర్మంబువిడక రా ♦ వయ్యపుత్ర.

## తృతీయరంగము

[మాధవరావు ప్రభావతి ప్రవేశము]

ప్రభా—మనోనాయకా! మీరెంత ధైర్యము జెప్పినను నామనస్సు పరిపరివిధంబులఁ దపించుచున్నది. అణఁచుకొన్నను నడంగక దుఃఖము పొంగి పొరలివచ్చుచున్నది.

క॥ ఎక్కడి లండనునగరం, బెక్కడి మద్రాసురాజ్య ♦ మెప్పట్టుననీ
వెక్కసమగు విరహము నే, నక్కట యెక్కరణి సైతు ♦ నబ్జదళాక్షా. 1

ఉ॥ పుట్టిన నాఁటఁగోలె తమ ♦ పోషణ పెంపునుబూనియున్న మీ
పట్టగువారిని న్విడిచి ♦ బంధువులం దిగఁద్రోసి పూజ్యులై
నట్టి దయామయిన్ జనని ♦ నంచితపుణ్యుని తండ్రి నక్కటా
యెట్టులు డించి పోయెదరొ ♦ యింకెటు దెల్పెద నాదు దుఃఖమున్. 2

ఉ॥ బాలికనైననాఁడు నను ♦ బాయనటంచును బాసజేసి నా
పాలిటి పెన్నిధానమయి ♦ పద్మదళాక్ష హృదీశ్వరుండవై
చాలమనోరథంబులను ♦ జయ్యనఁదీర్చి, సుఖంబుఁగూర్చి న
న్నేలనుజేసి వీడఁగ న ♦ పేక్షయొనర్పఁగ నేమిజేసితిన్॥ 3

మాధవ—ప్రేయసీ! వట్టి పిచ్చిధోరణిఁ బడిపోవుచుంటి వేమి? నేను గంపెడాసతో విద్యాభివృద్ధికై యేగుచుండ నీకు విచార మెందులకు?

సీ॥ చిన్ననాఁటనుగళమందు ♦ వన్నెమీఱ, మూత్రిబంధంబుఁజేసితి ♦ సుదతిమిన్న
యాక్షణంబున నీవాఁడ ♦ నైతినమ్మ, ఇంక నెటనున్న నీవాఁడ ♦ నింతనిజము॥ 4

గీ॥ వివిధ దేశంబులనుగాంచి ♦ వింతలెల్లఁ, జూచుచుండిన హృదయంబు ♦ జూచునిన్నుఁ
జదువుసంధ్యలుశాస్త్రము ♦ ల్చదువుచున్న, నిన్నుమఱువంగఁజాలనో ♦ యన్నుమిన్న॥ 5

ఉ॥ చందురుకాంతి మించుచు ప ♦ సందగు నీముఖపద్మకాంతులన్
అందము చందమున్గలిగి ♦ యాదరణం బొనఁగూర్చుచూపు లా
నంద మొసంగు పాటలును ♦ నవ్వులమాటలు తేటపల్కులన్
విందులు గూర్చుచుండ నిను ♦ వీడి విదేశమునందు నిల్తునే॥ 6

ప్రభా—ప్రాణనాథా! నేను మీయాజ్ఞ నుల్లంఘించుదానను కాను. కాని చల్లకువచ్చి ముంతదాపనేల! వివిధదేశంబుల స్త్రీ లాయాదేశాచారంబు లనుసరించెదరు, హూణ విద్యాపారంగతులగు భారతదేశయువకు లెందరో యాంగ్లదేశమున కేగి, యాంగ్లేయ వనితామణుల హావభావ విలాసంబులకు ముగ్ధులై మనదేశంబునకుఁ దిరిగిరారని తెలియుచున్నది.

ఉ॥ అక్కడి భోగభాగ్యములు ♦ నక్కడి నాట్యవిలాస సంపదల్
అక్కడిబోటుకైరులును ♦ నక్కడికన్నెల యాటపాటలున్
అక్కడి దివ్యకామినుల ♦ యందము చందము దళ్కుబెళ్కులన్
మక్కువఁగాంచుచోఁ దిరిగ ♦ మమ్ములఁ గాంచఁగ వచ్చువారలే॥ 7

ఉ॥ నీసుకుమారదేహమును ♦ నీదు శుచిస్మిత వక్త్రపద్మమున్
నీసువిశాల వీక్షణము ♦ నీనును మేనిపసిండి చాయయున్
నీసరసంపు వాగ్ఝరులు ♦ నీసువిలాసము లందచందముల్
ఏ సుమకోమలాంగికని ♦ యింపుగలిర్పఁగ మోహమందునో॥ 8

మాధవ—ప్రాణేశ్వరీ! ఇదియా నీసందేహము! ఇదియా నీసంతాపకారణంబు.

మ॥ తరుణీ! నిన్మఱువంగఁజాలనుజుమీ ♦ తథ్యంబుగా నేను, నీ
కరుణాపాంగవిలాసదృష్టు లిటు యి ♦ కాలంబునుం బాశమై
పరదేశంబులనుండి నన్ను మరలన్ ♦ వాంఛాతిరేకంబునన్
దిరుగన్జేయును ధైర్యమందు మబలా ♦ దేదీప్యకాంతిప్రభా॥ 9

సీ॥ ఆంగ్లేయవనితల ♦ యాననంబులుజూచి, మురిసిపోవఁగఁబోను ♦ ముదిత నమ్ము
విస్కి సారాయంబు ♦ విషముగా గణియించి, వానిముట్టఁగఁబోను ♦ పడతి వినుము
సినిమాలు నాట్యము ♦ ల్చిన్నె వన్నెలుజూచి, చదువుసంధ్యలువీడ ♦ సాధ్వి నమ్ము
వేటపానంబులు ♦ పెండ్లిజూదములను, వ్యసనంబులం దేల ♦ నతివ వినుము!

తే॥ గీ॥ అన్యవారాంగనలపొందు ♦ అందఁజూమ్ము, విమలవిజ్ఞానశాస్త్రము ♦ ల్వేగ నేర్చి
తరలివచ్చెద మది నమ్ము ♦ తలిరుఁబోఁడి, నిన్ను విడనాడ సత్యంబు ♦ నన్నునమ్ము॥

దేవీ! నేను చిన్నవాఁడ ననుకొంటివా చిదుకవాఁడ ననుకొంటివా? నీతో సంసారసుఖంబు లనుభవించి, తిరిగి యన్యకామినీ వదనారవిందసందర్శనమున కువ్విళ్లూరుచుందుననుకొంటివా? ఆరునెలలు స్నేహంబు జేసినచో వారు వీరగుదు రందురు పెద్దలు. అట్లెప్పుడును జరుగదని తలంపుము.

ప్రభా—జీవితేశ్వరా! చెప్పుటకు సిగ్గగుచున్నది! నోరురాకున్నది! కొలఁది దినంబులలో సంతానంబుఁగాంచ సిద్ధంబుగానున్న యిల్లాలిని వీడిపోవ మీకు ధైర్యమెట్లు గల్గె? చెన్నపట్టణంబునఁ బరీక్షకుఁ జదువునప్పుడైనను నన్ను వీడియుండరే! ఇప్పుడు నన్ను వీడఁమనసెట్లు వచ్చె! నన్నుఁగూడ వెంటఁగొని పోరాదా?

మాధ—నాజీవితప్రభా! నేనొక్కఁడను వెళ్లుటకే తలిదండ్రులంగీకరింపనపుడు, నీవు నాతోవచ్చుట కంగీకరించెదరా! కొలఁది దినంబులలో మన నోములపంట యగు శిశువునకుఁ దల్లికాఁబోవు నీకు విదేశయానంబుగూడదు! నీ వెందులకు నా వెంట వచ్చెదనన్నదియు నాకుఁదెలియును! పర స్త్రీలవెంటఁబడు నవ్యక్తినిగా నన్నెంచవలదు! మనపిల్లకు సంవత్సరంబు వెళ్లక పూర్వమే నేను దిరిగి వచ్చెదను. నీవింటియొద్ద నుండనిచోఁ బూజ్యులైన తలిదండ్రులు దుఃఖసాగరంబునఁ జిక్కెదరు.

ప్రభా—మనోనాథా! మీరు చెప్పినది నిజమేకావచ్చును. కాని మీరు విదేశయాత్రఁ దలపెట్టి నప్పటినుండియు నా హృదయసంతాపం బెచ్చుచున్నది. తాఁబట్టిన కుందేటికి మూడేకాళ్లని మీరు పట్టినపట్టు విడవరు. అత్తమామలు పండుముసళ్లి. కుమారవియోగవ్యథా సాగరంబునకుఁ బారంబుఁ గనఁజాలకున్నారు. వదినెయు భల్లూకఁపుఁబట్టుఁ బట్టి యిటు సూర్యుఁడటు పొడిచినను దన విద్యావ్యసనంబు మానననుచున్నది. సమస్తవ్యవహారంబులును దక్షతతో నిర్వహించు మీరు చెప్పులలోఁ గాళ్లుబెట్టుకొని నేడో రేపో స్టీమరెక్కఁబోవుచున్నారు. ఈ వ్యవహారంబు లెట్లు చక్కఁబడునో పరమేశ్వరునకే యెఱుక!

మాధవ—జీవితేశ్వరీ! కష్టసమయమునందు ధైర్యమవలంబింపవలయునుగాని దుఃఖింపరాదు! "సాహసం లక్ష్మిః"యని పెద్దలందురు. అవసరమైనచో మీతండ్రిగారి సాయంబుఁబడసి వ్యవహరింపుము. ఈ సంవత్సరంబు గను పూనినచోఁ దిరిగి వచ్చి నీ శీతలకరుణాకటాక్ష పాత్రుండనై నీ కనుసన్నల మెలఁగెదను! నేను దిరిగి వచ్చిన తరువాత నాయెత్తుధనంబు పోసినను నిన్నొకక్షణంబైనను విడువఁజాలను.

ప్రభా:—

చ॥ సరసిజపత్రనేత్రకను ♦ సన్నలయాజ్ఞల నిర్వహించి నీ
కరుణకుఁ బాత్రగాలనయి ♦ కంటిశుభంబుఁ జిరాయురున్నతుల్
మరునిశితంపుఁ గోలలకు ♦ మానక నన్నిటు పాలుజేసి మీ
రరుగుట కూడ దింక నను ♦ నాకులపాటొనరింప నేటికిన్.

సీ॥ చెలియరమ్మని నన్నుఁ ♦ జేరఁదీయుదు గాని, యెడఁబాసి పోవుట ♦ యెఱుఁగ వీవు
ప్రాణేశ్వరియటంచుఁ ♦ బ్రతిమాలుదువుగాని, కోపించి బాధించి ♦ కొట్టరావు

నామనోహారియంచుఁ ♦ బ్రేమించి భాషింతు, వాగ్రహంబున మీఁది ♦ కరుగుదేర
వమృతభాషిణియంచు ♦ ననయంబు మందహా, సముతోడఁ గామితా♦ర్థములఁ గూర్తు
గీ॥ మదన సామ్రాజ్యమేలించి ♦ మహితగతిని, సర్వశుభముల నొనఁగూర్చి ♦ సారసాక్షి
నన్ను విడనాడ న్యాయమే ♦ సన్నుతాంగ, నీదువిరహంబు నైపంగ♦నాదుతరమె.

సీ॥ నినునిముసంబుజూ♦చిననాఁడు చిత్తమా, నందవారాశిమ♦గ్నమగుచుండు
నీతోడమాటాడి ♦ నీపాదములుఁ బట్టి, స్వర్గీయసౌఖ్యంబు ♦ బడయుదాన
నీసేవ నేఁ జేసి ♦ నీకౌఁగిలివసించి, మదనతాపంబును ♦ మఱచుదాన
నీకన్నుసన్నల ♦ నీయాజ్ఞ లొనరించి, దైవపూజలు వేఱ ♦ దలఁచకుందు
తే॥ గీ॥ నీదుచెక్కిలి ముద్దాడి ♦ నిన్నుఁ గలసి, మదనసామ్రాజ్య సౌఖ్యంబ♦మందగతిని
ననుభవించితి ననువీడి♦యవలద్రోచి, వివిధదేశంబులకుఁ బోవ♦ వేడ్కయేల. 13

మ॥ ధనధాన్యంబుల నిండ్లువాకిళుల నా♦థా వీడఁగావచ్చు ని
న్గని విద్యాసుగుణంబుల న్నెఱపు నీ♦గారాబుతండ్రిన్ భవ
జ్జనయిత్రిన్ విడువంగవచ్చు నను నీ♦జాయామణిన్ వీడఁగా
ననువౌ నైనను నీదుబిడ్డవిడువన్ ♦ న్యాయంబుగాదో ప్రియా. 14

సీ॥ అన్యదేశములందు ♦ నతివలఁ జూచుచోఁ, బ్రాణేశ్వరీప్రేమఁ ♦ బాయకయ్య
వివిధశాస్త్రములందు ♦ విజ్ఞానమును గాంచి, నీదాసురాలి మ♦న్నింపవయ్య
పాశ్చాత్యవిద్యల ♦ పారంగతుండవై, యాఁడుబిడ్డలఁ బ్రేమ ♦ నరయుమయ్య
యున్నతోద్యోగంబు ♦ సన్నుతిగాంచుచోఁ, దాతతండ్రులయాజ్ఞ ♦ దప్పకయ్య
తే॥ గీ॥ నవ్యనాగరికతచేత ♦ సవ్యమైన, యార్యధర్మంబు పాలించి ♦ యందరాని
యాయురారోగ్యసంపద♦లందుమయ్య, సకలసద్గుణసంపూజ్య♦సన్నుతాంగ. 15

## చతుర్థ రంగము.

[కల్యాణమండపము - విమలాపద్మనాభరావు లొక పెండ్లిపీటమీఁదను అనసూయాచ్యుతరావులు మఱియొక పెండ్లిపీటమీఁదను నాసీనులైయుందురు కేశవరావు, పెండ్లికుమారుల తండ్రులు వామనరావు జనార్ధనరావు, పురోహితులు వెంకటశాస్త్రి పుల్లంభొట్లు, శివరావు నాసీనులైయుందురు. కాంతిమతి, సుప్రభ, సుశీల మొదలగు స్త్రీలు ప్రక్కగా నిలచియుందురు.]

పుల్లం—అయ్యా, చెప్పలేదనుకొనెదరు! ముహూర్తము వేళ సమీపించుచున్నది. మీ మీ కట్నములు, లాంఛనములు, నడవళ్లు, వియ్యఁపురాలి కట్నములు, ఆడుబిడ్డలకట్నములు, బావమరది మర్యాదలు పూర్తియైనవా? ముహూర్తము జరిపింపవచ్చునా?

వెంకట—ఆదేమిటండి శాస్త్రులుగారు! కలహమున కంకురార్పణముఁ జేసెదరేల! మనపని మనము గానీయకూడదా? ఆలాంఛనాలుగింఛనా లిప్పుడే జరుగవలెనా

యేమి? ఉభయులును గావలసినవారు, చదువుకొన్నవారు. వారిలో వారు రాబడులు, గీబడులు నెప్పుడైనను జూచుకొందురు. ముహూర్తము జరిపింపవయ్యా! స్వామి! దుర్ముహూర్తముగూడా సమీపించుచున్నది.

వామన—వారికిఁ దోచినది వారు చెప్పినారు. మీరు మీరు ముఖము చెండుకొందురెందుకండి! ఎందెందులకైనను మంచిది. మంగళసమయము! మహాసభ! ఆ యిచ్చేడు కట్నమును పదిమందిలోనిచ్చిన బాగుగనుండును.

జనార్ద—బావగారు! పెద్దతహశ్శీల్దారు చేయుచు సందేహించెదరెందులకు? సంచులను దెగగోయించండి! ఎవరికిఁ దెలియకుండ నే మామూలనో యిచ్చినఁ బేరుప్రతిష్ఠలేమివచ్చును! ఏమంత దొంగభయము! ఇదేమి చేయరానిపనియా? దొంగతనమా! రంకుతనమా సిగ్గుపడుటకు! ఈ కట్నములు మీ నాఁడు మా నాఁడు రాలేదు! ప్రపంచము పుట్టినప్పటినుండియు వచ్చుచున్నవి! మహారాజు బిడ్డలవలె మేము పుచ్చుకొందుము! లక్షలిచ్చినను వద్దనము! మీరు మహారాజులవలెఁ గన్యాదానము గొప్పగాఁ జేయవలెను.

వామన—శుభస్య శీఘ్ర మన్నారు. తెప్పించండి సంచులు.

పుల్లం—అయ్యా! తప్పదు. త్వరగా లోపలకు వెళ్ళిరండి! నలుగురిలో నిచ్చుటయే పెద్దమనుష్యుల లక్షణము.

[కేశవరావు లోనికేగి యొకదానిలో 1500 రూపాయలును, రెండవదానిలో 1000 రూపాయలును బోసి రెండు పళ్లెములును బెండ్లికుమారుల కీయఁగా వారి తండ్రులు సొమ్ము లెక్కఁబెట్టుచు నొకరిపై నొకరు చుఱచుఱఁ జూచుచుందురు.]

వెంకట—అయ్యా! సావధానముగా లెక్కఁబెట్టుకొనవచ్చును, ముహూర్తము కానీయమందురా!

పుల్లం—కేశవరావుగారూ! తాము పెద్దలు! రెండువివాహంబులు జయప్రదంబుగా జరుపుచున్నారు! చిన్ననాఁటనుండియుఁ దమ్ముఁ గన్పెట్టుకొనియున్నాము. ఆశ్రితులము. మమ్ముఁ జిన్నచూపు చూడవలదు.

కాంతిమతి—వశిష్ఠుగారూ! మీగొడవ మీదేగాని మాసంగతి చెప్పరేమయ్యా! వియ్యపురాలి లాంఛనఁపుసొమ్మేది?

భారతి—ఆడబిడ్డలాంఛనములేవి! నడవళ్లెక్కడ? అన్నకు బెస్కీ లేదే? ముంజేతి గడియారము, బంగారపుగొలుసు, వెండిపళ్లెములు, మరచెంబులు, పట్టుతాప్తాలు, రత్నపుటుంగరము, రవ్వలయంటుజోళ్ళు, బంగారు మొలత్రాడు, యీ సామగ్రియేమియుఁ గానబడదేమి? నాకండ్లు బైరలుకమ్మి కనఁబడుచుండుట లేదా? నిజముగా వారు తీసికొనిరానేలేదా?

చ॥ కలితమకూలవస్త్రములు ♦ గన్నుల కందముగూర్ప వేలొకో
తళతళ కాంతులీనుచు ముదంబిడు పాత్రలు గల్గ వేలొకో
వలయవు కంకణంబులును ♦ బెంపగురత్నవిభూష లేలొకో
తెలిసె నయారె! గౌరవము ♦ తెంపున మానుడి యిట్టికార్యముల్.

జనార్ద—కొంచెమాగండి! ఆడవాండ్లతో వట్టిగడబిడ, గందరగోళము! మాట మంచి తోఁపనీయరు. ఏమిచెప్పవమా యీ విపరీతము! ఆపల్లెములో రొక్క మెక్కువ యీపళ్ళెములో రొక్కము తక్కువగాఁ గనఁబడుచున్నదేమి? ఏకకాలమందు రెండు కన్యాదానంబులానర్చుచు, నొక వరున కొకవిధము గాను, మఱియొకనికి వేరొకవిధముగాను గట్నమొసంగవలెనను పాడుబుద్ధి మీ తలలో నేపుట్టినదా? లేక యే తెలకుమాసినవాఁడైనను జెప్పినాఁడా? అట్లుచెప్పినను, వినుటకు మీవివేకము మంటఁగలసినదా? మీ బుద్ధి గడ్డిగఱచినదా?

శివ—అయ్యా! మహాసభ! అనేకమంది పెద్దమనుష్యులున్నారు. గౌరవహీనముగాఁ బల్కుట పాడిగాదు! మీకు సమాధానముఁ దరువాత చెప్పెదను.

జనార్ద—నలుగురిలో మాకుఁ దలవంపులు చేసినతరువాత, నీ సమాధానములు గిమాధానము లెవరికిఁగావలెను! మీవంటివారితో వియ్యమందుటయే మాకుఁదప్పు. ఎప్పుడు మీరు సొమ్ముఁ దీసికొనిరాలేదో, మీ మాయామర్మము లప్పుడే గ్రహించితిని! మసిబూసి నేరేడుకాయఁ జేయఁదలఁచినారేమో? ఆ యాటలు సాగిరావు! నాదగ్గర ఆపప్పు లుడకవు! అవులించినఁ బేగులు లెక్కబెట్టువాఁడను? నన్నేమనుకుంటిరో! హనుమంతునిముందరనా మీకుప్పిగంతులు!

శివ—తామంత యాగ్రహముఁ జెందెదరేల! మీలోఁ బరిష్కారము చేసుకొన్న వేయి రూపాయలు గుమ్మరించితిమిగదా మావలన లోపమేమి?

జనార్ద—పరిష్కారము చేసుకొనుటకు వంకాయలా, తోటకూరా? నీ చేతఁగాకున్న నాకోజాననే తలమీఁద గుడ్డవేసుకొని పోకపోతివా? తగుదునమ్మా యని పెత్తనముఁజేయవచ్చి యిద్దరల్లుండ్రకు నొక్కమాదిరిగాఁ గట్నమిప్పింపక యింత పక్షపాతమా? ఒకకంట వెన్నయును, నొకకంట కారమును జల్లెదవయ్యా! ఇట్టి బుద్ధితక్కువ పను లెన్నటికినిజేయక తక్కిన రు 500 కూడ తక్షణమే యిట్లు పాఱబోయింపుము!

చ॥ చదువులు గొప్పగాఁ జదివి ♦ సద్యశ మెంతయుఁ జూఱఁగొంచు నీ
మదిఁగడు నెగ్గు సిగ్గులును ♦ మాని యిటుల్జరియింపఁజూతురే
యదయుఁడఁ గాచుకొమ్ము నను ♦ నల్లునికి న్బదు నైదువందలు
న్వదిలము జేసియిచ్చెదవొ ♦ పాడొనరింతునో యీవివాహముల్.

చ॥ తెలిపెద నాపరితాపమును ♦ దెల్లముగా విను బాలికామణి
న్బలిమిని బుట్టుగ్రుడ్డికి వి♦వాహముఁజేసితి ద్రవ్యకాంక్ష చేఁ
గలుషపుఁ గల్పనన్వేదకి♦కష్టములన్గడిపించి గోడలి
న్వెలిఁబడఁ ద్రోయఁజేసి వెను♦వెంట నెగూర్చితి వేలరూప్యముల్.

శివ—అయ్యా! కోప ముపశమింపుకొనుఁడు! మాయక్క దురదృష్టవశంబున నామె గర్భంబున నాడుపిల్లలసంపదయే యెక్కువ. మీగర్భవాసంబున మొగసంతాన మేగాని యాడుపురుగు పుట్టలేదు! ఆడపిల్లలనుగన్న తలిదండ్రుల యవస్థ తమ కేమి తెలియును! ప్రథమంబునఁ దమతోఁ జేసుకొనిన పరిష్కారప్రకారము ధన మొసంగితిమి! తిరిగి మమ్ము బాధింప న్యాయమా! ముహూర్త మతిక్రమించు చున్నది.

జనార్ద—ముహూర్తము గిహూర్తము తరువాతఁ జూచుకొనవచ్చును. మీరు తక్కిన పైక మిప్పింపకపోయినచో మీ శవపెండ్లి మాకక్కరలేదు! అచ్యుతా యివెధవా? వాజమ్మవలె మొగము దిగాలుపడి కూర్చుంటివేమి! కండ్లు ప్రత్తికాయవలెజేసి దరిద్రపుఁబెద్దమ్మవలె నట్లేడ్చెదవేమి లేచిరా! నీమొగమునకు సిగ్గుసిరములేదా! ఆ పెండ్లికొడుకునకు 1500 లిచ్చి నీమొగాన ముష్టివేయిరూపాయలు బడవేసి నప్పటికి నింకను సిగ్గులేక యేమొగముతోఁ గూర్చుండెదవు!

[అని పెండ్లిపీటమీదనుండి యచ్యుతుని బడలాగి లేవదీయును. అనసూయ యేడ్వసాగును. శివరా వచ్యుతునిఁ బ్రతిమాలి తిరిగి కూర్చుండబెట్టును.]

సుశీల—అనసూయా! నాతల్లీ! యేడ్వకమ్మా! తప్పు! కొరపూపసపొట్లమిదిగో. భయము లేదు! బాజాలు వాయించుచున్నారు విను!

విమల—(జనార్దనునిజూపి) అమ్మా! ఆయన మామను గొట్టునాయేమి! కొట్లకుక్కవలె నట్లరచి పోట్లాడుచున్నాఁడేమే.

జనార్ద—అయ్యా! చాలుచాలు! మహాబాగుగాఁజేసినారు! తహశ్శీలుదారుగారితో సంబంధమనుకొనఁగా నేమో యనుకొన్నాను. "ఇంటిపేరు కస్తూరివారు యింటిలో గబ్బిలాలకంపు" పన్నట్లున్నది. ఇంటిలో నీగలమోత వెలుపలఁ బల్లకీల మ్రోతవలె నున్నది.

చ॥ ఘనమగు గౌరవంబునను ♦ గ్రాలుచునుంటి నటంచు నెంతువా
నినుబెను బాధబెట్టెదను ♦ నీపయి పెక్కు లభూతకల్పన
ల్బనివడిగూర్చి నిందలను ♦ బాగుగమోపి శిరంబుసిగ్గుచే
తను బయికెత్తఁగా వలను ♦ దప్పఁగఁజేసెద నాధుశక్తిచేన్.

ఉ॥ తిట్టుల కింతయు న్వెఱువ ♦ దీపన మెట్టిదొ నే నెఱుంగ నేఁ
జట్టినపట్టు బ్రహ్మయును ♦ వచ్చిన వీడఁగ నొల్ల నేను నీ
పట్టికి భూషణావళియు ♦ బాలునకున్బదునైదువందలు
న్నెట్టనపాఱబోయుమిక ♦ నేసహియింపను నీదునైచ్యముల్.

మావాని కిపుడు పెండ్లియే చేయను. మీరు కాళ్ళ వేళ్ళఁబడి బ్రతిమాలు కొనుటవలన నొప్పుకొన్నానుగాని కాకున్న నాకుర్రకుంక కిప్పుడు పెండ్లి యేమిటి? ఇంకొక రెండుక్లాసులు చదివించిన నింకను 500 ఒడిలోఁ బడఁగలవు? మీసొమ్ములో నింతవరకు మాకనవసరమైన ఖర్చులక్రింద యైన రు 500/-లు పోను తక్కిన పైక మిదుగో జాగ్రత్తపెట్టండి! నాల్గుఁబండ్లు తెప్పించవోయి! రైలువేళ దాటుచున్నది! ముందు వెనుక లరయకుండ నంగీకరించినందులకు మనకు మంచిపాఠమే నేర్పినారు తహశ్శీల్దారుగారు.

శివ—(కేశవరావుతో సంప్రదించి) పీటలమీఁద పెండ్లి పడగొట్టుట గొప్పకాదు. అటులనే మీయాజ్ఞ శిరసావహించెదను లెండు. ఇదుగో యీ మొత్తమునుకూడ దీసుకొని యంగీకరింపుఁడు [అని 500 రూపాయలు యిచ్చును]

చ॥ కటకట యిట్టికష్టములు • గల్గఁగఁ బాపము లేమిజేసితి
న్దటుకున బాలనిచ్చి కడు • ధర్మపథంబునఁ బోవనుండఁగాఁ
గుటిలమనస్కులై యిటుల • క్రూరతచేఁ గడు ద్రవ్యరాశుల
ల్కటుతరమైన యాగ్రహము • బైకొన దోచుకొనంగ న్యాయమే॥

చ॥ మనమునఁ గూర్మితోడ బుధ • మానితుఁ డల్లుఁడటంచు నెమ్మది
న్ఘనముగఁ జూడఁగావలెను • గానుకలిచ్చి బహూకరింపఁగాఁ
జనునని యత్తమామలు ని • జంబగు ప్రేమనొసంగునట్టిదే
గొనవలెఁగాని బాధలను • గూర్చి తపింపఁగఁ జేయ నాయమే.

జనా—అబ్బా! ఎంతవారలండి! (నవ్వుచు) ఇదియొక గమ్మత్తుఫార్సు చేసినారే! ఈ పెద్దలయెదుట నానోటిదురుసుతనము బయటవేసినారు! కానీయండి! ఐన దానికిఁ జింతించి లాభములేదు! ఇక ముహూర్తము కానీయవచ్చును.

వామన—బావగారూ! అన్నగారిని సమాధానము జేసినారు బాగుగానేయున్నది! మంచిమాటే! మాదికూడ పిల్లసమేరి యొకటియున్నది? దానికిఁగూడ సమాధానముఁ జెప్పవలెను.

కేశవ—పానకములోని పుల్లవలె తిరిగి యేమైన నట్టుపడి రసాభాసము గలుగునా యేమి దైవమా!

శివ—అయ్యా! ఆడుపిల్లల వివాహంబులుగదాయని మెత్తనివారినిజూచి స్పుంజినివలె నెత్తురుమాంసము పిండుటన్యాయంబుగాదు?

వామన—నేనింకను నోరెత్తకపూర్వమే నాపై నక్షింతలు వేయుచున్నారేమి! అన్నగారు 500 రూ॥లున్ను క్షణములో నొడిలోఁ బోయించుకొన్న నేమనలేక పోయిరిగాని నామీఁదికా దండయాత్ర!

చ॥ అతనికి వేయి యొప్పుకొని ♦ యాపయి రొక్కము నైదువందలే
కతమున నిచ్చినారుకద ♦ కల్లలు దూషణభూషణంబులం
దితరులు మమ్ముఁబోలరుసుఁ♦డీ సుకుమారుఁగుమారు నింకనే
వితమున గారవించెదరొ ♦ విద్యల నేర్పిన యీసరస్వతిన్.

ఇట్టిశుభకార్యంబులలో మగవాండ్లను నిమిషములో సంతోషపెట్టవచ్చును! ఆడువాండ్ల లాంఛనములు, నడవళ్ళు సక్రమముగా నడవనట్లాయెనా చివరకు ముప్పతిప్పలు పడి మూడుచెరువుల నీరు త్రాగవలసివచ్చును. మీకుమార్త యత్తతోను, నాడుబిడ్డలతోను గాపురము చేయును గాదా! అట్టిచో వారిని ముందు సంతోషపెట్టవలెను. అత్తకొక నూటపదారును, ఆడుబిడ్డల కందరకు కలిపి నూటపదారును నిచ్చి తీరవలెను. గొడ్డును గొనునపుడు పలుపును గొనుటకు వెనుదీయవచ్చునా?

ఉ॥ పిల్లని కేమిగప్పుదురొ ♦ వియ్యపురాలి నికెట్లు జూతురో
పిల్లల వాడబడ్డలను ♦ ప్రేమముతో నెటుగారవింతురో
య[illegible] మెచ్చ నెట్లు మను ♦ నూర్జితశక్తి బహూకరింతురో
యల్లుని గౌరవింపఁ దమ♦యట్టి మహాత్ములు దీసిపోదురే.

తే॥ గీ॥ గొడ్డుఁగొనువారు పలుఁపును♦గొనక లోభ, తత్పరత వెనుదీయఁగాఁ♦దగునె యెందు
నల్లునకు వేలు ధనములఁ ♦ గొల్లఁబెట్టి, బంధువర్గంబుఁ బ్రేమతో ♦ వలదెచూడ.

శివ — స్వామీ! తాము చెప్పినది ముమ్మాటికిని వాస్తవము.

తే॥ గీ॥ కల్లకపటంబులనుబల్కు♦కాంతుతోడఁ, గట్నములు లాంఛనంబులు♦గైకొనుండు
ఎద్దుపుండును విడుచునే♦యెందుఁగాకి, పెనఁగి నెత్తురు కండలఁ♦బెఱుకుఁగాని.

భరతవర్షంబునందలి వరవిక్రయము గొడ్లబేరముకన్న నతిహీనముగా నున్నది. కాని మేమిట్టి చిక్కులు ముందు యోచించియే యీచిల్లర లాంఛనంబులన్నియుఁ గలిపి మీకివ్వవలసిన మొత్తము స్థిరపఱచుకొంటిమి. మామాటయందు నమ్మకము లేక మాబావగారిచేత వ్రాయించుకొన్న కంట్రాక్టు కాగితము బయట పెట్టండి. అందు "సర్వలాంఛనములతో సహా"యని వ్రాయఁబడి యున్నదో లేదో చూతము!

వామన — వెనుకటి గాథ లన్నియుఁ ద్రవ్వకండి. వినదేమోయైనది! పెండ్లిలోఁ గలహము వచ్చును పంచాయతీ చేయవలెనని కంట్రాక్టు ఉత్తరము బొడ్డులోఁ బెట్టుకొని వచ్చితినాయేమి! సర్వసిద్ధమైన వివాహమున కొటంకముఁ జెప్పకుండ నేదో యొకమాదిరిగా వియ్యఁపురాలి కట్నము, ఆడుబిడ్డలకట్నము, వెండి చెంబులు, వెండిపళ్లెములు, పట్టుతాప్తాలు, సైకిలు, రిస్టువాచి, చేతిగొలుసు, కండ్లజోడు, కాలిచెప్పులు, మొలకుమొలత్రాడు ఛత్రచామర వాహనాందోళికాది సమస్తపరికరంబులకిందను 400లో 500లో యిట్లు పాఱవేయండి.

జనార్ద—అన్నగారు వామనరావుగారు చెప్పినది యుక్తియుక్తముగానున్నది. వీరితో పాటే మాకును! ఏమిచేయుదుము! కొంచెము నోములునోచి, హిరణ్యాక్ష వరంబులు గోరినచో సమకూరునా? రెండు వివాహంబులు జరుపునపు డిద్దఱల్లుండ్రనొక్కమాదిరిగానే చూడవలెను. మీ కూతుండ్రిద్దఱు నెట్లు సమానులో యల్లుండ్రిద్దఱునుగూడ నట్లు సమానులే!

శివ—అన్నగారూ! తా మాగ్రహింపకుఁడు! వామనరావుగారికి గంపెడు కూతుళ్లుండుటచే వారాడుబిడ్డకట్నమడుగుటలో సబబున్నదిగాని మీ రట్టి దురదృష్టవంతులుగాక మొగసంతానంబును మాత్రమే కన్నవారగుటవలన నాడుబిడ్డకట్నమడుగుటలో నర్థమున్నదా? న్యాయమున్నదా?

జనా—'దూడయుండఁగాఁ బలుపుండఁగా, గుంజకుఁబుట్టెరా గుఱకతెగు ల'న్నట్లు కన్యప్రదాతయు, వారిభార్యయు నుండఁగాఁ బ్రతివిషయమును దమనెత్తిని వేసుకొని చీవాట్లకు గుఱియగుచున్నారే! ఫీజులేకుండ వకాలతుఁ బుచ్చుకొని కంఠశోషతో వాదించుటెందులకు? మీ రడిగితిరి కాన సమాధానము వినుండు! ఆడుపిల్లలు మాకే యుండనక్కఱలేదు. మాయన్నదమ్ములలో నెవరికుండిననుండవచ్చును! ఇదివఱకు లేకున్ననిఁకఁ గలుగఁగూడదా? అట్టి యభావమందే బొమ్మనైనను మాయాడుబిడ్డగా నెంచుకొనవచ్చును. అదియుఁగాదందురా యాడుబిడ్డ కట్నముగూడ వియ్యఁపురాలి కట్నమునకే ముడిపెట్టుఁడు? అదియుఁగానిచోఁ బిల్లవానికీయవలసిన యితరలాంఛనములులేవా? వానిలోఁ జూచుకొనవచ్చును.

తే॥ గీ॥ ఆడుబిడ్డలు లేకున్న • నందరాదె, కట్నములు కొనక్కలునుజాలఁ • గాంక్షతోడ
లేరె మావంశమున మాకు • లేక యున్న, నెందఱో బాలికలు? ధన • మీయవలయు.

కానవృథా ప్రయాసములతోను, శుష్కవాదంబులతోను గాలక్షేపంబు జేయక సొమ్ముఁ దెప్పింపుఁడు? మా యుభయసంబంధములవారికిఁ బ్రతివిషయములోను సమానముగాఁ జూడవలసినదే! మీకష్టనిష్ఠూరములతో మాకు నిమిత్తములేదు? ఒకతములపాకు తొడిమ యంతైనను లోపము రాఁగూడదు. మీ కటు లంగీకారమైనచోఁ జెప్పుఁడు. లేనిచో మా మూటముల్లెలు దర్లించుకొని యీక్షణంబుననే రైలెక్కెదము! అంతియేగాదు, మిమ్మునుగుఱించి యున్నవి లేనివి కల్పించి బంధుజాలములో మిమ్ము దూర్పారఁబట్టెదము! మావానికి వివాహంబు గాకపోదు! మాబ్రహ్మచారి ముదిరి బెండకాయకాఁబోవుచుండుటలేదు. ఎప్పటికైనను బ్రాప్తమున్నచో రెండవజంధ్యపుఁబోగు పడును! లేనిచో బ్రహ్మచారిగానే చిరంజీవియై యుండును! తొల్లి శుకుఁడు, భీష్ముఁడు, హనుమంతుఁడు, విఘ్నేశ్వరుఁడు బ్రహ్మచారులుగా లేరా? విఘ్నేశ్వరునివివాహమునకు వేయి విఘ్నంబు లన్నట్లు మావాని వివాహమునకుఁగూడా యట్లే జరుగుచున్నది! చివరవఱకుఁ దుదముట్టునను ధైర్యంబులేకున్నది! క్షణక్షణంబు

నకుఁ పైసపైసకు మీనమేషంబులు లెక్కఁబెట్టువారిని మిమ్మే చూచితినిగాని నాకిట్టివా రితరులు కనుపడలేదు! సొమ్మున్నతరువాతఁ దానుదినక కూతుండ్లకు నల్లుండ్రకీయక, మీతోఁగూడ రూపాయల సంచులు బరలోకంబునకుఁ దీసుకొని పోయెదరా? లేక మీపాడెతోఁగట్టి యాడబ్బునుగూడ దహనంబు జేసెదరా? మీమొగంబులు జూచిన మలభక్షకులవలె నున్నారుగాని పప్పుగూడు భుజించు బ్రాహ్మణోత్తములవలె లేరు! మీప్రాణములకును సొమ్మునకును లంకె వేసినారే! చిట్టచివరకు మీసొమ్మంతయుఁగడిగి యానీరు తులసితీర్థంబువలె గుటకలువేసినఁగాని మీ ప్రాణంబు లీలోకంబు విడువవు. నాప్రతాపమింకను దెలియదేమో జెప్పెద నాకర్ణింపుడు.

సీ॥ సరసీరుహాక్షిని ♦ బరమఘాందసియంచు, వనితామణినిద్రోసి ♦ ప్రజ్ఞగంటి
భూలోకసుందరి ♦ బుద్ధిలేనిదియంచు, నతివనింకనొకర్తు ♦ నరయనైతి
శుకకోకిలాలాప ♦ శుద్ధమొద్దనియెంచి, బాలికనొకదాని ♦ వదలియుంటి
చంద్రబింబానన ♦ సరిగాదనుచు దూరి, పీటలపైఁ బెండ్లి ♦ విడిచియుంటి

తే॥ గీ॥ గట్నములు జాలకుండుటే ♦ కతముసుమ్ము.
కట్నమింపైనఁ గానుక♦ల్గనులఁ బడిన
లాంఛనంబులు మించిన ♦ వాంఛజేసి
కుంటియని గ్రుడ్డియని లెక్క♦గొనక బాల
నిచ్చి పరిణయ మొనరింతు ♦ నింత నిజము.

♦వ—అయ్యా! క్షమించండి! పీటలమీఁదఁబెండ్లిఁబడఁ గొట్టవద్దు, మేమాడుపిల్లలను గల్గిన వారమగుటచే మీరెన్నియనినను మేము పడకమానము! కానున్నది గాక మానదు! చెడ్డచేనుకు రెండుమంచెలు గావలెనా? ఈ కన్యాదానంబులవలన నాయక్కయు బావయు జోలెఁగట్టుకొని యింటింట బిచ్చమెత్తుకొనవలసిన వారైయున్న నది తప్పదు! ఏదో గౌరవముగాఁ గాలము వెళ్ళవేయవలయునని మాబావతలంచెను గాని యట్టి యదృష్ట మా నిర్భాగ్యునకుఁ బట్టదు! మీ మీ కోరికలన్నియు నీనాఁడే తీర్చుకొనుఁడు! ఎద్దుపుండు కాకికి ముద్దుకాదుగదా? పుస్తె మూడుముళ్లు పడినతరువాత మీ కోరికలు, ముచ్చట్లునచ్చట్లును దీరవేమో? ఈ యైదురోజులును భృత్య భృత్యులమై మీ పాదసేవఁ జేయువలసినవారమే! కొండమీఁది కోతిని గోరినను దెచ్చియిచ్చెదము! మూలనున్న ముసలమ్మకైన నంగరంగ వైభవంబులు జరిపెదము! నిరక్షరకుక్షికైన నడుగులకు మడుగులొగ్గెదము, కుంటికోనమ్మకైనను మేళతాళము లొసంగెదము! మూడుకాళ్ల ముసలి కాటికిఁగాళ్లు చాచుకొన్నను మోటారు లొసంగెదము! మూల మూలల సొమ్ముబూజుపట్టినను కట్నములకును గానుకలకును దేవురించి పెండ్లికూతురు వారిని జలగ రక్తము బీల్చునట్లు పీల్చి బుక్కాపకీరులను జేసినచో మావంటి యభాగ్యులుచేయఁదగిన దేమి? ఇదిగో సొమ్ము మీ యిష్టమువచ్చినట్లొసంగితిమి! ఇక మమ్ముఁగృతార్థులఁజేయుఁడు (అని వారలకిద్దరకు చెరియొక రూపా

యలమూట నొసంగఁగా వారు లెక్కఁబెట్టుకొనుచు మందహాసముఁ జేయుచుందురు).

జనా—ఈ త్యాగము మొదటనేయున్నచో నీ పాటికి వివాహములు పూర్తియయ్యెడివే! వశిష్ఠుగారు మైలుబండికలె తంతు నడపండి!

వెంకటపుల్లంభొట్లు—పెద్దలు మిమ్మాశ్రయించుకొని యున్నాము! తహశ్శీల్దారుగారి రక్తమాంసంబులు పిండివేసినారు! ఆయన జీవచ్ఛవమువలె నొక మూల గూలఁబడినాఁడు చూడండి! మా మాట మరువవలదు! మమ్ముఁ జిన్నచూపు చూడవలదు.

వామన—కానివ్వండయ్యా! ఒకటే కాకిగోల! చూచెదమన్నారుగా మా అన్నగారు!

వెంకటపుల్లం—అయం ముహూర్తస్సుముహూర్తోస్తు.



# అభినవసరస్వతి

## ద్వితీయాంకము

### ప్రథమరంగము

[లండనునగరమున నొక గృహము- మాధవరావు చదువుకొనుచుండును.]

మాధవ—ఆహా! నే నెంత ధన్యతముండను. నాజన్మ నిక్కంబుగాఁ దరించెను! నా జీవితము సాఫల్యమందెను.

సీ॥ దేవేంద్రుభువనంపు • దీప్తిఁ బెంపఁగఁజాలు, నుత్తుంగసౌధంబు • లోలివెలయ
నందనోద్యానంబుఁ • గిందుపఱుపఁజాలు, శృంగారవనము లెచ్చె•లంగుచుండ
దివిజవిమానరీ • తిని నవ్వఁగాఁజాలు, నాకాశయానంబు • లమరియుండ
సింధుసప్తకమును • జెంగు చెంగునదాటు, నౌకాచయంబులు • నాట్యమాడ
తే॥గీ॥ సింద్రలోక మొగాకయు•పేంద్రులోక, మోయనఁగజాలుసంపత్తు•లొప్పియుండ
ధరణికాభరణంబనఁ• దగినయట్టి, యాంగ్ల సామ్రాజ్యధామంబు•నహహా గంటి.

ఈభూలోకంబునఁగల్గు నైశ్వర్యమంతయునీయాంగ్లేయ సామ్రాజ్యమునసే కూడియున్నది! ఏమి యావిద్యుల్లతా దీపికాకాంతి ప్రకాశంబులు! ఏమి యా యుత్తుంగరవ్యహర్మ్య దేదీప్యమానరోచులు! ఏమియావిశాల రమణీయవిపణిరాజమార్గంబులు! ఏమి యా యంత్రతంత్ర నిర్మాణవిశాలకర్మాగార భవన రాజంబులు! ఆహా! ఇచట నశేషజనంబులు ధైర్యసాహస విక్రమోపేతులై నిరంతరముఁగాయక్లేశ మొనర్చి జీవించుచున్నారే? రవియస్తమింపని మహాసామ్రాజ్యాధిపతి మొదలు పూటగంజి యెఱుంగని నిరుపేదవఱకు స్త్రీపురుషవివక్ష లేక ప్రతివ్యక్తియుఁ దనవిధ్యుక్త విధానంబు లతిభక్తి శ్రద్ధలతో నొనర్చుచున్నారే! అబాలగోపాల మిట్లతిదక్షతతో స్వధర్మ నిర్వహణం బొనర్చుటవలననే, యారుఖండంబుల యందును, సప్తసముద్రములందును,

నవద్వీపంబులయందును, వారిరాజ్యంబులు విస్తరించి యఖండైశ్వర్యంబున ప్రజలు దులతూగుచుండిరి! కటకటా! భరతఖండంబున ప్రజ లెంతమూఢాగ్రేసరులు బుద్ధివిహీనులు, మూఢవిశ్వాసతత్పరులు, అల్పాయుష్కులు, సోమరిపోతులు, భక్తిశ్రద్ధావిరహితులు, ఉత్పన్నమందబుద్ధులు, నిరంతరకలహవివాద ప్రావీణ్యులు, శుష్కప్రియాలాపచతురులు! పరశ్రేయోవిముఖులు! దుర్గమాజ్ఞానగాఢాంధకారనిమగ్నులు, సంఘసంస్కార విముఖులు, పరమమూఢాచార తత్పరులు!

ఉ॥ ఈతటి ధారుణీదివిజు ♦ లీశ్వరచింతయు, సత్యవాక్యము
ల్జాతి విశుద్ధజీవితము ♦ శాస్త్రవిచారము మాని కూటికై
చాతురిఁజూపి యాంగ్లమును ♦ జక్కఁబఠించి విదేశమందునన్
నీతియు జాతియు న్మఱచి ♦ నిందకుఁ బాలగుచుండి రక్కటా.

ఉ॥ స్నానముసాంధ్యనిష్ఠలును ♦ జక్కని వేదపురాణగోష్ఠియున్
హీనముగాఁగ నెంచుచును ♦ హిందువు ధర్మము వీడి వేటయు
న్పానము జూదము న్వెలఁది ♦ వంచనపాలయి దర్వ్యహీనుఁడై
దీనత దుఃఖవార్ధిఁబడి ♦ దిక్కునెఱుంగక యుగ్గునక్కటా.

(సరోజిని ప్రవేశించి వెనుకనుండి చేతులతోఁ గన్నులుమూసి)

సరో—ఎవరో చెప్పకొనుఁడి చూతము!

మాధ—నీవు మాసరోజినివి కావా! (సరోజిని చేతులు తీసివేయును).

సరో—ఏమి బారిష్టరుగారూ! తదేకధ్యాననిష్ఠాగరిష్ఠులై యెవరువచ్చునది పోవునది తెలియక యాలోచించుచున్నారు! పరమేశ్వరుఁడు దినంబున కిరువది నాలుగు గంటలుమాత్ర మేర్పాటు జేయుటచే మీయెడ సాపరాధుఁడయ్యె! కనీసమేఁబదిగంటలైన నేర్పాటొనర్చినచో మీచదువు సంధ్యలకుఁగొంచె మవకాశముండెడిది! సూర్యోదయంబు మొదలు సూర్యాస్తమానమువఱ కొక్క చదువేనా? ఆహారవిహారంబులకైన నొక్కింత విశ్రాంతి యవసరంబులేదా? మీరిట్లహో రాత్రములు కండ్లలో వత్తులువేసుకొని చదువుచున్నారు కాఁబట్టి మీబుద్ధులిట్లు మందగించి మాపరిపాలనకులోఁబడినారు! తెలివితేట లుండవలెను గాని కోకంటిపాటగాఁ జదివిన నేమిలాభము! అర్థములేని చదువులు చిలుకచదువులుగావా?

మాధ—అంతడబ్బు తగులవేసి, జననీ జనకులను వదలి, సప్తసముద్రంబులను దాటి వచ్చినది చదువుకొనుటకా లేక మట్టిఁగొట్టుకొనుటకా? వినను సైతానువలె నిప్పుడే దాపురించితివేమి? ఇంకను వ్యర్థముగాఁ దిరుగుటకు వేళకాలేదే!

సరో—ఉత్సాహము, ఆనందము గావలెనుగాని వేళయేమి? "మనోజవంతుమాంఢవ్య" మన్నారు కాదా మీపెద్దలు! (షికారు) విహారమునకు వెళ్లుటకుఁగూడ

తిథి వార నక్షత్రంబులు, వర్జ్యత్యాజ్యములు, శకునంబులు జూడవలెనా యేమి. మీ పుస్తకంబులు గట్టిపెట్టి మీరు బయటకురండు, మీకెన్ని వేడుకలు వినోదంబులు జూపెదనో!

సీ॥ కత్తిఁజేతనుబట్టి ♦ క్షౌరంబుఁజేయుచుఁ, బత్రికవార్తలఁ ♦ బఠనజేయు
ప్రొద్దస్తమానము ♦ ల్పొలములఁ బనిజేసి, రాత్రివిజ్ఞానంబుఁ ♦ బ్రబలఁజేయు
క్షణకాలమైనను ♦ గథలు సుద్దులుబల్కి, వ్యర్థుఁడై యలసుఁడై ♦ వ్యథను జెందఁ
డసమానశౌర్యంబు ♦ నన్నిదిక్కుల నించి, రాజ్యంబుఁబాలించు ♦ పూజ్యతఁగను
తే॥ గీ॥ తెలివితేటలు బహుళమై ♦ తేజరిల్ల, సిరియుసంపదభోగము ♦ ల్పరఁగ నొప్పు
నాంగ్లప్రజలకు సాటియే ♦ యాంధ్రులైన, వంగపంజాబు మహారాష్ట్రప్రజలునైన.

రాక రాక మాయింగ్లండుదేశంబునకు వచ్చినందులకు, మీకు వినోదంబులు వింతలు జూడవలెనని యుండదేమి కర్మము! మీకు జన్మతః ఉత్సాహంబు లేకున్నను, నావంటి త్రిభువనైకసుందరి పాణిగ్రహణంబుజేసి పిలుచుచున్నదని యైనను రాఁగూడదా?

మాధ—త్రిభువనలోకైకసుందరీబిరుదంబునకు నీవు తప్పక తగియున్నావు! ఈ బిరుద మితరులొసంగినదా? లేక నాట్యవేషధారులు దాల్చు బిరుదావళివలె నీకు నీవే దాల్చినదా? ఎట్టులైనను సరియే! నీ యాజ్ఞ శిరంబునఁదాల్చి తత్క్షణమే బయలుదేరుచున్నాను. నీ వంటిబాలికామణులతోఁ గలసి మెలసి విహరించుమహానందం బీజన్మమునకుఁ దిరిగి కలుగునో కలుగదో!

సరో—అప్పుడే యెత్తిపొడుపులు, హేళనలునా? ఈ రోజు బారిష్టరై, రేపు హైకోర్టుజడ్జీలు కాఁబోవు తమబోటివారితోఁ బేదబాలికయుఁ జదువెఱుంగని మూఢమతియు స్నేహముఁజేయఁగోరుట ముమ్మాటికిఁ దప్పే, చేసిన తప్పునకుఁబ్రాయశ్చిత్తమును జేసుకొని చెంపలువేసుకొని వెళ్ళిపోవుచున్నాను లెండు. మీరు మీచదువు శాశ్వతకాలము సుఖముగానుండుఁడు.

మాధ—ఒక నిమిష మాలస్యమైన నింత కోపమైన నెట్లు తాళుదును! మా దుర్వాస మహామునికి ముక్కునఁ గోపమున్నట్లు, నీ కనుఁగొలఁకుయం దాగ్రహము తాండవమాడుచుండునే! మావిశ్వామిత్రునకు నిలువెల్లను గోపమైనట్లు, నీ పలుకులెప్పుడును నాగ్రహాగ్నికణంబులు గ్రక్కుచున్న మేము భరించుటెట్లు? మానినీరత్నంబగు నీకు శాంతంబుకన్న నాగ్రహమే భూషణంబువలె నున్నదే! (అని హస్తంబులుబట్టుకొని వెనుకకుఁ గొనివచ్చును).

సరో—మీ ముఖస్తుతివాక్యంబులన్నియుఁ దీసి కట్టిపెట్టుఁడు. మీకల్లబొల్లివాక్యంబు లాలకించి మురిసిపోవుటకు నేను హైందవనారీమణిని గాను. మూలమూలల నక్కియుండకపోయిన బయటకు రారాదా, వేడుకలు వీక్షింపఁబోవుదము.

సీ॥ కష్టము ల్గలుగుచోఁ ♦ గలసి మెలసియుండి, విపదంబుధిని దాటి ♦ వెలయఁగల్గి
పరదేశములతోడ ♦ వైరంబుగల్గుచో, రణవిహారమునందు ♦ గణనకెక్కి
బీదసాదులఁ జూచి ♦ ప్రేమజాలఁగఁగల్గి, యన్నవస్త్రము లిచ్చి ♦ యాదరించి
వివిధశాఖలు లేక ♦ పెక్కుజాతులు గూడి, భ్రాతృభావము తోడఁ ♦ బ్రజ్ఞగాంచి
తే॥గీ॥ బ్రిటిషుసామ్రాజ్యపదమున ♦ వెలయుచున్న, నాంగ్లజాతినిదర్శింప ♦ నఘముదొలఁగు
భరతఖండంపు దైన్యంబు ♦ భయముఁగొల్పు, నెటులమీ దేశమభివృద్ధి ♦ కెక్కఁగలుగు

(ఉభయులునుగలసి యొక యుద్యానవనంబుఁ జేరెదరు)

మాధ—సతీమణీ!

ఉ॥ అక్కడి మేడమిద్దెలును ♦ యంత్రవినిర్మిత సౌధవీథులు
న్నక్కడి దివ్యవైభవము ♦ నందముఁ జందముఁ జూచిచూచి నే
నక్కట భారతావనిక ♦ లట్టి యసహ్యపుహైన దీనత
ల్గ్రిక్కునఁ బాపఁగాఁగలనొ ♦ గానొయటంచు దలంతునెమ్మదిన్.

ఊపిరిసలుపకుండ హుటాహుటిని గుంజుకొని వచ్చితివి గదా? ఏమి కనకాభిషేకంబుఁజేసెదవో చేయుము! సంసిద్ధుఁడనై యున్నాను.

సరో—నాయాజ్ఞా ప్రజ్ఞలలో నున్నచోఁ గనకాభిషేకమే గాదు, కనకమయకుంభాభిషేకము నే చేసెదను మాటలకేమి? పేదరికమాయేమి? ఈ యుద్యాన వనవిహారమొనరింతమురండు.

మాధవార్యా! మా యింగ్లండు దేశము స్వాతంత్ర్యమునకుఁ బుట్టినిల్లు.

సీ॥ పొద్దు పొద్దునలేచి ♦ పొంగియుత్సాహియై, పనిపాటలకుఁ బోవు ♦ పంటకాపు
పనిబాలుఁడైనను ♦ భక్తిశ్రద్ధయుమీఱఁ, జదువుసందెలయందు ♦ సన్నుతిఁగను
శాస్త్రవిజ్ఞానియై ♦ చాలవిత్తముఁగూర్చి, పెండ్లియుస్నముఁ జేయుఁ ♦ బ్రేమతోడ
బాల్యవివాహము ♦ వైధవ్యకష్టము, ల్వెదకిచూచిననైనఁ ♦ బెంపుఁగనవు
తే॥ గీ॥ తినుటకన్నంబు ధరియింపఁ ♦ దిన్ననైన, వసనమెఱుఁగని బీదలు ♦ బడరు కంటఁ
గలర మారియు బొబ్బల ♦ కఠినజ్వరము, జాడ్యముల చేతఁజావ రి ♦ చ్చటనుజనులు.

స్త్రీ పురుషులు నిరంతరానురాగముతో సరససల్లాపంబు లాడుకొనుచు, బాల్యక్రీడా వినోదంబులఁ గాలంబుఁ బుచ్చవచ్చు! మీహిందూదేశంబున నావంటి వనితారత్నమిల్లు మీతో నుద్యానవన విహారంబొనరింపవచ్చునా.

మాధ—సరోజినీ! నీవు చెప్పినమాటవాస్తవమే! కాని వివిధదేశంబులందు వివిధాచారంబులుండును. అంతమాత్రముచేత మా యాచారంబులన్నియు మౌఢ్యములనియు, మీ యాచారంబులన్నియు నిరంతరాభివృద్ధి సూచకంబులనియు నెంచవలదు.

## ద్వితీయాంకము

సరో— మాధవా! నేనామాటయంటినా? గుమ్మడికాయల దొంగయనిన భుజములు దడవిజూచుకొను టెందులకు? పోనిండు. మీ యాచారంబులే సర్వోత్కృష్టము లైనవి. మా నడవళ్ళే దోషభూయిష్ఠమైనవి. ఇరువదియవ శతాబ్దములో నతిబాల్య వివాహంబులు, నిర్బంధవైధవ్యములు, స్త్రీవిద్యావిముఖత్వము, బహుభార్యాలంపటత్వము, వారనారీజనాదరణము, హరిజనస్పృశ్యతానిరోధము, బహుళశాఖోపశాఖావర్ణవిభజనము, ఇవి యన్నియు నభివృద్ధిసూచకములు గావా యేమి? నవనాగరికులు చూపోపమిచే హిందూసంఘమును నిందించెదరు గాని భారతఖండము ప్రపంచాభివృద్ధికి మార్గదర్శకంబు గాదా? నిజమాడిన నిష్ఠురముగాని నామనవి వినుఁడు.

సీ॥ కన్నబిడ్డలకుత్తు♦కలుగోసి వీధిలో, బాఱవేసెడునట్టి ♦ పడఁతుకలును
బెద్దలౌ పితరులఁ ♦ బేర్మిఁ గాశికిఁ దెచ్చి, గంగాజలంబులఁ ♦ గలుపువారు
పుస్తెగట్టినయట్టి ♦ పురుషుండు చనిపోవ, భార్యను దహియింప ♦ వఱలువారు
కన్నుదెఱువనట్టి ♦ చిన్నారిపాపల, ముదుసళ్ళకొసఁగి వే♦మురియువారు
తే॥ గీ॥ చిఱుతప్రాయంబునను భర్త ♦ పరమపదము
జెంద మరల వివాహంబు ♦ సేయరాద
టంచు వాదించుపురుషుల ♦ కాలవాల
మట్టి యాచారములకెల్లఁ ♦ బుట్టినిల్లు
భరతవర్షంబులకు వృద్ధి♦ బరఁగు టెట్టు.

మాధ— నన్నిట్లీడ్చుకొనివచ్చినది నాకుఁ దాటాకులుగట్టి మా సంఘంబును నోటికి వచ్చినట్లు దూషించుటకేనా? నీ వుడికించిన యుడికింపఁబడువారు లేరు! మా దేశీయాస్తిత్యంబు జెప్పెద వినుము.

సీ॥ సేతువు మొదలుగ ♦ శీతనగముదాఁక, పుణ్యభూమియనంగఁ ♦ బొందెఁ గీర్తిఁ
బుణ్యహిమాచల ♦ పూర్వపశ్చిమగిరుల్, పెట్టనికోటలై ♦ పెంపుగాంచు
గంగ గోదావరి ♦ కావేరి కృష్ణయు, సస్యసంపదలిచ్చి ♦ జనుల మనుచుఁ
గాంచనరాజిత ♦ ఖనులచే వెలలేని, మణులచే విలసిల్లి ♦ మహిమగాంచు
తే॥ గీ॥ కడఁగి యజ్ఞానతమమునం♦బడి సమస్త, దేశములు దారిగానక ♦ తిరుగువేళ
నాత్మవిజ్ఞానరవివెల్గు ♦ నట్లుజేసె, భరతవర్షంపు భాగ్యంబు ♦ వశమె పొగడ.

సీ॥ వేదవేదాంగాది ♦ విద్యలెచ్చటబుట్టె, యాత్మవిజ్ఞానంబు ♦ నమరఁజేసె
భారతంబును భాగ♦వతమును గీతయు, నుపనిషద్భాష్యంబు ♦ నొప్పెనెచటఁ
బుట్టిననాదిగా ♦ గిట్టెడువరకు సత్కర్మాచరణమెంచుఁ ♦ గాలుచుండు
నమృతోక్తి "నేకమే♦వా ద్వితీయంబ్రహ్మ", యనియైక్యముగ మను♦ల్వినిచిరెందు
తే॥ గీ॥ నాదిశంకర రామాను♦జాది గురువు, లక్బరు నశోక శ్రీహర్షు ♦ లాదిరాజు
లెచట కీర్తిప్రతాపులై♦యేలి రట్టి, భరతవర్షంపు భాగ్యంబు ♦ వశమె పొగడ.

నీ సంఘముమాత్రము మడిగట్టుకొని యున్నదనుకొంటివేమో? దుర్భర దారిద్ర్యము, మూలనున్న ముసలమ్మల కౌమోదేక్రిక వివాహంబులు, తల్లిదండ్రుల నెఱుంగని సంతానవృద్ధి, ప్రౌఢావివాహంబులు, కామినీకాంచన లంపటత్వము-ఇట్టి లోపంబులు మాకునుగలవు. గురువిందగింజ తన నలుపుతా నెఱుంగదు. పరులదోషంబులను నలుసులు దూలంబులుగా వర్ణించెదరేగాని, తమ దోషంబులను దూలంబులను నలుసులుగా నైనను నెఱుంగఁజాలరు.

సరో—మీరిప్పుడు బారిస్టర్లు! ముందు కాఁబోవు హైకోర్టు జడ్జీలు! నేను మీతో వాదింపఁగలనా? మనకీ యనవసర ప్రసంగంబు లెందులకు లెండు?వనవిహారంబొనరించి వత్తమురండు. ఆ లతాతన్వి తన చిగురాకు హస్తంబులచే నామహావృక్షపురుషపుంగవుని కౌఁగిలించి పెనవేసుకొని పుష్పంబులనునక్షతల నెట్లు తలఁబ్రాలుగాఁ బోయుచున్నదో వీక్షింపుఁడు! ఇట్టి దృశ్యంబులు మా శీతల దేశంబులందు కన్నను భారతవర్షంబున నెక్కువ శోభాయమానంబుగను మానసాహ్లాదకరంబుగను నుండునని తలంచెదను?

మాధ—వనితామణీ! మాభారతఖండంబున సంపదలు తక్కువైనను బ్రకృతిరమణీయత్వంబు శోభాయమానంబగు మృదుమధురకోకిలారావంబులు విన్నచో నీ గానమాధుర్యంబు స్మరణమునకు వచ్చును. శుకశారికాపారావత చాతక చకోరాది పక్షిమిథునంబుల పరస్పర సంశ్లేషణ చుంబనాది శృంగారచేష్టల వీక్షించినచో సర్వభోగవిలాసంబులు పరిత్యజించిన విరాగియైనను విటుఁడు గాక మానఁడు. వృక్షరాజంబుల నల్లిబిల్లిగా నల్లుకొనిన లతాతన్వీమణులను వీక్షించినచో సతీపతుల యాలింగనంబులు జ్ఞప్తికివచ్చి మోహవిరహంబుల పాలుజేయును.

సరో—మాధవా! నీవుజూచిన యువకుఁడవుగా నుండి విద్యాభ్యాసం బొనర్చుచుంటివే? నీకప్పుడే విరహమేమి? భారత భూమండలంబున ముక్కుపచ్చలారని బాలికామణి నెవ్వరినైనను వివాహమాడి విరహాంబుధి నోలలాడుచుంటివా? అటులైన నీ చదువు చట్టుబండలైనట్లే! పూజ విష్ణుపాదంబులమీఁదను మనస్సు నైవేద్యంబుమీఁదను నున్న నేఁతలాధిమో చదువు బారిష్టరు పరీక్షకును, మనస్సు భార్యామణి మీఁదను నున్నచో నీ చదువునకుఁదిలోకంబులు తూర్పుదిక్కుగాఁదిరిగి వదలవలసినదే! ఐనను నీ భార్య త్రిలోకసుందరియా? దేవేంద్రలోక సుందరీమణులైన రంభా తిలోత్తమా మేనకాద్యప్సరస్త్రీలను దలదన్నినదా? లేక యాగ్రహింపకుము. నామనస్సులోమాట చెప్పెదను

ఉ॥ ఓసరసీరుహాక్షి విను ♦ మోర్పు మెయి న్వినుపింతు సత్యము
న్మాసరి వచ్చునో క్కమతి ♦ మంచితనంబునఁ దెల్పితేటలన్
భాసురశాస్త్ర గీతికలఁ ♦ భారతభామిని యాటలాడునో
వ్యాసము వ్రాయునో కథలఁ ♦ బల్కునో మెచ్చుగ లెక్చరిచ్చునో
వేసరి కాపురంబు నెర ♦ వేరెడు మాధసతి న్వరించినన్.

ఉ॥ ఇంతులమేలుబంతియని ♦ యింపుమెయిన్ స్తుతియింతువేమొ, యా
వంతయు మమ్ముఁబోలనగు ♦ నానుగుణంబుల నాట్యలీలలన్
వింతగు నాటవస్తువుగ ♦ నేఁ దలపోయుచునుందువేమొ నీ
పంతము మాని యాంగ్లసతిఁ ♦ బద్మదళాక్షిని బెండ్లియాడుమా.

నారదునివలె నానోట నువ్వుగింజయైనను నానదు! నీ భార్య మావంటి యాంగ్లసామ్రాజ్య మానవతీ శిరోమణులను రూపురేఖా విలాసాదులయందుఁ దలదన్నినదా? ఎప్పుడు భార్య భార్యయని వలపుఁజెందు టెందులకు?

మాధ—(స్వగతము) నాకువివాహమై భార్యయున్న ట్లెట్లో యీ యువతీరత్నము గ్రహించెను! లేక సుందరి కాళ్ళకు బంధము వేయుచున్న దేమో (ప్రకాశముగా) సరోజనీ!

శా॥ చాలుంజాలును నోటవచ్చినయటుల్ ♦ జన్నె కదుం గ్రూరమా.
లీలంబల్కఁగ నాకుభార్యగలదే ♦ లేశంబుయోచింపకే
బాలన్వీడి విమోహ మందుఁబడి నే♦వాంఛింతునే విద్యలన్
వీలున్జాలును లేక పల్కెదవులే ♦ విన్నాణ మే పారఁగన్.

చ॥ సరిసరి పట్టి బూటకఁపుఁ ♦ జాతురివాక్యముఁ బల్కనయ్యెడిన్
మఱిమఱి దేశముల్వెదకి ♦ మానినిగాంచి వివాహమాడఁగా
నరమరలేక నేఁ దలఁతు ♦ నక్కట యిట్టి యభూతకల్పన
ల్జరిపెదు బిడ్డపుట్టకయె ♦ జక్కని పేరును బెట్ట నేర్చితే.

నీ డాబుమాటలకుఁ బడిపోవుటకు వెఱ్ఱివాఁడను గాను! పట్టియసత్యపు భూతకల్పనలను సృష్టించి పలుకుటకు నీ నోరెట్లు వచ్చెను. నేను వివాహమాడ లేదు! ఇఁక విరహము మాటలందువా మాదేశమున నెట్టి గ్రంథంబవలోకించి నను మోహాతిరేకమును విరహమును వెదజల్లుచుండును. ఆకారణంబుచే యువకులంద ఱిట్టిపుస్తకంబులఁ బఠించిలేనివిరహంబుఁ దెచ్చిపెట్టుకొందురు. నేని క్కడఁ జదువు వెలుఁగఁబెట్టవలయునని వచ్చితిననుకొంటివారేమి? ఆంగ్లేయ సామ్రాజ్య వైభవంబునుగాంచి, యాంగ్లవనితా మణుల రూపురేఖావిలాసంబులుపలక్షించి వయోవిద్యారూప సంపన్నయగు బాలికామణిని వలచి వివాహంబు జేసుకొనుట కేతెంచితిని.

సరో—(స్వగతము) నేనీతనిని బ్రేమించుచుంటినని తెలుపుదునా? ఇంతత్వరలో బ్రేమించిన దుర్బలహృదయనని తలంచునేమో? లేక నాప్రేమను గప్పిపుత్తునా? కప్పిపుచ్చి నచోఁ బ్రేమవాహినికి నాహృదయంబు సంవాసస్థలంబు కాదని యితర కన్యామణుల చెంతఁజేరునేమో? అయిన నితని హృదయాధిష్ఠాన దేవత యెవతెయో తెలుసుకొనియెదఁగాక (ప్రకాశముగా)

ఉ॥ వింతలు జాలనీవలన ♦ వీనుల విందుగ వింటిఁగాని నీ
వింతకుమున్నె యాంగ్లసతి ♦ నింపుమెయి న్వరియింపఁగానిటు

ల్వంతను జెందుచుంటివని ♦ భావమున న్దలపోయనైతి నీ
కింత దురంత వేదన ల♦వేటికి నన్వరియింపు మాధవా.

ఉ॥ అందమునందు నాకు సరి♦యౌ సతులెవ్వరు గానరారు నీ
చందము హావభావములు ♦ జాలముదంబును గూర్చెనాకు నీ
డెందమిజూచినన్ బ్రమసె ♦ దింతియగాని నిజంబుబల్కుచో
సుందరి నన్నుఁబోలు పరి♦శుద్ధ చరిత్రను దెచ్చువాఁడవే.

నన్ను బెండ్లాడకున్న మానె గాని మాధవా! నీవింగ్లండు దేశంబున కేతెంచి యారుమాసములు దాటినవిగదా! నీ హృదయాధిష్ఠానదేవత యెవతెయో నే నెఱుంగవచ్చునా? ఏమట్లాలోచించుచున్నావు? నీ ప్రాణస్నేహితు లితరు లెవరైననున్నారేమో, వారితోఁ జెప్పవచ్చును లెమ్ము! గంభీరహృదయుఁడవును ధైర్యసాహససంపన్నుఁడవునౌ పురుషవరేణ్యుండ వని యడిగితిని. నాదేపొరబాటు! హిందూసుందరీమణులు తమ భర్తల పేరుఁజెప్పుటకు సిగ్గుపడెదరఁట గాదా? నీవు నీ ప్రేమించిన యువతీమణి పేరుఁజెప్పుట కాడువారికన్న సహస్రాంశము లెక్కువగా సిగ్గుపడెదవని నే నెఱుంగనైతి క్షమింపుము.

మాధ—సరోజనీ! ఏమంత వింతగా నడిగెదవు! నీకన్న నాకుఁ బ్రాణస్నేహితు లెవరు! ఆరుమాసంబులు స్నేహమొనర్చినచో వారు మీరయ్యెదరుగదా? నాకు రహస్యము లేనే లేదు! నీకుఁ గోపము వచ్చునేమో యని యింతవఱకును దెలుపనైతి.

తే॥ గీ॥ తన్నుఁదా మెచ్చుకొనుటయే♦తన్ను కొనుట, యనెడుధర్మంబువింటివే♦యబ్జనేత్రి
పైకి మెఱమెచ్చుమాటల ♦ భంగిగాక, పెండ్లియాడుదె పరదేశిఁ♦బ్రేమమీఱ.

చల్లకు వచ్చి ముంతదాపనేల! నీయసదృశరూపలావణ్య లీలావిలాసంబులు, నీహావభావశృంగారచేష్టలు, నీమృదుమధురవచనరచనాచమత్కృతులు, నీదివ్యగానామృతవర్షధారలు, నామనస్సును శృంఖలాబద్ధుని గావించినవి. ఇంక బిసరుహకాండసదృశంబులగు నీ బాహువల్లికలచే నా దేహంబును శృంఖలాబద్ధుని గావింపఁ బ్రార్థించుచున్నాను.

ఉ॥ ఎండలు మెండు సౌఖ్యమది ♦ యెక్కువయుండునో, యుండదొక్కయం
చండజయాన నీదుహృద ♦ యంబున సందియమొందఁబోకు నే
నండగనుండ సౌఖ్యముల ♦ నందెదుగా కొకకష్టమేని నీ
కుండఁగఁబోదు నమ్మినను ♦ నింపుమెయి న్వరియింపు కోమలీ.

సరో—(లేని కోపంబభినయించుచు), పిచ్చి కుదిరినది రోకలిఁదలఁజుట్టుమన్నట్లున్నది మీ ప్రవర్తనము. జాతికులశీల ప్రాభవంబులు జూడక మీతో స్నేహమొనర్చినందులకు బాగుగా గౌరవించుచున్నారు. ఇంటిలోఁదిని యింటి వాసంబులు లెక్కఁబెట్టుటయన నిదియే కాఁబోలు. మీ కా భరతఖండంబున శ్రీరామునివలె

నొక భార్యయున్నదో, గోపాలకృష్ణునివలె నష్టభార్యలే యుండిరో! కొడుకులు
గూతుండ్లు నన్నదమ్ములు వదినెమరదండ్లు నత్తమామలు బంధువులు నాశ్రితు
లెందఱుండిరో! మీ హిందూభార్యలసంతానము, నా సంతానము గలగల్లాడు
చుండఁగా నేను మిమ్ము వివాహమాడి యేమిసుఖింతునో గదా? కుడితిలోఁబడిన
బల్లివలె నాయవస్థయగునా? ఇటు మాయాంగ్లేయసంఘంబునకు దూరస్థు
రాలనై యటు హిందూసంఘంబున కేవగింపుఁ గూర్చుదాననై మీతో సంసార
సౌఖ్యం బనుభవించుట సాధ్యమగునా

మాధ— ప్రేయసీ! నీమనోవీథిని లేనికష్టంబులఁ నిర్మించుకొని బాధపడుచున్నావుగాని
నిక్కమెఱుంగవు? నేను హిందూదేశంబున నెవతెను వివాహమాడలేదు!
నాకు భార్య పిల్లలింతవఱకు లేరని త్రికరణశుద్ధిగాఁ బ్రమాణముఁ జేయు
చున్నాను. నాకు నా తలిదండ్రులతోఁగాని, మిత్రబాంధవవర్గంబుతోఁగాని,
మతకుల మర్యాదలతోఁగాని యెట్టి సంబంధమును లేదు. అన్నియు వదలుకొను
చున్నాను. నాజన్నిదమిప్పుడే త్రెంచివేయుచున్నాను నీవునన్ను వివాహ
మాడినచో నీకనుసన్నల మెలంగి, నీ యాజ్ఞాప్రాజ్ఞల వర్తించువాఁడను. నేని
ప్పటినుండియు, నా వేషభాషలయందాంగ్లేయుల ననుకరించి నీయాజ్ఞలయందే
వర్తించువాఁడను.

ఉ॥ సుందర మందిరంబులను ♦ ముద్దులఁ బొద్దులఁ బుచ్చుచుండి యో
సుందరి! సర్వసంపదలు ♦ సొంపలరారఁగఁ బెక్కుసౌఖ్యముల్
విందులు నాటపాటలను ♦ వేడుకమీఱఁగ నిన్నుఁ గూడి యా
నందపయోధి వీచికల ♦ నాతిరో యెంతయుఁ దేలియాడెదన్.

సరో— మాధవా! నీమాటలు కోటలుదాటుచున్నవి! నన్ను వలలో వేసుకొనుటకిట్లు
మాట్లాడుచున్నావుగాని వేఱుగాదు! నీబంధుజాలమును, స్నేహితబృందమును,
నీపైఁబడి నిన్ను బీడించుచున్నపుడు నీవొక్క యాంగ్లవనితకై నీసంబంధబాంధ
వ్యంబులన్నియు మంటఁగల్పి నీబంధంబులన్నియు విచ్ఛేదింపఁజెదవా? అట్టి
ధైర్యసాహసములా! కల్లకల్ల! అట్టిమాట లెన్నఁటికి నేను నమ్మఁజాలను.

తే॥ గీ॥ తల్లిదండ్రులు సోదరుల్ ♦ దరినిజేరి, వలదువలదంచు బ్రతిమాలి ♦ భంగపడఁగ
నన్యదేశంపుభామిని ♦ నవలఁద్రోచి, బంధుమిత్రుల మర్యాదఁ ♦ బడయఁబోవె.

మాధ— ప్రాణప్రియా! నీ నీడనుజూచి నీవె జడియుచుంటివేమి! నీధైర్యసాహసంబు
లిప్పుడెచ్చటికేగె! నన్ను బహుప్రకారంబుల నొప్పించి వేధింపకుము! నా
హృదయకుహరంబునఁబుట్టి యుబికిపొంగివచ్చుచున్న ప్రేమప్రవాహము
జలంబును నీ వెఱుంగకున్నావు! ఆ ప్రేమ ప్రవాహంబు నరికట్టకుము! ఆప్రేమ
వాహినిని నీయాగ్రహబడబానలంబుచే దహింపకుము. నీశీతల కరుణారస
కటాక్షవృష్టులచే నా ప్రేమవాహినీ జలంబు నభివృద్ధిజేయుము. నాకు

నీతోడిదే త్రిలోకసామ్రాజ్యము! నీప్రేమ లేకున్నచో నీజగంబంతయు దురంతాంధకారబంధురంబు. నీవు నన్ను ప్రేమింపక పరపురుషుని ప్రేమించితివని విన్నచో ముమ్మాటికిని నాప్రాణంబులు దక్షణమే యీ దేహంబును విడిచిపోవును. నన్ను విడనాడి న న్నీ భూలోకనరకకూపంబునఁ బడద్రోయకుము. నేను నీపాణిగ్రహణంబొనరించి యానందవారధి నోలలాడఁదలఁచు నని గంపెడాశతో నుంటిని. నే నిదే పరమేశ్వరుని యెదుట ప్రమాణముఁ జేసి చెప్పుచున్నాను వినుము. నేను హిందూజాతికులశీలాచారంబులు వదలివేసితి! ఆంగ్లేయ జాతికులశీలాచారంబులు గైకొంటి! నీశీతల మోహావేశరసప్రవాహపూరితమైన చూడ్కులు నాపైఁబఱపి నామోహ పరితాపంబుఁ జల్లార్పుము. నీయధరామృతం బానిమ్ము. నీతళ్కుచెక్కిళ్ళపైఁ బ్రేమసూచకంబుగా ముద్దొసంగనిమ్ము. నీశిరీషకుసుమపేశలంబైన కోమలదేహం బొక్కసారి కౌగలించుకొననిమ్ము. నన్ను ముమ్మాటికినమ్ముము. నేను నీదాసానుదాసుఁడనే. నాజన్మంబు పవిత్రంబొనరింపుము.

మ॥ కులశీలంబులు గూలిపోయినను లోకు ల్బంధువు ల్మిత్రులున్
వలదంచు న్వైవిఁజేరి పోరినను నా ప్రాచీన మర్యాదలన్
బలవంతంబుగ వీడఁగావలసిన న్వంశంబు పోఁద్రోలిన
న్దలిదండ్రు ల్దరిఁజేరి యేడ్చినను నేఁ దన్వీ నిను న్గూడెదన్.

ఉ॥ భారతదేశపద్ధతులు బాగగు నార్యమతంపుసర్మముల్
బేరును గౌరవంబు మఱి పెద్దలపూజయుఁ దల్లిదండ్రులన్
గూరిమి జూచుటల్మఱచి కోకిలవాణి విదేశధర్మము
ల్గోరిభజింపుచుండెదను గోమలి నన్ను వివాహమాడుమా.

సరో—మాధవా! నన్నింతదీనముగా వేడవలెనా? నేను నీదాననే!

## ద్వితీయరంగము.

[సరస్వతీదేవి చదువుకొనుచుండును.]

సర—అహా; జ్ఞానభాస్కరోదయంబున నా మనస్సునందలి యజ్ఞానాంధకారంబు పటాపంచలగుచున్నది. విద్యాభ్యాసంబున స్త్రీపురుషుల విభేదంబున కవకాశంబేలేదు. పురుషులవలెనే స్త్రీలును సర్వశాస్త్రపారంగతలై యన్ని విషయంబులందును ముందంజవేయుచు పురుషులను ద్రోసిరాజనిననే తప్ప, స్త్రీసంఘముయొక్క సమస్త స్వాతంత్ర్యములును పురుషలోకం బంగీకరింపదు. పురుషుఁడు సర్వశాస్త్రపారంగతుఁడైనను, స్త్రీస్వాతంత్ర్యసుముఖుండైనను, దాను వివాహమాడినంతనే, తన యర్ధాంగిపై సర్వాధికారంబులు జూపి, యామెను బానిసవలెను, బనికత్తెవలెను, బరిగణించుచు, స్త్రీలోక

మంతయుఁ బురుషుల నిరంకుశాధికారమునకు లోఁబడి యావజ్జీవము వారి యడుగులకు మడుగులొగ్గి వారి కూడిగంబు సేయవలయునని వారి తలంపు.

చ॥ పురుషులు పౌరుషంబునను ♦ మోసముల న్బచరించి క్రూరత
న్సరసిజ నేత్రలన్దమకుఁ ♦ జాకిరి జేయ వివాహమాడుచోఁ
దరుణులు నేర్వఁగాఁగలరె ♦ దప్పును నొప్పునుఁ గాంచ నేర్తురే
పరిణయ మాది దాస్యమును ♦ బంధనమున్ సయిరింప నేర్తురే.

కాని యిరువదియవ శతాబ్దంబున పురుషుల యాటలింకను సాగనిత్తుమా? వివాహంబుఁ జేసుకొనినచోఁ బురుషునకు బానిసతనంబుఁ జేయవలసియుండు నను భయంబుతోడనే నేనీ విద్యావ్యాసంగమున కంతుఁ బొంతులేక నా యిష్టమువచ్చినట్లెల్లఁ జేయుచున్నదానను.

చ॥ చదువుల జ్ఞానమున్నదని ♦ శాస్త్రవిచారముఁ జేయఁగల్గుటో
పదుగురు మేల్భళీయనుచుఁ ♦ బండిత వర్యులు మెచ్చఁబల్కుటో
సుదతులలోటుపాటులను ♦ జోద్యముగా వెసఁదీర్చి దిద్దుటో
యదియిదిబల్కనేల సతులందఱి దాస్యము రూపుమాపెదన్.

మధుర పదార్థంబునకు మక్షికంబులు ముసరిన ట్లీ నవయౌవన మోహనాంగు లందరును, నన్ను వివాహమాడి తమ బానిసగా నొనరించుకొన వలయునని యువ్విళ్ళూరు చున్నారు. వీరి మృదు మధుర వచన రచనలకు మోసపోయి వారికి లొంగిపోవు దాననా నేను? కాని పురుషజాతితో విరోధంబుఁ బెట్టు కొనుట సమంజసంబు కాదు. ఎవ్వరికిని నొప్పిఁగలిగింపక, స్నేహపాశంబులు దెంపుకొనక, జాగరూకతతో మెలంగుట మంచిది. ఎప్పటికప్పుడు నాతలి దండ్రులు నన్ను జదువుమాని తమ గృహంబునకువచ్చి తమకుఁ బరిచర్యలొ నర్చి కడతేర్పవలయునని యుత్తరంబులు వ్రాయుచుందురు. నా కా కుగ్రామ వాసంబుకన్న మహాగాఢాంధకారబంధురంబైన మహారణ్యంబున వసించుట మేలుగాఁ గనఁబడుచుండును! అచట బైసిక్ళ్ళా మోటారులా ఆకాశ విమానంబులా? నాటకములా సంగీతములా సినిమాలా? ఆటపాటలా, కందుక క్రీడలా, సభలా, ఉపన్యాసములా, స్నేహితబృందమా? విటసమూహమా, వార్తాపత్రికలా, ప్రేమలేఖలా, చదువులా, సంధ్యలా, నాగరికతాచిహ్నం బులు కంచుకాగడాలతో వెదకించినను గానరావు. అడుసుత్రోవలు, మట్టి గుడిసెలు, బురదనీళ్లు, మురికి గృహములు, అనారోగ్యమైన యాహారము, చూడఁ జుట్టము మ్రొక్క దైవములేని యేకాంతనివాసము నాకే కాదు నా గర్భశత్రువునకైనను సంప్రాప్తముగాకుండుఁ గాక? అడుగో నా మిత్రుఁ డైన మధుసూదనుఁ డేతెంచుచున్నాఁడు! మిత్రమా స్వాగతము!

ఆ॥ వె॥ తెల్లవారలేదు ♦ తేజంబు దిశలెల్లఁ
బఱపి భాస్కరుండు ♦ బయటఁబడఁడు
ఎపుడు నిద్రవిడచి ♦ యేతెంచినాఁడవో
కాఫి దేవుఁగొలువఁ ♦ గాంక్షతోడ.

అప్పుడే తెల్లవారెనా! కాఫీ దేవాలయంబునకుఁగాఁబోలు పోవుచున్నావు.

మధుసూ—కాఫీదేవాలయంబునకుఁ గాదు వెళ్ళుచుండుట! సరస్వతీ దేవాలయంబునకే వచ్చుచున్నాను. సర్వకళాభ్యాసినగు నామనోభీప్సితంబు కాఫీదేవతను గొలిచినఁ బూర్తియగునా, లేక సర్వవిద్యా ప్రవాయినియు, సర్వకళాపరిపూర్ణయునగు సరస్వతీదేవి యనుగ్రహంబున సమకూరునా? నీవే చెప్పుము!

సర—Don't be idiotic, man! నీ Romanticism కు హద్దుపద్దు లేకున్నదే! ఈ ముఖస్తుతుల చేత నన్ను మెప్పింపఁదలఁచితివి కాఁబోలు! మీ మొగవాండ్ల మాటలువిని మోసపోవుటకు నేను Fool ను కాదు! పరమచాందసుడైన పెద్దనకూడ "సందుసుడిమాయలుగా మొగవారి కృత్యముల్" అన్నాఁడు.

మధుసూ—నేనేమంటినని యీప్రసంగము! నీగంభీరోపన్యాసమునుబట్టియే నీవు సర్వలలితకళాభ్యాసిని వగుదువో కావో తెలియుచున్నది! అదియునుంగాక సర్వకళాశాలలలోఁ జదువుచున్న నీవు సర్వకళాభ్యాసినివిగాక యేమయ్యెదవు! నేను నిన్ను దిట్టలేదు తిమ్మలేదు. నిజమాడిన నిష్ఠురమెంచులకు. నిరుపమాన వివిధ శాస్త్ర విజ్ఞాన సంపన్నురాలవగుదువనియే నీ తలిదఁడ్రులు నీకు సరస్వతీదేవియని నామధేయం బొసంగిరి. అదియట్లుండనిమ్ము. నేను సిక్కంబుగాఁ గాఫీ పుచ్చుకొనుటకే బయలుదేరితిని గాని నిన్నటిదినంబునఁ గళాశాలకు రానందున శాస్త్రపండితు లేమి చెప్పిరో కనుగొందమని యిట్లరుదెంచితి.

శా॥ కాఫీదేవుని సంస్మరించుటకు నేఁ♦గాంక్షించి రాలేను నీ
కోపాటోపము భీకరార్భటియు న♦న్నోపింపఁగా లేవు నీ
ప్రాపుం గైకొని శాస్త్రముం జదువఁగా ♦ భావించి యేతెంచితిన్
నాపైఁ గిన్కవహింపఁబోక సరిగా ♦ నన్జూచి బోధింపుమా.

సరస్వతి—మధూ! ఇది యేమి పూర్వ పరిచయంబు లేని క్రొత్తవానివలెఁ బలుకుచుంటివేమి? నీ వెందుకు వచ్చితివని నిన్నెప్పుడైనఁ బ్రశ్నించితినా? నీవు నిజంబుగా నన్ను సరస్వతి యపరావతారమని తలంచినచో నేనున్నట్టి దేవాలయంబునకు మీ వంటి సర్వకళాభ్యాసకులు ముప్పూటలు వచ్చి దేవి సందర్శనం బొనరించి యాశీర్వాదంబులు గైకొనవలసి యుండెనుగదా? అట్టి దేవాలయంబునకు వచ్చితివిపో, ధూపదీపనైవేద్యంబులు దీసుకొని రాక రిక్తహస్తంబుల రావచ్చునా? నీవు నైవేద్యంబీయకున్నను నేను ప్రసాదం బొసంగెదను గైకొనుము! అవిగో! అచట ఘుమఘుమ పరిమళంబులు నలుదెసల వెదఁజల్లు ఫలహారంబు

లును బానీయంబులును గలవు గైకొనుము.

మధుసూ—సరస్వతీ! నీ దివ్య హస్తంబులతో నొసంగ మహాప్రసాదంబుగాఁ గైకొను చున్నాను. (అని కొంచెము పుచ్చుకొనును) పరీక్షలు సమీపించుచున్నవి గదా బాగుగాఁ జదువుచుంటివా? ఈ సంవత్సరము నీవే యన్ని విషయంబుల లోను Presidency First గా pass అయ్యెదవని మన Professors యను కొనుచున్నారు.

సర—మేమేమి మగవారముకాముగదా? మగపరీక్షాధికారులకుఁగూడ మమ్ముఁజూ చిన హేళనయే కాఁబోలు! మగవారు పరీక్షాధికారులైయుండఁ దరుణీరత్నం బులు Presidency First pass యైనచో మగవిద్యార్థులకు, మగ professors కు, శృంగభంగముగా నుండు నేమో! మావంటివారిని పరీక్షలోఁ దప్పించి హేళనజేయక పైకి లాగినచో నదియేపదివేలు. అయినను నీవు విజ్ఞాన వంతుఁడవే కావచ్చును, పరీక్షలో Presidency First గా నీవే pass కావచ్చును! పరీక్షాధికారులకుఁ బ్రియశిష్యుఁడవు కావచ్చును? ఆమాత్రంబున నిట్లు గర్వితుఁడవై మావంటి యబలలను, పనిజేసుకొని యింటికి వచ్చి హేళన జేయ నక్కఱలేదు. తెలివి యొకరి సొమ్ము కాదుగదా. నీవు Presidency First pass అవుతే, మేము Presidency last pass అవుతాము. Last First అవుదము. లేదా తప్పెదము. ఇప్పుడు మీ మగవారిగీత బయల్పడి మహోన్నత దశలోనున్నది. మీ హస్తములో మన్ను బంగారమగుచున్నది. మా గీత క్రిందఁబడినది. మా హస్తములో బంగారము దుమ్మగుచున్నది. కష్ట సుఖములు కావడి కుండలు. మాకిప్పటి వలెనే యెప్పుడు నమావాస్య చీక టియే యుండదు. మాకును శుక్లపక్ష చంద్రుఁ డుదయించి దిన దిన ప్రవర్థ మానుఁడై పెరుగు చందంబున మంచిరోజులువచ్చును. అప్పటికైనను మే మభి వృద్ధిఁగాంచకపోము. ఇప్పుడు మీ పురుషులు మాతలపైనెక్కి పిండిగొట్టిన ట్లప్పుడు జేయ సాధ్యంబుగాదు. భరతఖండంబున స్త్రీలెంత వ్యర్థులు.

సీ॥ వంటయిల్లునువీడి ♦ బయటరావలదంచుఁ, బ్రాణేశుఁడొకకొంత ♦ నాజ్ఞసేయుఁ
బరపురుషునిజూచి ♦ పల్కఁగూడదటంచు, నధిపుఁడొక్కఁడడంతి ♦ నానబెట్టు
నాటపాటలయందు ♦ నలరారవలదంచు, దయితుఁడొక్కఁడు వెలంది ♦ దప్పువట్టుఁ
జవలురాత్రియును సే♦వలు సేయవలెనంచు, నాధుఁడొకర్తెను ♦ బాధవెట్టుఁ

తే॥ గీ॥ జదువుసందెలయందును ♦ సన్నుతిఁగనఁజూచియోర్వంగలేక య♦సూఁయదాల్చు
భరతదేశాన భార్యయై ♦ బ్రతుకుకంటె, నడవిలోపల వృక్షమై ♦ యలరమేలు.

ఇప్పుడు మేము బానిసలమైన నప్పుడు మేము యజమానురాండ్ర మయ్యె దము. అప్పుడు మగవారిని, మమ్ముఁ బైకిరాకుండ నణఁచిపెట్టినందులకుఁ దగిన ప్రాయశ్చిత్త మొనర్చెదము కానిమ్ము.

ఉ॥ స్త్రీలకు దాస్యమెంతయు నశించి స్వతంత్రత యొప్పునాఁడు మి
మ్మేలము మీ ప్రసంగమె స్మరింపము కంగుకకేళిలీలలం
దేలుచు నాటపాటలను ♦ దృప్తిగఁ గాలముబుచ్చు మెప్పుడేన్
వీలది జిక్కిన న్బురుష ♦ వీరుల ద్రోతుము గష్టవార్నిధిన్.

కానిమ్ము! నేనేదో పిచ్చి ప్రసంగం బొనర్చుచుంటినని యాగ్రహింపకుము. కోపముతోఁ జుఱచుఱఁ జూచుచు ఫలాహారంబు లన్నియు నవలఁ ద్రోచితిరేమి? మీ మగవారి నిరంకుశ ప్రభుత్వమునకు నావంటి యబలల దుర్బల ప్రసంగములవలన నష్టమేమియు రాఁబోదు. కాన నీ వధైర్యంబు నొందకుము. మనస్సు నిబ్బరపఱచుకొని సంతృప్తిగా నారగింపుము. ఇంకను ఫలంబు లొసంగుదునా?

మధుసూ—చాలును! చాలును! ఆకలి తీరినది! నీవొసఁగిన ఫలాహారంబుకన్నను, నీమృదుమధుర వాక్యామృత వర్షపాతంబువలన నాహృదయ తాపంబు జల్లారినది. నామన స్సపరిమితానందవారాశి నోలలాడుచున్నది. నీ మహోన్నతాదర్శంబులతో నొక్కింత ప్రపంచజ్ఞానంబుగూడ నవసరంబు. అదియును గ్రహించెదవుగాక! నేను బోయివత్తును. సెలవిమ్ము.

సరస్వ—నేనెవతెను సెలవిచ్చుటకు! నీ హృదయాధిష్ఠాన దేవతననుకొంటివా? లేక సరస్వతీ దేవినని భావించుచుంటివా? పురుషులఁ గడద్రొక్కు స్త్రీలోకములో నొక పరమాణువునని యెఱుఁగనట్లు నటించుచున్నావు.

మధుసూ—నాకింతవఱకు హృదయాధిష్ఠానదేవత లెవరును లేరు. ఇకముందెవరైన నుందురో యుండరో యింతవఱకు నిర్ధారణకాలేదు. నే నేమియుఁ బురుషుల యధికారంబుఁ జూపు వనితారత్నంబుల నగౌరవించుట కట్లనలేదు. మనస్నేహధర్మమునుబట్టి సెలవొసంగు మంటిని. నీకంతకష్టముగానుండిన క్షమింపుము.

సర—మధుసూదనా! నీకేమి పిచ్చి తలకెక్కినదా!

చ॥ పురుషుల నగ్రగణ్యుఁడవు ♦ బుద్ధిబృహస్పతిఁ బోలినాఁడ వీ
ధరణిని నిన్ను బోలుదురె ♦ తక్కినయే నవయౌవనాఢ్యులు
న్బరసతిఁ బ్రార్థనల్సలిపి ♦ పాదముఁబట్టి క్షమింపుమందువే
సరిసరి యిట్టిబూటకముఁ ♦ జాలనెఱుంగుదు మాను మోసముల్.

ప్రపంచములో నెంతనీచ పురుషుండైనను నెంతకులశీల గౌరవంబులుగల మానవతీ మణినైనను, నెట్టిఘోరహింసలఁ బెట్టి యెంత క్రూరముగాఁ జూచుచుండినను వనితామణిని క్షమింపుమని కోరునా? ఇదివఱకుఁ గోరియుండెనా? మహారాజాధి రాజైన నలమహారాజు దమయంతి నొంటరిగా నట్టడవిని డించి పాఱిపోయెను, హరిశ్చంద్రుఁడు చంద్రమతీ దేవిని గాలకౌశికునకు బానిసగా నమ్మివేసెను. ధర్మరాజు ద్రౌపదీదేవిని మాయాద్యూతంబున నోడిపోయెను.

శ్రీరామచంద్రుఁడు సీతామహాదేవిని నరణ్యావాసంబుఁ జేయించెను. ఈ మహా మహులందఱుఁ దమభార్యలను గ్రీడావస్తువులవలెను, నిర్జీవప్రతిమలవలెను, దలంచిరేగాని, యొక్క-క్షణమైనను వారొనర్చిన మహాపరాధంబులను గుర్తెంగి వారి దేవేరుల క్షమింపుమని ప్రార్థించిరా?

తే॥ గీ॥ నలుఁడు దమయంతి యడవుల ♦ నష్టపఱచె
ధర్మజుండోడె భార్య న♦ధర్ముఁడగుచుఁ
జంద్రమతి నమ్మె నాహరి♦శ్చంద్ర నృపతి
వారలెవరేని క్షమియింప ♦ వలెనటంచు
సతుల బ్రతిమాలి యుండిరే ♦ సాధుశీల.

అట్టియెడ నే యపరాధంబును జేయని నీవు నన్ను క్షమాపణయడిగి పురుష లోకంబునకుఁ గళంకంబు వాటిల్లఁజేయ నేల? వెడలిరమ్మా, పునర్దర్శనం బగుఁ గాక.

మధుసూ—సరియే (వెడలిపోవుచు) ఆహా! నేఁడెంతసుదినము! సరస్వతీదేవి నిజముగా సరస్వతీదేవి యపరావతారమే. రూపమా! రంభామేనకాతిలోత్తమాది దేవకన్యకల రూపంబులఁదోసిరాజనును. సుగుణగణంబులా! ప్రపంచంబున స్త్రీలోకంబున కంతకు నాదర్శప్రాయంబులై యున్నవి. ఇట్టివనితారత్నము సత్కులప్రసూతయయ్యు స్త్రీవిద్యాభ్యాస గౌరవంబునను, స్త్రీలోకంబు నభివృద్ధిలోనికిఁ దెచ్చుటకును, నింతవఱకు వివాహంబుఁ బరిత్యజించియున్నది. ఈ బాలికామణి నన్ను వివాహమాడ నంగీకరించినచో నాజన్మంబు ధన్యంబు. ఆమె మధురసంభాషణంబు విను చున్నంత సేపును స్వర్గధామంబున నానంద వారాశి నోలలాడినట్లుండును. నా యదృష్టదేవత! నా భాగ్యరాశి! నా సుగుణగణాలంకారము! నా శృంగారరసాధిష్ఠానదేవత! నా సకలసద్గుణనికురంబశారదాంబ! నాపై ననుగ్రహించి నన్ను వివాహమాడి నన్నానందవార్ధి నెప్పుడోల లాడించునో!

చ॥ చదువుల భారతి న్గెలుచు ♦ శాస్త్రములందును మెచ్చదెవ్వరిన్
బదమృదుమాధురీ మహిమ♦బంది గొనున్ శుకకోకిలావళిన్
హృదయము కోమలంబగుచు ♦ నింపెసలారెడు నింకనెన్నఁడే
నదయతవీడి యాపరసి♦జాక్షి ననువ్వరియింప నెంచునే.

## తృతీయరంగము.

[ఉద్యానవనము - సరస్వతి, మధుసూదనుఁడు, జాన్, మహమ్మదుఖాన్ ఫలహారంబులఁ జేయుచు మాట్లాడుకొనుచుందురు.]

సరస్వతి—మిత్రులారా!

చ॥ పురుషవరేణ్యులార మిముఁ ♦ బూజ్యతరంబగు నాదరంబున
న్బరువడిఁబిల్వఁబంచితిని ♦ నైకొను ప్రేముడి నైదువర్ష మల్
తిరిగితి నాటబాటలను ♦ దెల్వియొకించుకజూపి, చక్కఁగా
నెఱిఁగియు శాస్త్రపట్టమును ♦ ఈసరిగొంటిమి నేర్పుపెంపునన్.

ఉ॥ ఇంతకుమున్న స్నేహముగ ♦ నెంతయొకాలముఁ బుచ్చినార మా
వంతయు లోటుబాటులెవి ♦ యైననుజూచి సహింపరయ్య నేఁ
బంతముమీరఁ గోపముగ ♦ బల్కిన వేగక్షమింపరయ్య నే
నెంతయు వేడుకొందు హిత ♦ బృందములార నమస్కరించెదన్.

నాకు మీయందఱియందును గాఢానురాగము దినదిన ప్రవర్ధమానమగుచున్నది. సర్వకాల సర్వావస్థలయందును మీతో నాటపాటల వినోదంబులఁ గాలంబుఁ బుచ్చవలయునని నామనంబువ్విళ్లూరుచున్నది. విశ్వమానవజాతి యంతయు నొక్కటే. జాతిమతభాషాభేదంబులు మనము దెచ్చిపెట్టుకొన్నవి గాని ప్రపంచము పుట్టినపుడె యివిపుట్టియుండలేదు. ఆవిభేదంబుల మఱచి మనము నీరక్షీరంబుల భాతి నన్యోన్య సౌహార్దంబును నాంతరంగిక ప్రేమయుఁ గలిగియుండవలెను. నాకు మీరందఱు సమానులుగానున్నను, మీలోమీరన్యోన్య స్నేహభావంబులు వీడి యసూయాద్వేషపరవశులై యొకరినొకరు నిందించుకొనుచుఁ గాలంబుఁగడపుచుండుట న్యాయంబుగాఁగన్పట్టదు. ఆవిషయమై ప్రస్తావించుటకే మిమ్మునందఱ నీ యేకాంత స్థలంబునకు రప్పించితిని.

మధుసూ—సరస్వతీ! నీవుచెప్పినదెల్ల వాస్తవమేకావచ్చును. మేమసూయాపరులమైతిమని మమ్ము నిందించుచుంటివేగాని యందులకుఁ గారణ మరయకున్నావు. నీవు సర్వలలితకళలయందును నభినవ సరస్వతివైయుండి కారణ మరయకుంటివని చెప్పఁజాల; కారణముఁ దెలిసియే మమ్ములను గప్పిపుచ్చుచున్నావు. మా పరస్పరాసూయలకు నీవే కారణమని యింతకు మున్నె యుంగవేని యిప్పడెఱుంగుము. నీవిశ్వమానవసమానత్వసిద్ధాంతముల నాచరణయందుఁ బెట్టెదవో, పరమేశ్వరునినుండి నీతరమువచ్చిన వఱకు వచ్చుచుండిన జాతిమత సంప్రదాయ సిద్ధాంతంబుల నంగీకరించెదవో, సమయ మాసన్నమైనది. నీమనస్సున నిర్ధారణజేసుకొమ్ము. మనమందఱము యుక్తాయుక్త వివేచన దక్షులమే గాన నామనస్సునందలి యభిప్రాయంబులు నిష్కల్మషబుద్ధితో విశదీకరించెద నాకర్ణింపుము.

తే॥ బ్రహ్మవంశంబునందును ♦ బరఁగఁబుట్టి, బాల్యమాదిగ విద్యలఁ ♦ బ్రజ్ఞఁబూని
సుగుణములనెల్లఁ దులలేని ♦ సొంపుగాంచి, యీడుజోడుగఁ బెఱిగితి ♦ మింపుతోడ.

నీవును నేనును సద్బ్రాహ్మణవంశ సంజాతులమును, సత్సాంప్రదాయపరులమును గాన మనమిరువురమును వివాహమాడినచో మనమానందవారాశి నోలలాడుచుందుమని నాయభిప్రాయము. తరువాత నీయిష్టము

ఉ॥ బాలుఁడనైనకాలమునఁ ♦ బైకొను ప్రేముడి నాటపాటలన్
లీలలఁగూడి యాడితిమి ♦ లేజవరాలవుగాఁ జెలంగినన్
శీలము భంగమందకయె ♦ చెచ్చెఱఁగొల్చుచు నెల్లవేళలన్
గాలముఁబుచ్చితి న్గరుణఁ ♦ గాంచి వరింపుము కన్యకామణీ.

సరస్వతి—మిత్రమా!

తే॥ బ్రాహ్మవంశంబువారిలోఁ ♦ బరమ పూజ్యుఁ,డనుచు నే వరియింపఁగా♦నాసలేదు
మనుజ జాతిని భేదము ♦ లుండవలయు, నీశ్వరునిసృష్టి భేదంబు ♦ లేలనయ్యా.

మహమ్మదుఖాన్! అటులాలోచించెదవేమి! నీమనస్సులోని యభిప్రాయంబులను నాకుఁ జెప్పకున్నచో నాకెట్లు తెలియును.

మహమద్—నేను నీకు విశేషముచెప్పునదిలేదు! నాకు జాగీరు మేడలు మిద్దెలు గలవు. నీకు సుఖము, దేవేంద్రపదవియు దొరకును. నేను నీకు గులామువాఁడుగా నుందును. నమ్ము. మాకు రెండుమాటలులేవు. విను! నన్నుఁ బెండ్లిచేసుకొనినచో నీకు రాజ్యభోగమిచ్చెదను. లేదా! నాకు మరణముతప్పదు. అయిదు సంవత్సరములనుండియు నీకును మాకును స్నేహముగలదు డాక్టరుక్లాసులో. నామీద నీదయమాత్రముండవలెను. అక్బరు, జహంగీరు, షాజహాను మొగలుపాదుషాలు రాజపుత్త్రస్త్రీలను బెండ్లిచేసుకొని సుఖపడలేదా? అలాగున నీవును మమ్ములను బెండ్లిచేసుకొనవలె. నీకుఁ దప్పదు.

మ॥ ధనధాన్యంబులు జాలఁగాఁ దనరునో ♦ తన్వీశిరో రత్నమా
ఘనమౌ రాజ్యము మేడమిద్దెలిడి సౌ♦ఖ్యంబొప్పఁ బోషించెదన్
నిను బ్రేమించితి నన్ను బ్రేమఁగనుమా ♦ నీదాస్యమున్జేసెదన్
మును హిందూవనితామణుల్తురకల♦నొమ్మదించి జేబట్టరే.

ఉ॥ కూటికి గుడ్డకై పరుల ♦ కొంపల దాస్యము జేయువారలన్
నీటుగ నెట్లు మెచ్చెదవో ♦ నీ సుకుమారత నే నెఱుంగ నే
యాటల సంతసింతు విక ♦ చాబ్జదళాక్షీ వరింపు దాసునిన్
బాటల మెచ్చియిచ్చెదను ♦ బంగరుసొమ్ములు గోరుసట్లుగన్.

ఈ బీదబ్రాహ్మణ డింభకుని బెండ్లియాడి కష్టనష్టము లెందులకుఁ బడెదవు. నీకు నగలు, సొమ్ములు, డబ్బు, జమీ అంతయునిచ్చెదను. నామీఁద దయ యుంచుము. నీకు నిఖాకట్టెదను. నీకు బ్రాహ్మణ బాలకునిమీఁద దయ యున్నచో నుద్యోగ మిప్పించెదను. వాఁడింకొక పిల్లను బెండ్లియాడును. నీవునన్ను, బెండ్లియాడక తప్పదు. నమ్ము బేగంసాహెబా! నేనల్లామీఁద నొట్టువేసి చెప్పుచున్నాను. నమ్ము. నేనునీకు బాగుగా మ్రొక్కెదను. నీమీఁదఁ బ్రేమ మఱవలేను. మాలో బీబీలు పెండ్లికిఁ జాలమందియున్నారు. వారు

పగలు చూచిన రాత్రిఁ గలలో వచ్చెదరు. దివిటీక్రింద దీపాలు. సరస్వతీ! నిన్ను బెండ్లియాడవలె, సుఖముగా నుండవలెనని పట్టుఁబట్టినాను. నాముద్దు జెల్లింపు బీబీ సాహెబా! గడ్డముఁబట్టుకొని బ్రతిమాలెదను. నిన్ను విడువ లేను! విడువను. నన్ను వివాహమాడక పోయినచో బ్రాహ్మణబాలునకును నాకును విరోధముతప్పదు వాఁడైనను జావవలెను. నేనైనను జావవలెను.

సరస్వతి—ఏమిటాపిచ్చిమాటలు!

చ॥ కులమునగౌరవంబులను ♦ గోటివిధంబుల మాకు భేదము
ల్గలవవి వీడఁగాఁగలమె ♦ గాననిను న్వరియింపఁజాలఁ జా
పలమున మోహతాపముల ♦ బాధపడన్జనునయ్యా మిత్రమా
కలఁగనుచుంటివేమొ యిటు ♦ కౌవరముల్వలుకంగఁ బాడియే.

జాన్ మిత్రమా! నీయభిప్రాయమేమి.

జాన్— మేము పూర్వకాలములో నంటరానివాండ్లమని, చెప్పరానివాండ్లమని, నిమ్నజాతులమని, యుత్తమజాతులు మానెత్తిపై నెక్కి యణఁగఁద్రొక్కినారు గాని కాలము మాఱుచున్నది.

ఉ॥ పంటలు బండభూములను ♦ బాగుగ సేద్యముజేసి కష్టము
ల్వెంటఁబడంగ నోర్చి మిము ♦ వీడకయున్నను గూరబుద్ధి మ
మ్మంటఁగరానివారనుచు ♦ న్యాయముఁజూడక రాతిగుండెచే
నింటను గ్రామమధ్యమున ♦ నెచ్చటనుండఁగ నీయ రక్కటా.

చ॥ తినుటకు తిండిలేకయును ♦ దిన్ననివస్త్రము గట్టలేకయున్
జనములు దూషణల్సలుపఁ ♦ జక్కనిమంచము లేక పండఁగన్
ఘనమగువిద్యశాస్త్రములఁ ♦ గాంక్షఁబఠింపఁగలేక మొద్దులై
దినమొకవత్సరంబుగను ♦ దీర్పును మెంతయు గర్భశోదనన్.

ప్రభుత్వమువారు మమ్మె గౌరవించుచున్నారు. కొందఱు విద్యాధికులు, మాయెడ హిందూసంఘ మొనర్చిన యపరాధంబునకుఁ బశ్చాత్తాప తప్తులై మమ్ములను నెత్తిపై నెక్కించుకొను చున్నారు. నీవు డాక్టరువుగాన నేను జెప్పనక్కఱలేదు. నీ దేహమునందుఁ బాలు నెత్తురును నాదేహంబున మురికి నీరును లేదు. సర్వావయవంబులును నీయందువలెనే నాయందును నున్నవి. నీవు విద్యావిశారదవైనట్లే నేనుసరస్వతీవిద్యలయందును ముందంజ వేయుచున్నాను. ప్రపంచంబున దీనజాతులను సంస్కరించి మహోన్నత దశకుఁదీసుకొని వచ్చు టయే జన్మమెత్తినందులకు సార్థక్యంబు. నీవు బ్రాహ్మణవంశంబున జన్మించి నందులకు బ్రాహ్మణులలో వివాహమాడినచో నందాశ్చర్య మేమియులేదు. లోకసామాన్య విషయమే. నిమ్నజాతి సంఘవులమగు మాతో నైక్యమై మా యెడఁ బ్రేమానురాగంబులుజూపి మావంశములను వివాహమాడుటవలననే

మున్ను మాయెడ బ్రాహ్మణోత్తము లొనర్చిన మహాపాపము పటాపంచ లగును. నీవంటి యుత్తమాదర్శ కన్యకామణులు జన్మమెత్తినందులకు సార్థక్యంబు. నేనెట్లో యీడాక్టరు పరీక్ష ముగించుటతోడనే నాకు గవర్నమెంటు వారు పెద్దయుద్యోగమిచ్చెదరు. నీవు నన్నే వివాహమాడినచో నాజన్మము ధన్యమగును!

మ॥ మముజేరన్ బిలిపించి కష్టములు వే • మాయింప సంసిద్ధులై
విమలాంతఃకరణంబు మాయెడల జూ•పింపంగ నేవారలున్
గమనీయాకృతితోడ రారుగద యో•కంజాక్షి నీవైన చి
త్తమునం బ్రేమమునిూఱ భార్యవయి నన్ • ధన్యాత్ముఁ గావింపుమా.

నావంశంబు పావనంబగును. మాజాతి యభివృద్ధి యత్యల్పకాలంబుననే గాంచును. నేను నిన్నుఁబువ్వులలోఁబెట్టి పూజింతును. మాకులంబువారిచే నీకు బ్రహ్మరథంబుఁ బట్టించెదను. నీవు బ్రాహ్మణవనితా రత్నంబుగానే యున్నచో, కోటిమంది చదువుకున్నవారిలో నీ వొకర్తె వగుదువు. నీపేరు ప్రతిష్ఠలం పైకిరావు! నేను క్రైస్తవుఁడనని సందేహించెదవేమో. అట్టి సందేహమేమియు నక్కఱలేదు. ఈక్షణంబుననే నార్యసమాజ సంఘంబువలన శుద్ధి యంగీకరించి నిన్ను వివాహమాడెదను. నీ యాజ్ఞలఁ బరిపాలించెదను. నీకనుసన్నల మెలంగెదను. నీ చిత్తము నా ప్రాప్తము.

సరస్వతి—(నవ్వుచు) ఓరి పిడుగా! నీ కెంత యాసయున్నదిరా!

ఆ॥ దిక్కుమొక్కులేని • దీనుల రక్షింప, దైవమునకుఁ గాక • తరమె మనకు
అన్నవస్త్రములవి • యున్నచోఁ బదివేలు, బ్రహ్మకులఁపు భార్యఁ•బడయవలెనె.

ఉ॥ భూములు పాడిపంటలను • బొందఁగఁ జేయవలె న్బ్రయత్నముల్
నీమము సద్గుణంబులును • నిర్మల శ్రద్ధయు దైవభక్తియున్
వేమఱు శాస్త్రపాండితియుఁ • బెంపువహింపఁగఁ గోరఁగావలెన్
గామముతోడ భూసురుల•కాంతను గట్టుకొనంగఁ గోరెదే.

ప్రాణమిత్రులారా! మీ మనస్సులోని యభిప్రాయంబులు నిష్కల్మషముగాఁ బూసఁగుచ్చినట్లు తెలుపుటచే నేను ధన్యను. నేను మిమ్ములను స్నేహితులుగా నంగీకరించితినిగాని మిమ్ముల వివాహమాడెదనని యెప్పుడును మీకాసఁ గల్పింపలేదు. నా వివాహము నిమిత్తమై నేనింతవఱకు యోచింపనే లేదు. నిక్కమాలోచించినచో నేను నిమ్మెవరిని గూడ వివాహమాడనేమో?

జాన్—సరస్వతీ నీబ్రాహ్మణజాతి కాపట్యముఁ బోనిచ్చితివికాదు. మమ్ములను వివాహమాడఁదలంపనిచో మాపై నింత యనురాగంబుఁ జూపుమని యెవ్వరేడ్చిరి! నీ కొఁగంటి చూపులచేతను, నీ శృంగారచేష్టలచేతను మమ్ములను బంధించి

నీ యింటియొద్దఁ గుక్కలవలెఁ బడగాపులు పరుండఁజేసి తుద కిట్టి యవమానమా?

మహమ్మదు—సరస్వతీభాయీ! ఆడవారు ముందు బెట్టు చేయుదురు. తరువాత లొంగి పోయెదరు. ఆసంగతి మాకుఁ దెలియును. నీవీ పేద బ్రాహ్మణకుమారుని, ఈ క్రైస్తవుని గట్టుకొని కష్టపడలేవు. మాకు సొమ్ము డబ్బు చాలఁగుప్పలుగా నున్నవి. అది అంతయు నీకిచ్చివేసెదను. బాగుగా నాలోచించి చెప్పు. గడు విచ్చెదను.

మధుసూ—సరస్వతీ! నల్లనిశెల్ల నీళ్లను దెల్లనిశెల్లఁ బాలుసునని తలంపకుము. తళుకు బెళుకు రాళ్లన్నియు నిక్కంబులగు నీలంబులుగావు. కులశీల మర్యాద లాలోచింపవలయునుగాని, ధనధాన్యంబులను, మేడమిద్దెలను, సంపదలను జూచి యగ్నిహోత్రింబును మహాఫలంఁ ని యెంచి నాశనంబగు శలభింబువలెఁ బ్రవర్తింపకుము. కష్టసుఖములు కొవటికుండలు. మనశరీరంబులే బుద్బుదప్రాయంబులు. యౌవనము తటిల్లత ప్రభ వంటిది. క్షణభంగురంబగు సౌఖ్యంబున కాశించి తరతరంబులనుండి యార్జించిన యార్యమత సంప్రదాయంబులను మంటఁగల్పకుము.

మహమ్మదు—బ్రాహ్మణడింభకా! నోటికి వచ్చినట్లు కారులరచుచున్నావేమి! నీకు దెలిసినది సరస్వతికిఁ దెలియదు రా లుచ్చా! మా సొమ్ము మేడలఁ దృణీకరించుచున్నావు? అవును! దమ్మిడి, దమ్మిడి సంభావనకు దేవురించు బ్రాహ్మణడింభకులకు డబ్బుమజా యేమి తెలియును. నోటికి జాగ్రత్తగా బుద్ధి చెప్పు. లేకున్న నీ యెముకలు పొడిచేసెదను. బుద్ధి గిద్ధి కలిగి బ్రతుకు. ఏమను కొన్నావో! సాయబుదెబ్బ తడాఖా చూడు! (అని మీసము దువ్వుచుండును).

జాన్—బాపలే దేశము కొంపతీసినారు! మా మాలవాండ్ల కొంపతీసినారు! జలగల వలె నందతిని పీడించుకొని తిందురు. మమ్ముల నధోగతికిఁ దెచ్చినది వాండ్లే. కాఁబట్టి తిరిగి బ్రాహ్మణులందఱు మాలవాండ్లు కావలె. మాలవాళ్లందఱు బ్రాహ్మణులుకావలె! అప్పుడు గాని దేశము బాగుపడదు! కాఁబట్టి సరస్వతీ! నన్నుఁ బెళ్లి చేసుకో! మన మిద్దఱము మాలవాండ్లను బ్రాహ్మణులను జేయుదము.

మహ—జాన్ బాగాచెప్పినావు! చచ్చిన గొడ్డుమాంసముతిను మాలమాదిగలలో బ్రాహ్మణులు కలిసెదరా! వెనుక సాహెబులు రాజ్యము చేసినారు. వారిద గ్గర బ్రాహ్మణులు మంత్రిపని చేసినారు. ఇద్దరికి సరిపోయినది. ఇప్పుడు బాప లందఱును ముసల్మానులు గావలెను. సాహెబులందరు బాపలు గావలెను! సరస్వతీ! నీకు మధుసూదనుఁడు, జాన్,మంచిమాటఁజెప్పరు,వాండ్లువంచకులు.

వాండ్లమాటనమ్మితివా నిన్ను గోతిలోఁబడఁద్రోయుదురు. వాండ్లు నీకు మాయ మాటలుజెప్పి జేబులో వేసుకొందురు. బహుకష్టము. వారిమాట యసత్యము. వారి మాటలు వినబోకుము. ఈ బ్రాహ్మణబాలుఁడు నిన్ను మసిబూసి మారేడుకాయఁ జేయుటకుఁ జూచుచున్నాఁడు. పైసాలేదు. దివాలాపొచ్చా. వాడిని గట్టుకొనిన నీపాట్లు కుక్కలకులేవు. జాన్‌ను పెండ్లియాడినచో నీకుఁ గుక్కమాంసమే గతి. నన్ను నిఖా కట్టుకొని, నిన్ను రాణిని జేసెదనో లేదో చూడునాదెబ్బ. నీకుఁజాలేసుఖముండును. బ్రాహ్మణుఁడిభకా! నీవిఁక నున్నచో నీప్రాణముదక్కదు. సరస్వతి నిక్కడ దించి కాలికిబుద్ధిజెప్పు. జాన్! నీవు మాలవాఁడవు. సరస్వతి నిన్ను పెళ్ళియాడదు. పో! పారిపో! ఇక్కడ నుండి నచో నీమాంసముఁగోయించి గద్దలకు వేసెదను చూడు నామజా. (అని జేతికర్రతోఁ గొట్టఁబోవును)

జాన్—(స్వగతము) సరసము విరసముగా మారినది. నాకెందులకీ దుష్టునితో వృథా వైరము. ఏమో చేసుకొన్నమ్మకు బొక్కినదే కూలియన్నట్లు సరస్వతితోఁ గొంతకాలము స్నేహము చేసిత మదియే పదివేలు.(బహిరంగముగా) సరస్వతీ! నాకుఁ బనియున్నది, నేను వెడలిపోయెద (అని వెళ్ళి పోవసాగును)

సర—మహమ్మదుఖాన్ బెదరించుచున్నాఁడే. నన్నిటులొంటరిగా వదలివెళ్ళెదవా. ఇదియేనా మనస్నేహము.

జాన్—నాకేమియుఁదెలియదు. మీయిష్టము మీయిష్టము. మీరేమైన నెవరికేఁగావల యును! (వెళ్ళిపోవును)

మహమ్మ—ఒక మాలపిశాచము వదిలినది. ఇఁక బ్రాహ్మణ పిశాచము పట్టిబాధించు చున్నది. బ్రాహ్మణపిశాచమా! వెళ్ళిపోయెదవా లేదా. నామనుష్యులను పిలి పించి రెక్కలు కట్టించి చంపిపారవేయనా?

మధుసూ—నీవునన్ను జంపినతరువాత నీ సరస్వతిని వివాహమాడఁ దలంచితివా య ట్లొనర్పవచ్చును. ఆమె నిన్ను మనసార వరించినచో నేనామె నిప్పుడేవదలి వెళ్లెదను. కాని నీవిట్లామెను బళుబలము చేత లోఁబఱచుకొనుటకు నాప్రాణ ముండఁగా నేనంగీకరింపను.

మహమ్మ—అరే! కాఫర్ బచ్చా! నీయిష్టము మాకెందుకు. నీమోటసాహసమునకు తగిన శాస్తిచేసెదనుచూడు! (అనిఈలవేయఁగా పదిమంది మహమ్మదీయులు కర్రలతోవచ్చి మధుసూదనునితోఁ బోరాడుదురు. మధుసూదనుఁడు శక్తియు న్నంతవఱకుఁ బోరాడి పడిపోవును. ఒకసవారిలో సరస్వతిని గూర్చుండఁ బెట్టుకొని తలుపులుమూసి తీసుకొని పోయెదరు.)

మధుసూ—(మూర్ఛనుండి లేచి నలుదిశలుఁ బరికించి)

మ॥ అకటా యో నవమోహనాఁగి నను నీ • వన్యాయముంజేసితే
నికటంబందును నుండి యన్యులకు నే • నిన్నర్పణం జేసితిన్

ఇక నే నేవిధి నీదు వాఁడ చెలియా ♦ యీమోహవారాశినిన్
సకియా వేఱొక జన్మమందయిన నీ♦సఖ్యం బపేక్షించెదన్.

ఉ॥ నీసుకుమార దేహమును ♦ నీదు శుచిస్మిత మానసాబ్జమున్
నీ సరసంపు వాగ్ఝరులు ♦ నీదు విలాసఁపు మోహదృష్టులున్
నీ సుగుణంపు సంపదలు ♦ నీమధురామృత వాక్ప్రవాహముల్
ఏ సరణిన్మనంబునను ♦ నే మఱువంగలవాఁడఁ దెల్పుమా.

అముష్కర తురుష్కాధముఁడు సరస్వతిని బంధించికొని పోయియుండును. ఆమె కారాగార విమోచనంబునకు సర్వప్రయత్నంబు లొనర్చెదగాక.

## చతుర్థరంగము.

[విష్ణురావు కోడలు ప్రభావతి, మనుమడు కృష్ణమూర్తి ప్రవేశము.]

విష్ణు—కటకటా! ఈ దుర్భరదారిద్ర్య మెంత దుఃఖకరము. ఎంత దుస్సహము. అగర్భశ్రీమంతుఁడనయ్యు దివారాత్రంబులు నిరంతరపరిశ్రమచే విద్యాభ్యాసం బొనరించి క్రమక్రమంబుగా మండల న్యాయాధిపదం బధిష్ఠించి సౌఖ్యంబు లనుభవించి, తుదకు విశ్రాంతివేతనము (బించను) గైకొని, రామకృష్ణగోవిందా యని పరమేశ్వరధ్యానం బొనరించుచుఁ గాలంబుఁ గడపవలయునని ప్రయత్నించితినిగాని; యెట్టి దుర్ముహూర్తంబునఁ బించను బుచ్చుకొంటినో యప్పటి నుండియుఁ గష్టనష్టంబులు నా వెన్నంటి వచ్చుచున్నవి. అల్లారుముద్దుగాఁ బెంచిన కూతురును కుమారుఁడును, విద్యాభ్యాసంబు పేరుఁబెట్టుకొని విదేశంబు నందుఁ గొమరుఁడును, చెన్నపట్టణంబునఁ గూతురును గాలంబుగడపుచున్నారు. పరమపతివ్రతాతిలకంబైన కోడలు గాటికిఁ గాళ్లుసాచుకొని కూర్చుండియున్న నన్ను సేవించుచున్నది. దూరదేశంబులనుండి పిల్లల క్షేమసమాచారముగాని, విద్యాభ్యాససమాప్తి విషయంబులుగాని తెలియుటలేదు. గాని, ప్రతివారమును సొమ్ముఁబంపుమని టెలిగ్రాము లెడతెరపి లేక కురియుచున్న. విచీమవలె కూర్చి సంపాదించిన ధనకనకవస్తు వాహనసంపదయంతయు నానాఁటికిఁ గృష్ణపక్షచంద్రునివలె హరించి పోవుచున్నది. పిల్లల చదువు సంధ్యలన్ననో కనురెప్పల మీది జుట్టువలె యెదుగుబొదుగు లేక యథాప్రకారమునకు మోసము లేకుండ నున్నది. ఈ సంగతులు పిల్లలకుఁ దెలియపఱచి నను మడిమాన్యంబు లమ్మి సొమ్ముపంపుమని వ్రాయుటయేగాని ఈ నాఁడు వచ్చెదమను వర్తమానమేగానరాదు. ఇదుగో టెలిగ్రాముజవాను యమభటుని వలెఁ బ్రత్యక్షమై యీ తంతివార్త యిచ్చిపోయె! "తక్షణమే మూడువేల రూపాయలను బంపుఁడు, లేకున్న నిదివఱకుఁ జేసిన వ్యయమంతయు వ్యర్థ" మని తెల్పుచున్నాడు. మూడు వేలు కాదుగదా మూడు దమ్మిడీలైన లేవు. ఎక్కడనప్పైనను బుట్టకున్నది. ఏ వ్యాపారస్థునియొద్ద కేగినను నీతగింజ వేసి

తాటిగింజలాగవలెనని ప్రయత్నముఁ జేయువారేగాని దయాధర్మతత్పరు లే వంకఁ జూచినను గానరారు. వారమురోజులక్రింద సరస్వతి రు 500/-సొమ్ము బంపుమని టెలిగ్రామిచ్చినది. ఆసొమ్మెక్కడఁ బుట్టునాయని త్రొక్కులాడు చుండఁగా మూలిగెడు నక్కమీఁద తాటికాయబడినట్లే టెలిగ్రామువచ్చినది. దీనికేమి గతి. ఎప్పుడు నాపిల్లవాఁడు వచ్చి యుద్యోగము సంపాదించి నాకష్టంబులు దీర్చునాయని గంపెడాసతో నున్న నాయాసలడియాసలైనవి. నా గర్భవాసంబునఁ బుట్టిన నా కుమారీరత్నంబు నన్ను వీడి వెళ్లినది. పొరుగింటి నుండి తెచ్చుకున్న కోడలే గర్భవాసంబునఁ బుట్టిన పిల్లకన్న నధిక ప్రేమాదరంబులతోఁ బరిచర్యఁ జేయుచున్నది. ఈ వార్ధక్యంబున నాకష్ట జాలంబులు జూడఁజాలక నాభాగ్య దేవత నా యర్ధాంగి, స్వర్గంబునకేగి యీ కష్టంబులన్నియు నా పాలొనరించి నను డించిపోయినది. నా భాగ్యరాశినను డించిపోయినప్పటినుండి దారిద్ర్యదేవత నానెత్తిపై నెక్కి తాండవమాడు చున్నది. ఇంకేది దిక్కు.

సీ॥ వెండి బంగారంబు ♦ వెలలేని నాణెము, ల్తస్కరాధములచేఁ ♦ దరలఁబడియె
ఇండ్లు వాకిండ్లును ♦ నీనాముతోటలుం, దాకట్టు వాకట్టు ♦ దార్లఁజేరెఁ
నప్పులిచ్చినవారు ♦ పప్పుకూడు భుజించి, కాలుసాచిరి యప్పు♦కాసు నీరు
కాసులీసమయప్పు ♦ గైకొన్న ఋణదాత, రక్త మాంసముఁ బీల్చె♦ రచ్చకీడ్చెఁ
తే॥ జదువు సంధ్యల పేర్బెట్టి ♦ సన్నసన్న, కడిగిబెట్టిరి ధనమెల్ల ♦ కడకు నాకుఁ
బువ్వులమ్మిన వీధినె ♦ పుడకలమ్మ, వలసెనక్కట దైవమా ♦ వలదె కరుణ.

చ॥ చిఱుతతనంపుఁ బ్రాయమును ♦ జెన్నలరారెడు మందిరంబులున్
సురుచిర భర్మనిర్మితవి ♦ శుద్ధ విభూషణరత్నరాశియున్
నిరతపు టన్నదానమును ♦ నిత్య వివాహము పచ్చతోరణల్
అరుదువహించె మృగ్యమయి ♦ యాపరమేశుదయావిహీనతన్.

ఉ॥ ఎద్దుఏతం బొనర్చితినొ ♦ యేవిబుధాత్ముల నొంచినాఁడనో
పెద్దలనేరి దూరితినొ ♦ పేదల నేరిని నవ్వినాఁడనో
హద్దును పద్దుమీఱి గత ♦ మే భవమం దెటు దోషినైతినో
తద్దయులేమిఁ జెంది దురి♦తంబుననేఁ బడియుంటి నక్కటా.

మ॥ తినగా నన్నమెఱుంగనెట్టిదో కదా ♦ తీర్పంగనెల్లొనో యీ
ఘనమౌనాకలిబాధ పండుటకునై ♦ గన్పట్టదే మంచముల్
జననంబాదిగఁ బొందు సౌఖ్యము లదృ♦శ్యంబయ్యె వార్ధక్యము
న్నేను [illegible] టంగబడి దుఃఖవార్ధిఁగడవ ♦ నీవేదియు న్లేదు గా.

ఉ॥ కన్నులు గానరావు కొడు♦కా పరదేశమునందుఁ జిక్కి నా
యన్నులమిన్న నావిధము ♦ నారయఁజాలక వీడెప్రాణము

ల్పన్ను తిఁగాంచు కోడలిది ♦ జాలిఁగృశించుచు దుఃఖవార్ధినా
పన్నత నొందుచుండెమముఁ ♦ బాలన సేయవె దీనరక్షకా.

ప్రిభా—మామగారూ! దుఃఖించి దుఃఖించి నీరగుటయేగాని లాభమెుక్కింతయుఁ గానరాదు. ఎప్పుడు పతివ్రతామతల్లి యత్తగారు, మహాలక్ష్మి, వెడలి పోయినదో యప్పటినుండియే పండువంటి కాపురంబునకు ముప్పుతిప్పలు వచ్చినవి. మీ యబ్బాయిగారియొద్దనుండిగాని వదినెగారియొద్దనుండిగాని యుత్తరములు వచ్చినవా?

కృష్ణ—తాతగారు! నాన్న యెప్పుడు వచ్చెదరండి! వచ్చినన్నెత్తుకొనరండి! బొమ్మలు మిఠాయి తెచ్చి పెట్టమనివ్రాయండి! అందఱుపిల్లలు మా నాన్న నాన్న అని గంతులు వేయుచున్నారే వాండ్లనాన్నలు వాండ్లనెత్తుకొని యెంత చక్కగా ముద్దుబెట్టుకొందురు! మానాన్న యొక్కమాఱైనను రారేమండి, అమ్మ! పాపము! నాన్నగారికోసము అఱ్ఱెడ్చుచుండునే! యొక్కమారయినను వచ్చి యేడువవద్దని చెప్పరేమండి! మా నాన్న యెక్కడ నున్నారో చెప్పండి! నేనైనను వెళ్లిపిలుచుకొని వచ్చెదను.

విష్ణు—శ్రీకృష్ణా! వంశోద్ధారకా! నాకేమి చెప్పుటకును నోరాడకున్నదోయి! (అని కన్నుల నీరునించును) మీ నాయన గొప్పచదువుచదివి సొమ్ము సంపాదించుటకు వెళ్లినాఁడు. త్వరలో నే వచ్చునులే! అమ్మా! ప్రిభావతీ! ఈ పిల్లవానికిఁ గూడ తండ్రిమీఁద బెంగపాటినది. ఆదుష్టాత్మునకు మనపై దయ లేక పరదేశంబులఁ దిరుగుచున్నాఁడు. పిల్లవానికి ధైర్యముఁ జెప్పుచుండుము పెద్దవాఁడను నాపని యెటులైనను, నీవు ధైర్యముతోఁ బిల్లవానిని బోషింపుము.

ప్రిభా—మామగారు! మీరు ధైర్యము వహించి మాకు ధైర్యముఁ జెప్పుటకుమాఱుగా మీరే విలపించిన నబలనగు నేనేమి చేయుదానను! మీ యబ్బాయిని గూర్చి పలువురు పలువిధములుగాఁ జెప్పుకొనుచున్నారు. ఇంగ్లండు దేశంబునఁ బరీక్షలోఁ దప్పిపోయి నారనియు, నేదో తెల్లదొరసానిని వివాహమాడి యామెతోఁ గాపురముఁ జేయుచున్నారనియు, హిందూదేశంబునకు రావలయునను నభిప్రాయమే లేదనియు వారి స్నేహితుఁడైన వెంకటావు తన తండ్రిగారి కుత్తరము వ్రాసెనఁట.

విష్ణు—పరమేశ్వరా! నాకెట్టిగతి పట్టినది.(అని మూర్ఛిల్లును.

కృష్ణ—తాతగారు! తాతగారు! అమ్మా! తాతగారు పడిపోయినారు.

ప్రిభావతి—[శీతలనీరంబులఁజల్లి శైత్యోపచారంబులఁ జేయ విష్ణురావు మూర్ఛఁదేరి కూర్చుండును. ప్రిభావతి కృష్ణమూర్తిని దగ్గఱ కూర్చుండఁబెట్టి] మామగారు.

ఉ॥ పూతచరిత్రి దుఃఖమున ♦ మున్గినఁ జెప్పెడిదేమి మీకికన్
లేతవయస్సు పుత్రునకు ♦ లేరట వానికిఁ దండ్రిగారు మీ
రే తలిదండ్రులై యతని♦కింగిత జ్ఞానముఁ గూర్చఁగావలెన్
దాతయటంచువచ్చు చిఱు♦తన్ దరిజేర్పుఁడు మ్రింగుఁడార్తినిన్.

సీ॥ పుడమిఁబుట్టిననాఁడు ♦ పూచికపుల్లైన, వెనువెంటఁదేలేము ♦ వెఱవనేల
పుడమివీడెడునాఁడు ♦ పూచికపుల్లైన, వెనువెంటఁగొనిపోము ♦ వెఱవనేల
సతిసుత బాంధవుల్ ♦ సర్వసంపదలును, గర్మానుగుణముగాఁ ♦ గలుగఁబోవు
సత్యశౌచంబులు ♦ సదమలాచారముల్, స్వర్గధామముఁజేర్పఁ ♦ బ్రజలనెల్ల
తే॥ గష్టములుగల్గ భయపడఁ ♦ గార్యమేమి, సుఖముకల్గినఁ దుళ్ళిన ♦ శోభగలదె
కష్టసుఖముల సమముగాఁ♦గాంచువాఁడు,బరమయోగీంద్రుఁడంచును♦బలుకరయ్య

సీ॥ అగ్నిసాక్షిగనన్ను ♦ నర్ధాంగిఁగాఁగొని, పరభామలను జెట్టఁ ♦ బట్టెనొక్కొ
గళమున సూత్రంబుఁ ♦ గట్టిచేసినయట్టి, మహిత ప్రమాణము ♦ మఱచెనొక్కొ
సతియరుంధతిదేవి ♦ చక్కఁజూపుచుఁజేయు, ప్రతినల భంగంబుఁ ♦ జఱచెనొక్కొ
వేదమంత్రంబుల ♦ వెలఁదిఁబాయనటంచు, సలిపిన ప్రతినలు ♦ సమసెనొక్కొ
తే॥ జీలకఱ్ఱయు బెల్లంబు ♦ శీర్షమందుఁ, బెట్టిచేసిన ప్రతినలు ♦ మట్టిఁగలసె
నెత్తిఁదలఁబ్రాలువోయుచు♦నిన్నుబాయ,నంచుఁజేసినబాసయే♦మయ్యెనొక్కొ.

సీ॥ మరణ మెప్పుడటంచు ♦ మఱిమఱిదుఃఖించి, మూలమగ్గుచునుండె ♦ ముసలితండ్రి
మదన ప్రతాపాగ్ని ♦ మగ్గుచు మోహంపు, వారాశిలోఁగ్రుంగె ♦ భార్యయిచట
కన్నసంతానంబుఁ♦గాంచి పెంచెడు దిక్కు,గానక తపియించుఁ ♦ గన్నకొడుకు
తాత దండ్రులనాఁటి ♦ ధనధాన్యవర్గంబు, ఋణదాతలకుజిక్కె ♦ యేఁగనయ్యెఁ
తే॥ దినుటకన్నంబు గఱవయ్యె ♦ దివ్యసౌధ
జాలమంతయు వశమయ్యె ♦ శాత్రవులకుఁ
బ్రాణనాథుండు పరదేశ ♦ వాసియయ్యె
నాలుబిడ్డలు దుఃఖింప ♦ నరయరాఁడు
పాపఫలితంబుఁదప్పింప ♦ బ్రహ్మకగునె.

## పంచమరంగము.

[మహమ్మదుఖాన్ మేడయందొక గది - సరస్వతి సేవకురాలు జహరున్నిసా-బీబి ప్రవేశము]

జహరున్నిసా—అమ్మా! సరస్వతీభాయి! నీదుఃఖంబున కంతుఁబొంతు గనఁబడు నట్లులేదు. నడి యౌవనంబున జీవితంబు దుఃఖభాజనం బొనర్పఁదగునా. సిరిసంపద లనుభవింప వలెను. నీ సౌందర్యంబునకుఁ దగిన వరుండైన మహమ్మదుఖానును వరించి యీ సామ్రాజ్యంబున కంతకు దేవేరివై మమ్ముల నందఱను సుఖపెట్టవలయును. అంతియేగాని బేలవై దుఃఖించుటచే నేమిప్రయోజనము.

సరస్వతి—నీ సోదిఁగట్టిపెట్టి నీ వవ్వలకుఁబొమ్ము.

జహారున్నిసా—అమ్మా! చిన్నతనంబునఁ గష్టంబు లెఱుఁగని తల్లివి. నీకెట్లు దుఃఖ మోర్చెదవో యని చెప్పుచున్నాను. నీవు పండితురాలవఁట కాదా? మాప్రభువు గూడఁ బండితోత్తముఁడే. రసజ్ఞుఁడే. నేనిప్పుడు బ్రతిమాలినపుడు నామాట వినవేని, మాప్రభువు బలాత్కారమొనరించునప్పుడైనను వినవలసియుండును. ఈ మేడనుండి తప్పించుకొని పోవుటకు బ్రహ్మకైనను శక్యంబుగాద న్నచో నీవంటియబలారత్నంబునకు సాధ్యమగునా! నిన్నురక్షించు వారెవరిచట గానరారు. కాన మొండిపట్టుఁబట్టక మహమ్మదుఖానును వరింపుము! లేకున్న నాతఁడాగ్రహ పరవశుండై నిన్ను వధింపవచ్చును.

సరస్వతి—నా ప్రాణంబులైనను వీడెదనుగాని నేనాతని వరింపను.

[మహమ్మదుఖానును మాధవియును దాసియుఁ బ్రవేశింతురు]

మహమ్మదు—జహారున్నిసా! మాసరస్వతీబేగంసాహెబాగారేమనుచున్నారు.

జహారు—ప్రభూ! నే నెంతచెప్పినను దాఁబట్టిన కుందేటికి మూఁడేకాళ్ళను చున్నది. ప్రాణంబులైనను గోల్పోవునుగాని మిమ్ము వివాహమాడదట.

మహమ్మ—సరస్వతి సాహెబా! వినుము!

మ॥ ధనధాన్యంబులఁ బ్రేమఁగోరెదవొ లే ♦ దా నాణెముల్గోరెదో
వనము ల్భాములు, భాగ్యభోగ్యములు వే ♦ వాంఛించెదో లేక నా
ఘన సౌధంబులు మేడమిద్దెలను వే ♦ గన్మెచ్చి యిమ్మందువో
వనితారత్నమ! గోరు మెట్టి వయినన్ ♦ వాంఛ ల్వడిం దీర్చెదన్.

సీ॥ ప్రేమవాఙ్లాపుల ♦ పెంపుజూపింతువా, తారహారములిచ్చి ♦ తనివిఁదీర్తు
నూపురంపుఁబల్కుల ♦ నపురూపముగఁబల్కు, నవరత్నహారంబు ♦ నమ్మియిత్తు
పల్లవంబునుబోని ♦ పాటలాధరమిమ్ము, రాజ్యభోగంబులు ♦ రమణియిత్తు
బాహువల్లిక చేత ♦ బంధించుచో మెచ్చి, యాజన్మదాసుఁడై ♦ యతివగొల్తు
తే॥ నన్నువరియించి పెండ్లాడి ♦ నాదుజన్మ, ధన్యమొనరింపు వెలలేని ♦ ధనముగూర్తు
నాదురాజ్యంబు విభవంబు ♦ నీదుసొమ్ము, నన్నుమదినమ్మ లేలెమ్మ ♦ సన్నుతాంగి,

సీ॥ పోతుటీగయునైన ♦ పొడసూపఁగా రాదు, బంధంబుదప్పింప ♦ వశముగాదు,
ఆయుధపాణులై ♦ యహరహంబులనెల్ల, సేవకుల్ గాపుగాఁ ♦ జెలఁగుచుంద్రు
వారునాజ్ఞనైనను ♦ వదలింపగాఁవచ్చుఁ నాయాజ్ఞ నెదిరించి ♦ నడువలేరుఁ
పగలురాత్రులయందు ♦ బందెలోపలఁజిక్కి, పలుపాట్లు పడనేల ♦ పద్మగంధి
తే॥ రూపురేఖావిలాసముల్ ♦ రూఢిగలవు, భాగ్యభోగ్యంబులెన్నంగ ♦ వశముగాదు
కులము గొప్పతనంబును ♦ వలదుజూడ, నన్ను దయఁజూడు పెండ్లాడు ♦ నాతిమిన్న.

సరస్వతి—నీవు మధుసూదనునకపాయంబుఁగల్పించి నన్ను దిక్కులేనిదానిఁగా నొన

రించి నిర్బంధించిన వివాహమాడుదునా? ఇంతకుబూర్వము నీపైనున్న యను రాగ బంధంబులుగూడఁ ద్రెంపివేసితిని. నేనెన్నటికి నిన్ను వివాహమాడను.

చ॥ తురకవు దుర్మదాంధుడవు ♦ దుష్టగుణంబుల కాకరుండ వే
కరుణయు సద్గుణంబులును ♦ గాంచఁగరాదు మనంబునందు న
న్నరువడి పట్టి తెచ్చితివి ♦ బంధనజేసితి వింతజాలదే
మరిమరి వేద పొందుదునె ♦ మానుము యిట్టి వృథాప్రసంగముల్.

మ॥ మదిదాక్షిణ్యము లేశమైన వలదే ♦ మానిజ్జైరంబెట్టెదే
పదుగుర్మ్రొత్తురె నీదు సంపదలు వే ♦ భస్మంబులై పోవవే
సుదతీరత్నము కంట నీరుబడిన ♦ న్సుతాపము డాగాని దు
ర్వ్యథజెందండె సుఖంబుగోల్పడెను దు ♦ ర్వ్యాపారమూఢాత్మకా.

తే॥ రావణుండేమి సుఖియించె ♦ రమణిబట్టి, కౌరవులు భోగమందిరే ♦ కాంత జెనకి
వాలి సుగ్రీవుసతిబట్టి ♦ భంగపడడె, పరులసతియాస ప్రాణము ♦ ల్బాపుసుమ్ము

మహమ్మద్— అటులైన నీ వాజన్మాంతము నీ బంధిఖానాలోఁ బడి మ్రగ్గవలసినదే! మత్తగజేంద్రంబునైనను బంధించి స్వాధీనముఁ జేసుకొనవచ్చునన్నచో నబలా రత్నంబగు నిన్ను స్వాధీనం బొనరించుటకు విశేషకాలము బట్టదు.

తే॥ తాటియాకుల చప్పుళ్లు ♦ దండి కలుగ, భయము జెందునె కుందేళ్లు ♦ భాసురాంగి
ప్రళయకోపాగ్ని కన్నుల ♦ బడుచునున్న, నీదు సౌందర్యమును బాయ ♦ నీదుమనసు.

ఉ॥ అన్నులమిన్న రేబవలు ♦ యాసస్మరింపుదు నీదు నామమున్
కన్నుల నిద్రరాదు విము ♦ ఖంబులు సర్వసుఖంబు లక్కటా
ఎన్నడు మోహతాపములు ♦ యింపుగ దీర్చి వరింపుదానవో
నన్ను యనుగ్రహింపుసతి ♦ నన్వెస పెండిలియాడు మ్రొక్కెదన్.

ఒంటరిగాఁ గాలంబుగడపుట కష్టముగాన మీ బ్రాహ్మణజాతికిఁ జెందిన మాధవియను సేవకురాలిని నీకుఁ బరిచర్యలొనర్ప నియమించితిని! నీకొక నెల గడువొసంగితి. ఈలోపున నీవుబుద్ధి మరలించుకొని నన్ను వివాహమాడెదవా సరియే లేకున్న నీకును నాకును బలాత్కార వివాహంబు దప్పదు.

తే॥ గోవధము జేయు తురకల ♦ కులముమాది, గోవుమాతను పూజించు ♦ కులము మీది
నీకు మాకును వైరంబు ♦ నెమ్మికలుగ, నుభయ కులముల్లు ప్రమగ్గవే ♦ యుజ్వలాంగి.

చ॥ కటకట యిట్టి కానిపని ♦ కై బహు భంగుల బట్టుపట్టి నీ
విటు ననుభంగ బుచ్చినను ♦ యేలసహించెద పోవనిత్తునే
కుటిలత కష్టనష్టములఁ ♦ గూర్చి విపత్తుల పాలుజేసి ని
న్నటుతర శౌర్యధైర్యముల ♦ బట్టి వరించెద కన్యకామణీ.

సరస్వతి— నేనంతకాలము బ్రతికియున్న తరువాతఁ జూచుకొనవచ్చును.

మాధవి—సరస్వతీదేవీ! దుఃఖ ముపశమింపఁజేసికొనుము కానున్నది గాకమానదు. దైవవిధి యవిలంఘనీయము గదా!

తే॥ కలుగనున్నది దప్పింపఁ గలఁడె యెవఁడు, బ్రహ్మవ్రాతను తుడిపింప వలనుపడునె
కరకు తురకల వరియించి కష్టపడఁగ, విధిలిఖించెను గాబోలు వెలఁది నొసట.

సాహెబుగారు నెల రోజులు గడవొసంగిరి. ఈలోపున నీయంగీకారము వారికిఁ దెలియఁబఱపవచ్చును. తరువాత నిర్బంధ వివాహంబునకన్నఁ నీలోపున స్వయంవరంబే సర్వశ్రేయము. అమ్మా! నీకు నేను జెలికత్తెనై సర్వోపచారంబు లొనరించుచుందును. నైకొనుము. ఊరక నోటికివచ్చినట్లు సాహెబుగారిని దిట్టిన లాభమేమి. ఏ జన్మ కెంత బ్రహ్మ నుదుట లిఖించెనో యది యనుభవిం పకతప్పదు. కొంచెము పుణ్యమొనరించి యెక్కువ ఫలితము రావలయునన్న వచ్చునా! నీవీజన్మను సాహెబుగారిని వివాహమాడకతప్పదు. ముమ్మాటికిఁ దప్పదు. ఏదైన నవ్యక్తపుఁబని చేసితివా నీ ప్రాణంబులు నిముషములోఁ దీయించును. కఱకుతురకలకుఁ గరుణారసంబన్న మృగ్యంబు, బ్రాహ్మణబాలికామణులన్న వారు ప్రాణంబు లర్పించెదరు. కాన నీవు వారితో గలసిమెలసి యుండిన యెడల వారు నిన్ను గన్నులఁ గప్పుకొందురు. వారిరసికత్వమును మోహమును నీ వెఱుంగవు. నీకనేక రహస్యంబులు జెప్పవలసియున్నవి. సాహెబుగారూ? మీరు దయచేయుఁడు. నేను మీపని నిమ్మకాయ వాటముజేసెదను.

మహమ్మద్—మాధవీ! సెబాస్! నేను నీమీఁదనే యాధారపడియున్నాను, సరస్వతి బుద్ధి నిమిషములో మరలింపవలెను.

మాధవి—చిత్తము! మహాప్రభూ! మీ పని నిమ్మకాయవాటము జేసెదనంటినిగదా! మీదయ మాత్రము నామీఁద నుండవలయును.

---



# అభినవసరస్వతి

## తృతీయాంకము

### ప్రథమరంగము

[వామనరావు, భార్య కాంతిమతి, పద్మనాధరావు, పుల్లంబొట్లు, భారతి ప్రవేశము.]

పుల్లంభొట్లు—పంతులుగారూ! అమ్మాయి వివాహమై మీలో మీరు సంప్రీతించు కొన్నారా! తరువాతఁ బెద్దమనుష్యులతోఁ బొరపాటుమాట రాఁగూడదు! పెండ్లికుమారుని జూచివచ్చితిరిగదా! వారి భోగభాగ్యములు మీకునచ్చినవా? మీకందరకు నంగీకారమేనా?

వామన—మీరు మధ్యవర్తులుగా నుండి యేర్పాటుచేసిన నిబంధనలు తిరిగియొక్కసారి మావాళ్ళందఱి యెదుట నేకరువుబెట్టుఁడు. కర్ణరసాయనముగా వినెదము.

పుల్లం—చెప్పుటకేమున్నది? మీరుచెప్పలేదా! వినుండు.

సీ॥ పెండ్లికుమార్తెకుఁ ♦ బెంపుదీపింపంగఁ, బదివేలధనమును ♦ బంచియిచ్చుఁ
బెద్దమఱందిని ♦ జేర్చి చేదీవించి, విద్యాభివృద్ధికి ♦ వేయొసంగుఁ
జిన్నమఱందికిఁ ♦ జీనిచీనాంబరం, బులు సీలువలొసంగి ♦ యలరఁజేయు
మామగారు వసింప ♦ మహోన్నతంబైన, రమణీయ గృహమును ♦ వ్రాసియిచ్చు
నత్తగారికి దేహ♦మంతట బంగారు, నగలనుజేయించి ♦ తగనొసంగు

తే॥ వివిధవస్తు వాహనముల ♦ వేగనొసఁగు, వస్త్రమాల్యానులేపము♦ల్వరుసనిచ్చు
నివియు నవియంచువర్ణింప ♦ నేలనయ్యా, సర్వసౌభాగ్యమొసఁగును ♦ సరసవచన.

కాంతి—అయ్యో! మీరుముక్కు పచ్చలారని యీనవకోమలాంగి నావృద్ధవానరంబున కంటఁగట్టఁజూచెదరేల! పదిమంది సంతానంబుఁగాంచిన యీ పండుముసలికి డెబ్బదియవపడిలో వివాహేచ్ఛయేల! వివేకహీనుఁడై కక్కుర్తిపడియెఁబో, మీ

వంటి పెద్దలువలదని చెప్పవలెనుగాని యతనియొద్ద ధనమునకాశించి యితరుల పిల్లల గొంతుఁగోయుటకుఁ బ్రియత్నించెదరా?

చ॥ ముదుసలి కంటిదృష్టి నహి • మూర్ధశిఖామణి రోగపూరితుం
డదయుఁడు సర్వలక్షణ సమన్వితయౌ సుమకోమలాంగినేఁ
బదిలముగాఁగ లేజిగురుఁ • బోన్పన పెంచిన చిట్టి తల్లి నేఁ
డిది తగునంచు నిచ్చి బ్రతుకింతయు దుఃఖము పాలుజేతునే.

పుల్లం—ఏమమ్మా! వివాహపుసంప్రతింపులలో విచారమెందులకు! మీ యిష్టమున్న నంగీకరింపుము. లేకున్న నన్ను బంపి వేయుము. పంతులుగారు ప్రార్థించి నా కాళ్ల వేళ్లఁబడుటచే నేనీ సంబంధముఁ గుదిర్చితినిగాని వేఱుగాదు! నే నాడు పిల్లలకై దేవురింపరాలేదు. మీ కిష్టముగాని యెడల మీ తలఁదన్నిన వారింకొక రంగీకరింతురు. ఆడుపిల్లలకుఁ గఱవురాలేదు.

చ॥ ధనమును ధాన్యమున్సిరులుఁ • దక్క సుఖంబులు గోరకున్నచో
జనములనింద హేళనము • శాశ్వతకాలము గోరియున్న జీ
వనమును లేమితోఁగడపి • వందురి కాలము బుచ్చఁగోరుచోఁ
దనయ నొసంగఁబొల్పడకు • తప్పుసహింపుము పోయివచ్చెదన్.

[అని లేచిపోఁబోవ వామనుఁడు పట్టుకొని కూర్చుండఁబెట్టును.]

వామ—అయ్యా! ఆగ్రహింపకుఁడు! నామనవిఁ జిత్తగింపుఁడు.

చ॥ వనితలు భూరి భూషణ వి • భాసితకోమల దేహయుక్తలై
యనయము నింపుసొంపు మద • మాత్మకుఁ గూర్పఁగఁ గంటిఁగాని తోఁ
చిన సరణి న్వివేకమును • సిగ్గును లగ్గును మాని కూళలై
తన నిజనాథుమ్రోల నిటు • దర్పముతోఁ బలుకంగఁ గంటిమే.

మానాభిమానంబులు విడిచి, సిగ్గు బిడియము లేక తగుదునమ్మా యని లేని పోని పెద్దరికంబుఁ దెచ్చిపెట్టుకొని మగవారి యాలోచనలను భగ్నంబుఁ జేయుటకుఁ బానకములోఁ బుల్లవలె సిద్ధము. పగిలిపోయిన చిల్లిగవ్వయైనను సంపాదింపఁగల ప్రయోజకత్వంబు సున్న! "స్త్రీబుద్ధిః ప్రళయంకరీ" యనుట కిదియే నిదర్శనంబుగాబోలు! కాని మీరు మాయాడుదాని మాటలు విని భయఁపడ నక్కఱలేదు! దానికి మాత్రము సొమ్మనిన జేదను కొన్నారాయేమి! పెండ్లినాఁడు గట్టినపుస్తెబొందుతప్ప వేఱుగ లెఱుంగని వెర్రిపెద్దమ్మ కీనాఁటి కైశ్వర్యం బయాచితంబుగా వచ్చుచుండఁగా సిరిరా మోకాలొడ్డి భంగపడునా! కల్ల కల్ల.

కాంతి—నాథా! మీయాలోచనలు విన నాదేహంబు మండుకొని పోవుచున్నది. మీరు నా ప్రాణనాథులనియు, మీయాజ్ఞ జవదాటరాదనియు నెఱుంగుదు!

గాని మన భారతి వివాహము విషయమై తమకెంత బాధ్యతయున్నదో మీ యర్ధాంగినైన నాకును నంత బాధ్యతయున్నదని యెఱుంగుడు.

సీ॥ పది పదారేడులు ♦ పైఁబడలేదింక, పలుకోడ నెఱుఁగని ♦ పద్మనయన
యాటపాటలయందు ♦ నలరుచునుండును, జదువుసంధ్యలయందు ♦ చతురరాలు
కుసుమకోమలదేహ ♦ కుటిలకుంతలజాల, శుకకోకిలాలాప ♦ సుందరాంగి
సకలసద్గుణవల్లి ♦ యకలంకనయశీల, లలిత కళాభ్యాస ♦ లక్ష్మిదేవి
తే॥ గీ॥ యిట్టిభారతిగొనిపోయి ♦ దిట్టనగుచు, మూలమగ్గిన ముదుసలి ♦ ముష్కరుండు
కలుష నిలయుండు వృద్ధుండు♦కర్మఠుండు,నైన వానికి నెటులిత్తు ♦నకట కట.

సీ॥ నిరతిశయానంద ♦ నిర్మలప్రేమచే, ముద్దాసఁగునటన్న ♦ ముసలికంపు
కమ్మచక్కెరమోవి♦కాంక్షించుచునన్నచో, చొల్లుచొంగయుఁగారుఁ♦జోద్యముగను
ఏకశయ్యనుజేరి ♦ యేకాంతమాడినఁ, జెవులకువినరాదు ♦ చెవిటిగోడ
మదన తంత్రక్రియా ♦ మర్యాదలెంచినఁ, జిలికియెండినమ్రోడు ♦ చేవలేదు
తే॥ లలితశృంగారగోష్టికి ♦ రవ్వకెక్కు, నూత్నవస్తు విభూషల ♦ నోచ్చుకొనుచుఁ
జిరుప్రబుస్సంచు నహిబోలె ♦ చీదరించు, ముసలిమగనితో నివసింప♦ముప్పుగాదె.

వామన — ప్రాణనాయకీ! లేనిపోని కష్టంబులను గుణించుకొని బాధ పడెదవేగాని నిక్కమరయ లేకున్నావు.

సీ॥ పదిపదారేడుల ♦ వయసుప్రాయమువాని, పెండ్లాడు జవ్వని ♦ విధవగాదె!
నవనవోన్మేషులౌ ♦ యువకులమోహించి, పెండ్లాడు జవ్వని ♦ విధవ లవరె
ఈడుజోడుగఁజూచి ♦ యింపుసొంపునుజూచి, పెండ్లాడు జవ్వని ♦ విధవగాదె
వయసుదీరినవాని ♦ వార్ధక్యడౌవాని, పెండ్లాడు జవ్వని ♦ విధవ లవరె
తే॥ దైవలిఖితంపువ్రాతను ♦ దప్పనగునె, పూర్వభవకర్మ వశమున ♦ పుణ్యపాప
ఫలితములుగల్గు ననియెడి ♦ పలుకువినవె, వెతలు జెందంగ నేటికే ♦ జెలదిమిన్న.

సీ॥ ఇరువదియేండ్లవాఁ ♦ డిందిరనాథుండు, స్వర్గలోకముజెందె ♦ సత్వరముగ.
నుక్కుతునక నుబోలు ♦ నూర్మిళాకాంతుండు, ప్రాణంబులనువీడె ♦ జ్వరము చేత
నవయౌవనపువాఁడు ♦ నరసమ్మభర్త యే, రోగంబులేక స్వర్లోక మరిగెఁ
దలిరుఁబ్రాయమువాఁడు♦దమయంతిప్రాణేశుఁ, డిట్టెమాయముజెందె♦నింతలోనఁ
తే॥ జీకుఁజింతయు నెఱుఁగక ♦ చెలఁగుచుండ, నష్టపడిపోవఁడే మొన్న ♦ క్రిష్టిమగఁడు
ముసలి వరడులునైనను ♦ ముదముతోడ, సౌఖ్యవారాశిఁదేలరే ♦ చంద్రవదన.

పద్మ — జనకా! నూటికిఁగోటికెవరో కర్మముమూడినవారు యవ్వనవంతులు చనిపోయిరని తలంచి, ప్రపంచములో నందఱుఁ దమకుమారీ రత్నములను మూలనున్న ముదుసళ్ళ కొసంగి వివాహముఁ జేయుచున్నారా? వివాహములో బాలికామణి మదిమెచ్చినట్టి సర్వసుగుణాలంకారుని, విద్యావినయ సంపన్నుని నవయౌవన మోహనాంగుని నన్వేషించి వివాహమొనరింపపల

యీనుగాని మన స్వలాభం బపేక్షించి, యితరుల సొమ్మున కాశించి ముక్కు-
పచ్చలారని పిల్లను బండుకోతికిచ్చి వివాహం బొసరించి పిల్ల గొంతుఁగోయుట
ధర్మమగునా.

సీ॥ కన్నకూతురు నమ్మ♦కముఁజేసి సంతను, ధనముసంపాదింప♦ధర్మమగునె
కుసుమకోమలదేహఁ ♦ గుంటి గ్రుడ్డికిఁగట్టి, మడులుమాన్యంబులుం♦బడయనగునె
ముదితనుగనికని ♦ మోటమొరకునిగూర్చి, యిండ్లు వాకిండ్లు ల♦భింపనగునె
శుకకోకిలాలాప ♦ శుంఠువరునకిచ్చి, భోగభాగ్యంబుల ♦ బొందనగునె
తే॥ సొమ్ము రానిమ్ము పోనిమ్ము సుందరాంగి, ముసలిమగనికిఁగట్టకు ♦ ముప్పువచ్చు
పాపఫలితంబుదప్పదు ♦ పట్టువిడువు, మిట్టిఘోరంబులనుజేయ ♦ హేయమయ్య.

వామ— గ్రుడ్డువచ్చి పిల్లను వెక్కిరించినదన్నట్లు ముక్కుపచ్చలారని పిల్ల వెధవవు
నీవువచ్చి మమ్ము దిద్దనక్కరలేదు.

సీ॥ ప్రొద్దుప్రొద్దున లేచి ♦ హద్దుపద్దులేక, కాఫిహోటలుఁజేరి ♦ కాఫిగ్రోల
నాంగ్లజాతియువోలె ♦ హాటుబూట్సునుదాల్చి, సూట్లతో రోడ్లెల్ల♦చుట్టితిరుగ
క్షణమున కొకకొన్ని ♦ సానివేషంబులు, వేఁదాల్చి విటకత్తె♦ వెంటఁదిరుగ,
నాటకొల్సినిమాలు ♦ మేటిసర్కసులెల్లఁ, బగలు రాత్రులయందు♦బరఁగఁజూడఁ
తే॥ బ్యాటుమెంటును క్రికెట్టు♦ప్రైజుఁబొంద, సానిమేళంబులను మెచ్చి♦సరసమాడ
సాధ్యమెట్లగునెట్టులో♦జాలనధముఁ,గూర్చి నీకివ్వకుండినఁ♦గూర్మిపుత్రి.

సీ॥ చదువు సంధ్యలటంచు ♦ చదివింపనెంతుమా, ధనముండినను గాని ♦ తరముగాదు
బియ్యేలు యెల్టీలు ♦ బిరుదుఁగాంచెదమన్న, సొమ్ములేకున్న ల♦భ్యమ్ముగాదు
లా పరీక్షకుబోయి ♦ లాయరయ్యెదమన్న, రొక్కఁబులేకున్న ♦ రొష్టుగల్గు
డాక్టరుపదవిని ♦ డాబుఁజూపెదమన్న, విత్తముండనివాఁడు♦విభవమిల్లె
తే॥ ఇంజనియరుపదవికి ♦ నిష్టపడిన, సొత్తులేకున్న ఫలితంబు ♦ రిత్తసుమ్ము
ద్రవిణమూలంబు జగమంచుఁ♦ దలతురార్య, లట్టిధనము నుసమకూర్ప♦నగునుగాదె.

సీ॥ ధనములేకున్నచోఁ♦దనవారు పెరవారు,చుట్టపక్కంబులు ♦ చూడరారు
విత్తమేలేకున్న ♦ విభవంబు సౌఖ్యంబు, నానందమేలేద ♦ యరసిచూడ
రొక్కముండినవాఁడు ♦ డొక్కశుద్ధియులేక,,మహనీయకీర్తిచే ♦ మాన్యుడగును
వర్థముండినయతఁ ♦ డాడినదాటౌను, పాడినదంతయు ♦ పాటయగును
తే॥ కాసువీసంబులేకున్న ♦ కష్టజీవి, యన్నవస్త్రంబులకురోసి ♦ యష్టకష్ట
ములను వారాశియందును ♦ మునకవేయు, ధనముసమకూర్ప నష్టంబు♦వలదువలదు.

నీ చదువుసంధ్యలకు, నీ నీటుగోటులకు, నీ సూటుహాటులకు, నీ కాలర్లు నెక్టయిలకు, నీ బాటుబూటులకు, నీ తలనూనెలకు నీ ముఖాలంకారభస్మంబులకు, నీ సిగరెట్లకు బీడీలకు, నీ చీట్లాటకుఁ జతురంగఁఫుటాటలకు, బాడ్మింటను టెన్నిసు టూర్నమెంటులకు, నీ సైకిళ్ళకు, జట్కాలకు, సొమ్మును

దగులవేయుటకు మా యింట్లో నేమైనను నవనిధులున్నవా, లేక పెరటిదొడ్లో రూపాయలచెట్లు, నవరసులతీగెలు పెరుగుచున్నవా? "ధనమూలమిదంజగ" త్తని పెద్దలు పిచ్చివారై పలుకలేదు! విద్యావిహీన ద్విపాదపశువు. ప్రపంచంబున బ్రతుకఁగలఁడుగాని, యర్థవిహీనుఁ డొక్క క్షణమైనను మనఁజాలఁడు! ఈ సోది యెందులకు! నేను గుటుంబయజమానిని యెఱుంగకున్నావు కాబోలు! నాలు గింగ్లీషుముక్కలచే డొక్కశుద్ధి కాఁగానే, గర్వాంధకారంబు గన్నుల కెగఁదట్టిన ట్లున్నది! ఈ మాత్రమునకే యాకసంబునఁ రెక్క లెవరు బొడిపించిరని గ్రిందుమిందు లరయక గర్వించి ధర్మపన్నంబులు నీవు చదివిన నాల్గుముక్కలు వెళ్ళగ్రక్క నక్కఱలేదు! నీవీ యింట్లోనుండి నాల్గు మెతుకులు దిన సంకల్పించినచో నేను చేసినట్లు జూచుచుండుము! లేకున్నచో నీ క్షణమే యింటనుండి వెడలిపొమ్ము' భూమికి జానెడులేని వెధవలందఱు నాకు నీతిబోధింప నక్కఱలేదు! చెప్పుటకేమి శ్రీరంగనీతు లెన్నియైనన్ను చెప్పవచ్చును. ఒక్క యెండు తమలపాకు తొడిమమైనను సంపాదింపలేని వెధవలందఱు ధర్మపన్నంబులు జరిపెడివారే! మీ కందఱకు నిట్టి తెలివితేట లున్నవి కాఁబట్టియే క్రిందఁబెట్టినఁ బంటలును పైనఁబెట్టిన వానలును లేకుండఁబోయినవి. వేసినట్లే వేసిన వెర్రివాఁడే గెల్చినాఁడట! పోనీ చిన్నవాఁడవు కదాయని నీ వాడినదాట పాడినదిపాటగా జూచుచుండ, నానాఁటికిఁ దొండముదిరి యూసరవిల్లి యైనట్లు నీవు ధర్మోపన్యాసములు జెప్పుటయు, మా వంటి పెద్దవా రందఱును నీకుఁ జేతులు జోడించి నీ యాజ్ఞలో నుండవలసిన కాలము వచ్చుచున్నది. నాలు గింగ్లీషు ముక్కలు చదివినంతనే నా యంతవాఁడు లేఁడని గర్వించుచుంటివేమో? ఇల్లలికినంతనే పండువగునా? ముందున్నది ముసళ్ళపండుగ. నేను మీ వలె నింగ్లీషుముక్కలు జదువకపోయినను మిమ్ము దలఁదన్నినవారితో స్నేహము చేసినవాఁడనే! ఈ యాస్తియంతియు నా స్వార్జితము. నీవు నా యొద్దికలో నుండి నా యాజ్ఞప్రజ్ఞలలో నుండినయెడల నా యాస్తి నీ కిచ్చెదను. లేకున్నచో "నుపనయనము నాఁటి మాటయున్నది సుమతీ"యని రాగిపాత్ర శుభ్రముగాఁ దోముకొని వీధులవెంట "సీతారామ పరబ్రహ్మణే·మః"యని బయలుదేరవలసినదే! కాఁబట్టి నీ యుపన్యాసంబులు గట్టిపెట్టు? ఇష్టముండెనా కుక్కినపేనువలె యణఁగి మణఁగి యుండుము? లేదా ఉత్తరక్షణమందే యిల్లువిడచి వెడలిపొమ్ము!

పద్మ—నే నేమి కానిమాట లనలేదే? పరుల కపకార మొనరింపమనలేదే! అక్రమముగా ధనమార్జించి పాప మొడిగట్టుకొనవద్దని చెప్పుటయే పాపమయ్యెనా? కొండమీఁదికోతి కావలయునన లేదే! ఆకాశంబున సంచరించు సంపూర్ణపూర్ణిమా శశాంకబింబమును దెమ్మని దేవురింపలేదే; ఏటికీకోపము! తడిగుడ్డ

లతో నాడుబిడ్డల గొంతుఁగోయ తలంచుటయే పాపమయ్యెనా? ఏమి దైవ ఘటన సోదరీమణీ?

సీ॥ తన్వీశిరోమణి ♦ తల్లిదండ్రులు నీకు, శత్రుసంఘము వారు ♦ చపలమతులు
వనితామతల్లిరో ♦ భ్రాతృవర్యుండు నీ,కుండి లేకున్న యట్లున్న వాఁడు
జలజాక్షి రత్నంబ ♦ సఖులు చుట్టాలును, నీ ప్రాపు జేరరు ♦ నిర్దయులయి
శుకకోకిలాలాప ♦ చుట్టముల్పక్కసు ♦ లొత్తుప్వలెంతురుగాని ♦ ముప్పుగడుప
తే॥ రకట! తండ్రియే దయమాలి ♦ యర్ధమాస, గొనుచు ముదుసలిగుడ్డికిఁ ♦ గూతునీయ
సతికి గతియేది దిక్కేది ♦ జగతియందు, నకట భారతజాతి కీ ♦ యధమగతియె.

మీయిష్టము వచ్చినట్లాచరింపుడు. నేనిచ్చట యుండి నాసోదరి దుఃఖంబు జూడజాల, [అని వెడలిపోవును.]

భారతి—జనకా!

ఉ॥ పుట్టినదాదిదా మిగులఁ ♦ బోడిమిఁ బెంచితి పెద్దజేసి నీ
విట్టులు క్రూరభావమున ♦ నిష్టముఁ బ్రేమయు లేనిచోట నన్
గట్టడిపై కసాయికి మృ ♦ గంబులఁ బోలెను నమ్మజూచితే
నెట్టుల వృద్ధవానరము ♦ నేఁబతిఁ గాఁ గ్రహియింతుఁ జెప్పవే.

చ॥ నగలును నాణెముల్వలదు ♦ నాకిఁక నెప్పటిమేటికోర్కలున్
జగమున మేలివస్తువులఁ ♦ జాలఁగఁగోర మఱెట్టివానినిన్
నగుమొగ మొప్పు జవ్వనము ♦ నన్ విలసిల్లెడు సుందరాంగునిన్
దగనొనగూర్చి నాముదము ♦ దధ్యము దీర్పగదయ్య నాయనా.

ఉ॥ ఎవ్వరు చెప్పుచున్న వినఁ ♦ బెట్టి విధంబున బ్రహ్మవ్రాసెనో
యివ్విపరీతమైన విభు ♦ నింపుదలిర్పఁగఁ ద్రోసిపుచ్చుఁ గా
కవ్వలఁ గీర్తిహానియును ♦ నన్వయహానియుఁ గల్గుఁగాక నా
కెవ్విధి పెండ్లియే వలవ ♦ దే నిదె దాల్చెద బ్రహ్మచర్యమున్.

చ॥ తెలివియుఁ దేటయుం గలిగి ♦ తిన్నని విద్యయు సద్గుణంబులున్
సలలిత రూపరేఖలును ♦ జక్కని సాహితి నొప్పు చానకున్
ఖలుడును దుష్టశీలుడును ♦ కాలము దాటిన వృద్ధవానరున్
జలమునఁ గట్టఁ జూచెదవు ♦ శాస్త్రములొప్పునె మెత్తురే జనుల్.

సీ॥ జనకమహారాజు ♦ జానకీదేవిని, శ్రీరామునకుఁగూర్చి ♦ చెలఁగినట్లు
తగభీమసేనుఁడు ♦ దమయంతి నలమహా, ధవునకు నర్పించి ♦ తనరినట్లు
ద్రుపద ధరిత్రీశ్వ ♦ రుండును ద్రౌపది, నర్జునునకు నిచ్చి ♦ యలరినట్లు
మునుద్యుమత్సేనుండు ♦ దనయ సావిత్రిని, సత్యవంతునకిచ్చి ♦ సాకినట్లు
తే॥ నామనోనాధు నానాధు ♦ నాహృదీశు, విక్రమునకిచ్చి పెండిలి ♦ వేగసేయు
మటులకాదేని దేహంబు ♦ నన్నునంట, దనుచుమదినమ్ము నిజమయ్య ♦ యార్యవర్య.

షామ—అమ్మా! ఎంత తెలియని బేలవు. మనభాగ్యభోగ్యంబులు మన హస్తములం దున్నవా? ఆపరమేశ్వరుని హస్తంబుల నున్నవా? మన మా సర్వేశ్వరుని హస్తంబులయం దాట బొమ్మలమని యెఱుంగుము.

సీ॥ కోటిక పడగెత్తి ♦ కోమలిఁ బెండ్లాడి, గర్భదరిద్రుఁడౌ ♦ ఖలుఁ డొకండు
పూటగంజికిలేక ♦ పుచ్చుఁబోఁడిఁ బెండ్లాడి, కోటికిఁ బడగెత్తు ♦ మేటి యొకఁడు
నవమోహనాంగియౌఁ ♦ నాతిని బెండ్లాడి, స్వర్గలోకము జెందు ♦ సరసుఁ డొకడు
ముదుసలి యొక్కరుండు ♦ ముదితను బెండ్లాడి, సంతానవంతుడై ♦ సౌఖ్యఁ బడును
తే॥ ఎవరి కేవిధి వ్రాసెనో ♦ యెవ్వఁ డెఱుఁగు, గాకమానను కానున్న ♦ కార్యమెల్ల
దలను వ్రాసిన వ్రాతలు ♦ తప్పగలవె, దేవు నాజ్ఞలు నిరసింప ♦ దిక్కుఁ గలదె॥

భారతి—జనకా! యెదురాడుచున్నందులకు మన్నింపుఁడు, దైవాజ్ఞ యవిలంఘనీయం బని పురుషప్రయత్నం బెవ్వడైనను మానవుడు మానునా?

సీ॥ పొద్దు పొద్దున లేచి ♦ పొయ్యి రాజఁగ జేసి, యన్న పానంబుల ♦ నమరఁ జేయు
భార్య బిడ్డలయందు ♦ బహు ప్రేమఁ జూపుచు, ధనధాన్య సంపద ♦ లుండి గూర్చు
దమ్మిడీయైనను ♦ ధర్మంబుఁ జేయుచోఁ, దనముల్లెఁ జని నట్లు ♦ తల్లడిల్లు
లోకాధి నాథుండు ♦ లోకముల్పాలించు, నను మాట మఱచితా ♦ నతిశయిల్లు
తే॥ లోకమంతయుఁ దనదంచు ♦ లోనఁ దలఁచుఁ, బురుషయత్న మెఫలమంచు ♦ బోరుచుండు
నట్టి యెడలను మాయెడ ♦ నదయుఁ డగుచు, నిట్టి విపరీతజ్ఞానంబు ♦ పుట్టనేల.

మా యదృష్టమెట్లున్నదో మే మెఱుంగము, మీ రెఱుంగరు. అట్టి యెడ మమ్ముఁ జేతులారఁ దీసుకొని పోయి ముదుసలి గ్రుడ్డి కిచ్చి వివాహ మొనరించుట కన్నను మా మెడ నొక కొండరాతిని గట్టి నడి సముద్రంబునఁ బడఁ ద్రోయరాదా? లేకున్నఁ బంచ భక్ష్యపరమాన్నముల నొసంగి పోషించిన నీ దేహంబు నొక నిశితకరవాలంబునఁ గడి కండలు గా ఖండించి యంతరిక్షంబున మెలంగు పక్షిజాతుల కాహారంబుగా నొసఁగఁగూడదా.

సీ॥ గాఢాంధకారమౌ ♦ కాననంబునడించి, సింగంబునకు నిమ్ము ♦ సిగ్గుపడను
దావానలంబున ♦ దగ్ధమైచనునట్లు, లొనరింపు మద్దినే ♦ నోర్వఁగలను
ఘోరకాలాహిదే ♦ గురుతరంబగు విష, మొసఁగుము గ్రోలెద ♦ నోర్పుచేత
హిమవన్నగమునుండి ♦ యిలఁగూలునట్లుగాఁ, బడఁద్రోయఁ బంపుము ♦ భయము జెందఁ
నడిసంద్రమందున ♦ నట్టిల్లుఁ గట్టించి, యందునుండఁగఁ బంపు ♦ నడలనేను
తే॥ కానియౌవన లక్ష్మిని ♦ గానివాని, పాలుజేయంగ నోపనేఁ ♦ జాలమేల
నన్ను ముదుసలి కివ్వంగ ♦ నెన్ననేల, చంపివేయంగ రాదొకో ♦ సదయహృదయ

[అని వెడలి పోవును.]

పుల్లం—అయ్యా! నాకుఁ బ్రొద్దుఁబోవుచున్నది. మీ కుటుంబకలహముఁ జూడ నాకు భయమగుచున్నది. నీ వేమో దేవురింపఁబట్టి నాలుగు సంచులు నీయొడిలోఁ బడు

నని యాలోచించితిని. కాని నీ నిర్భాగ్యపువ్రాత యీ జన్మంబునఁ దొలఁగు నట్లు లేదు. మీ రాద్ధాంతములన్నియు ముగిసిన తరువాత నేమన మాలోచించు కొన వచ్చును. ఇప్పుడేమి వ్యవహారము పాసిపోవదు లెమ్ము.

## ద్వితీయ రంగము.

[సరస్వతీదేవి, మాధవి పురుషవేషంబులతో ప్రవేశము.]

మాధవి—సరస్వతీ! నీవు కష్ట సముద్రంబు నీది దరిచేరితివి! ఆ ముష్కరతురుష్కుని బారినుండి తప్పించుకొంటివి.

చ॥ గడచితి దుఃఖసాగరముఁ ♦ గాంచితి స్వేచ్ఛయు సంతసంబునన్
విడువు భయంబు భ్రాంతియును ♦ వేగమె సౌఖ్యము గాంతుగాకన
న్విడతిని నీకు నెచ్చెలిని ♦ భావమునందు స్మరింపుమమ్మ నా
కిడెదు బహూకృతుల్కరుణ ♦ నీవిడి పంపుమి పోయివచ్చెదన్.

సర—నెచ్చెలీ! నీమేలు వేయి జన్మంబులకైనను మఱవఁజాలను. ఆ తురుష్కమందిరంబునఁ బడి మ్రగ్గకుండ మాఱువేషంబుల సేవకుల కనుబ్రాంతి, నాకతిన నిర్బంధమును దప్పించి స్వేచ్ఛయొసంగినందులకు నేనీ జన్మంబున నీ యొనర్చిన మేలు మఱవఁగలనా? కాని యిప్పుడే వెడలిపోయెద నని తొందరపడెద వేమి! నాతలిదండ్రుల గ్రామము వచ్చినచోఁ జందుఁన కొక నూలుపోగనునట్లు నాకుఁ దోచినసన్మానం బొసంగిపంపెదను నే నెంత యడిగినను నీ నిజమైన పేరును వంశంబును జెప్పకైతివి గదా? నన్నెట్లు గుర్తించితివి. నా పాలిఁటి భాగ్యదేవతవలె నన్ను రక్షింప నీ వెట్లు వచ్చితివి! నా చెఱ సంగతి నీ కెట్లు తెలిసెను. ఇది యంతయు నాశ్చర్యంబుగా నున్నది.

మాధవి—తెలుపుటకేమున్నది? యింద్రజాలమా! మహేంద్రజాలమా! కర్ణాకర్ణిగా నొక మహమ్మదీయుఁడు హిందూబాలికారత్నంబును జెఱఁగొనియెనని యెఱిఁగి, యా మెను రక్షింప సంకల్పించి, యాతని కొలువుఁజేరి, నీ కాతనిపై మఱులుఁ గొల్పెదనని నమ్మఁబల్కి, నీకడ బ్రవేశించి నిన్ను రక్షించితి! అంతయుఁ బరమేశ్వరానుగ్రహము!

సరస్వతి—నెచ్చలీ! నిన్ను జూచినప్పటినుండియు నీపైఁ బ్రేమ జనించినది! నానాఁటి కది శుక్లపక్ష చంద్రునివలె నభివృద్ధిఁజెందుచున్నది. సఖీ! నీ మనస్సున నేమనుకొందువో గాని నాయ్యదయంబున నొక వింత తలంపు గలుగుచున్నది.

మాధవి—అదేమో చెప్పుము! హృదయానందకరముగా వినెదను.

సర—ప్రాణసఖీ! చెప్పుటకు సిగ్గగుచున్నది. నన్ను వెక్కిరించిన వెక్కిరించెదవు గాక! పురుషులెవరును లేరుగానఁ జెప్పుచున్నాను. నీవు నిజముగాఁ బురుషుండవైనచో నీతో దాంపత్య సుఖ మనుభవింపవలయు నని యున్నది.

మాధవి—(నవ్వుచు) అందుల కభ్యంతరమేమి? అట్లే గావింపవచ్చును? కాని యీ తలతిక్క పరమేశ్వరుఁడు నన్ను మొగవాడినిగా సృజింపక యాఁడు జన్మ మెత్తించె! సఖీ! నీ కేమి మతిపోవుచున్నదా? లేక స్త్రీలు స్త్రీలనే పెండ్లాడి సుఖింపవలయునని క్రొత్తసిద్ధాంతము లేమైనను సృష్టింప నెంచితివా? చదువుకొన్న దానవు! సిరిసంపదలు కలదానవు! నేను అదృష్టవశంబున మగవాఁడనైన నేమి? నావంటి మూర్ఖుని నీవు వివాహ మాడెదవా? ఐన నీ పిచ్చి ప్రసంగ మేటికి! నేను నా పుట్టింటికి వెళ్ళవలసియున్నది. వెంటనే సెలవిచ్చి పంపుము.

సరస్వతి—నాయొద్దఁ జెలికత్తె నని పేరుబెట్టుకొని వచ్చినపుడు లేని త్వరితము, మనము తప్పించుకొని వచ్చినంతనే కల్గిన దేమి! కాశినుండి యూరిబైటవఱకు వచ్చి, యాలుబిడ్డలను జూచుటకుఁ బరుగెత్తుకొని వెళ్లినట్లున్నది నీ యాత్రము. నీ కట్టి యాలుపిల్లలు గూడా లేరుగదా! నీవు చేసిన యుపకారంబు నాతండ్రి గారితోఁ జెప్పి నీ కర్హసత్కారంబుఁ గావించెద. మా గ్రామము రమ్ము.

మాధవి—సఖీ! దేశద్రిమ్మరినై తిరుగు నాకు నీ బహుమతులేల! నీ కిష్టమున్న నీ ముద్రిక నిమ్ము. దానిని మనస్నేహ చిహ్నముగాఁ జూచుకొనుచుండెద! నీ వివాహంబు సందర్భంబున నాకుఁ దెలుపుము. నేను వచ్చి యాశీర్వదించెద.

సరస్వతి—(అంగుళీయకం బొసంగుచు) ఈ యంగుళీయకం బద్వితీయంబు! ఇట్టిది వేఱొకటి గానరాదు. భద్రపఱుపుము. నా వివాహంబు సంగతి యయోమయముగా నున్నది. నా హృదయేశ్వరుఁడు మాధవుఁడు ముష్కరతురుష్కుని చే ఘాతఁజేయఁబడియె! అతఁ డీ లోకంబున సురక్షితుఁడై యున్నచో నతనినే వరించెదను! లేకున్న నాజన్మాంతము బ్రహ్మచర్యం బవలంబింపవలసినదే.

మాధవి—నెచ్చెలీ! నీకుఁ బిచ్చి యభిప్రాయంబులు చాలఁగలవు! అతఁడేమైనను నవయౌవన రూపలావణ్యాధికుఁడా? లేక జయంత వసంత మన్మథ నలకూబరులవలె దివ్యతేజో రూపసంపన్నుఁడా! ఏనాఁడో నిన్నుఁ బ్రేమించి, నీ చేఁ దృణీకరింపఁ బడిన యతనినే నీవు తిరిగి వివాహమాడవలయునను విపరీతాభిప్రాయ మేమిటికి!

చ॥ కనులకు నింపుసొంపెసఁగు ♦ కంతు సమానుని జూడఁగల్గినన్
బ్రణయము మీఱ నాతని క♦రగ్రహణం బొనరించి వానితో
ఘనముగ సర్వసౌఖ్యములు ♦ గాంచఁగఁ గోరెదు కాంత ధన్య కా
దని తలఁతేని దుఃఖములు ♦ దప్పవు నమ్ముమి యంబుజానసా.

సీ॥ చిఱుతప్రాయము నాఁడు ♦ సింగారములు దాల్చి, వలపించియుందువు♦ వన్నెకానిఁ
జదువుసంధ్యలు జూపి ♦ సన్నుతి వేఁగాంచి, ప్రేమపాత్రమవైతి ♦ ప్రియముతోడ
సుగుణగణంబుల ♦ శోభను దిలకించి, వరియించి యుండును ♦ బాలకుండు
తల్లిదండ్రుల సొమ్ము♦ ధనము సంపదఁగాంచి, నినుబెండ్లి యాడంగ♦నిలచెనేమొ

తే॥ కాని ధనమును ధాన్యము ♦ గదలిపోవఁ, గాంచి మదినెంచి గుణమెంచి ♦ కష్టమెంచి
తురక కులమున నివసించి ♦ దుఃఖపడిన, కాంతనెవ్వరు గైకొంద్రు ♦ కరుణతోడ.

సరస్వతి—చెలియా! ఆమహానుభావుఁడు సర్వసామాన్యుఁడనుకొంటివా? అతని సుగుణగణంబు నీ వెఱుంగక యట్లనియుందువు! ఆకర్ణింపుము.

చ॥ అతని వచోవిలాసములు ♦ నాతని దీప్రతిభాప్రభావముల్
అతని సురూపసంపదలు ♦ నాతని సద్గుణజాలవల్లరుల్
అతని తనూప్రకాశమును ♦ నాదరణంబునఁ గాంచి విన్నచో
నతనుసమానుఁడంచు నెద ♦ యందుఁ దలంపరె మానినీమణుల్.

సీ॥ మధురమై మృదులమౌ ♦ మాటలు వినినచో, శుకకోకిల రవంబు ♦ వికటమగును
మిసిమించు మైచాయ ♦ వెసఁగాంచుచున్నచోఁ, బసిమిబంగరు మీఁది ♦ భ్రాంతివదలు
సుగుణగణంబులు ♦ శుద్ధచారిత్రంబు, సరిబోల్ప శ్రీరాము ♦ సాటి వచ్చు
నాకారవిభవ మా ♦ లోకింప నతను వి, లాసంబు పాత్రమౌ ♦ హాసమునకు
తే॥ తొల్లిఁటి భవంబులం దెట్టి ♦ దోసములను, జేసియుంటినో వెతజెంది ♦ చేతనున్న
ముల్లె పోఁగొట్టుకొంటిని ♦ ముష్కరుండు, పట్టి బాధించె నా ధన ♦ మెటు వచ్చు
నామనోనాథు నెటుగాంతు ♦ నాదు చెలియ!

ఉ. ఎన్నఁడు నామనోరమణు ♦ నేర్పడఁగాంతు ముదంబుతోడ నే
నెన్నఁడు సౌఖ్యవారినిధి ♦ నింపుదలిర్పఁగ మున్గుదాన నిం
కెన్నఁడు ప్రాణనాథుఁడు, మ ♦ దీప్సితముల్ సమకూర్చి మెచ్చన
న్నెన్నఁడు నంకమందు గది ♦ యించెడు నెచ్చెలి పల్కవే కృపన్.

మాధవి—సఖీ! ఏమి నీ యారాటము! నీ మోహము గపటమో నిక్కమో యెవ్వరెఱుంగుదురు! ఇంత విరహపరవశురాల వైనదానవు అతనితో విద్యాభ్యాసం బొనరించునప్పుడే వివాహ మాడకపోతివా? సిరిరా మోకాలడ్డువారుందురే! అపుడు వెదకఁబోయినతీవె కాలఁదన్ని త్రొక్కి మట్టగింపనేల! ఇపుడా భగ్నమైన తీఁగెకై నలుదిక్కులఁ బలవించుచుఁ గ్రుస్మరనేల? ఇట్లు వియోగ సాగరంబున మునుఁగనేల! కాని నీవు నిజముగా వివాహమాడఁ దలంచినచో నతఁడే యననేల? గంతకుఁదగిన బొంత దొరుకకుండునా? ఈ ప్రపంచంబున మగవారికి గొడ్డుపోవలేదు! కాన నీ మనసువచ్చినవారి నింకెవరినైనను వివాహమాడి సుఖ మనుభవింపుము! ఆడుదానిచేఁ దృణీకరింపఁబడితినని ప్రాణత్యాగ మొనరించెనేమో? లేకున్న దేశత్యాగియై పోయెనేమో? లేకున్న నందనిమ్రానికై యఱ్ఱులు సాచిసాచి లభ్యపడనందున విరాగి యయ్యెనేమో! అటుగాకున్న మాఱువేషంబునఁ బ్రచ్ఛన్నంబుగాఁ దిరుగుచుండెనేమో!

సర—అతఁ డే లోకంబుననున్న నాకు నదేలోకంబు గతియ? ప్రపంచంబున నాత నికై వెదక వెన్నాడి యాతఁడు నా కంటఁబడియెనా క్షమాపణ వేడి యత నిని వివాహంబుఁ జేసుకొనియెదను.

మాధవి—చెలీ! నీవంటి బేలవాం డ్రీప్రపంచంబున నెవ్వరునుండరు! ఎవ్వరైనను దురుష్కృల హస్తంబులన్బడిన కన్యను వివాహమాడుదురా! కుక్క ముట్టు కొనినకుండ నెవరైనను గైకొందురా? కక్కినకూటి కెవరైన నాశింతురా! ఈ యడియాసలేటికి మానుము! నే నతనికిఁ దలదన్నిన సంబంధము విచా రించెద సమ్మతింపుము.

సరస్వతి—నే నెచటనుండినను నా పాతివ్రత్యధర్మంబున కణుమాత్రమైనను భంగంబు గలుగలేదె!

సీ॥ ఖలుఁడు రావణునింటఁ♦ గడుబాధలందిన,సీతను గైకొని ♦ చెలఁగలేదె
తననాథుఁ దాబాసి ♦ దమయంతి యడవులఁ,నిడుములుగుడిచిన నేలలేదె
కౌశికునింటఁ ♦ గాలంబుఁగడపినఁ,చంద్రమతీదేవి ♦ సైపలేదె
బలుఁడు కీచకుని చే ♦ భంగపాటునుబడ్డ, పాంచాలిఁగైకొని♦ బరఁగలేదె
తే॥ రాముఁడునలుండును,త్రిశంకు♦రాజసుతుఁడు, పంచపాండవులనువారు♦వారినె చి
నాదు దుఃఖంబు కష్టము ♦ శ్వేదనలను,గాంచి గైకొని బోవఁడే ♦ కాంతుడతివ.

చ॥ నను కనులారఁగాంచి తన ♦ న్యాయము శీలము సద్గుణంబులన్
ఘనముగఁ జూపి నిష్కలుష ♦ గౌరవప్రేమ లొసంగి గైకొనక్
మనసున మెత్తు లేదనిన ♦ మాయజగంబున నిల్వకుంటె నే
ననలము సంద్రముంజొచ్చెద ♦ నాయువు బాయుదు నిశ్చయంబుగన్,

మాధవి—నిరాశఁజెంది దుష్టకార్యంబు లొనర్పకుము! "జీవన్భద్రాణి పశ్యతి" యని పెద్దలందురు, బ్రతికిచెడినవా రుండరు! నడియావనంబుననున్న నీ కింత నిరాశ యెందులకు! నీ కాతనిపై నెంత ప్రేమయున్నదో యంతకు వేయిరె ట్లధికముగా నీయం దాతనికిఁ బ్రేమయుండనోపు! నీ వాతనికై యన్వే షించుచున్నట్లు, నీ తలతిక్క యెప్పుడు తిరుగునా, యెప్పుడు వివాహమాడు దునా యని యాతఁడు ని న్నన్వేషించుచున్నాఁడేమో యెవ్వరెఱుఁగుదురు! నీ వాతని నన్వేషింపుము! నేనును వెదకెదను! తిరిగి సంవత్సరమునాఁటికి నిన్ను గలుసుకొందును. నేను బోయివచ్చెదను! మఱవకుము!

సర—నెచ్చెలీ! నన్ను మఱవకుము! నిను వీడిపోవ నా కాళ్లు రాకున్నవి! నీ ముఖ చిహ్నంబు జూడ నదేమియోగాని నా మనోహరుని జూచిన ట్లున్నది!

మాధవి—నే నిక్కడ నింకొక నిముషమున్న నన్ను బెండ్లియాడెదనందువు! నీ పిచ్చి నీ కానందము! నీ మనోహరుని సందర్శనము నీ కచిరకాలములోఁ గల్గుఁ గాక! నేను వెళ్లివచ్చెద! (అనుచుఁ బాఱిపోవును.)

## తృతీయరంగము

[కలక్టరు మాధవరావు, సరోజిని బంగళాయందు మాట్లాడుచుందురు]

సరో—మాధవా! నానాఁటికి నీయాఫీసుపని కొండలవలె పెరిగిపోవుచున్నదే. నీ వెప్పుడు క్లబ్బుకే రావు. టెన్నీసు బాట్మింటను నాడనేయాడవు. మాయింగ్లీషు క్లబ్బులో నసలడుగుఁ బెట్టనే పెట్టవు! అనేకులు దొరసానులు తమభర్తలతోఁ గలసి కందుక క్రీడలలోను, నాట్యవిహారములలోను విచ్చలవిడి సంచరించుచుండఁగా నేను దిక్కులేనిదానివలె నొంటరిగా వెళ్లవలసిన దాననేగాని నీవు రావుకదా! నేను నిన్ను వివాహమాడి కష్టపరంపరలే గుడుచుచున్నానుగాని యొక్కరోజైనను సుఖమెఱుంగను.

ఉ॥ హైందవ మానినీమణు ల♦హర్నిశలు న్బొయి వద్ద మ్రగ్గన
ట్లందము చందమున్విడిచి ♦ యాదల వేమఃసుగు ల్ధరింపఁగా
సుందరమైన బొమ్మవలెఁ ♦ జూడఁదలంచిన వాఁడవేమొ నా
డెందము సేవజేయదు వ♦డిన్ ననుబానిసగాఁదలంచితే
నెందులకైన నేగెదను ♦ హింస సహింపఁగఁజాల మాధవా.

మాధ—ప్రాణప్రియా! ఇటుల నన్ను దూషించెదవేల! నేనెచటకు వెళ్ళుచున్నను, నిన్ను వెళ్ళవలదని నిర్బంధించుటలేదే! నీకు మహారాజ్ఞీ భోగంబులన్నియు సమకూర్చినను నాకింకను జీవాట్లు తప్పవా? నీకేమి తక్కువ! మోటార్లలోఁ దిరుగవద్దంటినా? క్లబ్బులకు వెళ్ళవద్దంటినా? మీయింగ్లీషు యువకులతోను స్త్రీలతోను గలసిమెలసి తిరుగవద్దంటినా! బాట్మింటను, టెన్నీసు నాడవద్దంటినా? వేసవికాలములయందు శీతల నీలగిరి మందమలయానిలంబులందు విహరింపవలదంటినా? క్షణమునకొక యలంకారము జేసుకొని పూటకొక డ్రెస్సు ధరింపవలదంటినా? నావలన దోషమేమి దూషించుటకు!

ఉ॥ మోటరుబండి నిచ్చితి న♦మూల్యముగా ధనరాశిఁ గూర్చితిన్
నీటగు సౌధ మిచ్చితిని ♦ నీదగుసౌఖ్యముఁ బెంపొనర్చితిన్
వేటల నాటపాటలను ♦ వే ముదమందఁగఁ గూర్చుచుంటి నో
పాటలగంధి నన్నిటులు ♦ భావ్యమె దూర నకారణంబుగన్.

ఉ॥ వింతలు చూడవల్దనను ♦ వేడుకల న్విడుమంచు వేడ నే
నెంతయు రోషభీషణపు ♦ నుద్దులుబల్కుచు కంటగింపనే
నింతిరొ క్లబ్బుకు న్వెడల♦నీయ నటంచని యాజ్ఞ పెట్టలే
దింతగ నాగ్రహాగ్నినను ♦ నిట్లు దహింపఁగ నేల జెప్పవే

ఉ॥ కందుకక్రీడవల్దనను ♦ కాంతలతో విహరింప వల్దనన్
సుందర మందిరావళులఁ ♦ జోద్యముగా నివసింపవల్దనన్
విందులు బాల్సు డాన్సులును ♦ వేడుకల న్గనఁబోవ వల్దనన్

సుందరబృందమున్నలసి ♦ సొక్కుచు షైరుకు నేగవల్దనన్
ఇందునిభాస్య నాయెడల ♦ నేటికిఁగోప మనుగ్రహింపవే.

సరో—కలక్టరుగారు లెక్చర్లిచ్చుచున్నారే! నేను నిన్ను వివాహమాడినది యీస్వల్ప సౌఖ్యంబులకేనా! నీవునాతో నొక్కనాఁడు మాక్లబ్బులో నాటపాటలకుఁ గ్రీడావిహారంబులకు వచ్చితివా? నాస్నేహితులతోను స్నేహితురాండ్రతోను గలసిమెలసి విహరించుటకు నీవొక్కసారియైనను వచ్చితివా? అదియటులుండఁ బరపురుషులతో మాట్లాడఁగూడదను, పురుషులతో నాటపాటలలోఁ దిరుగఁ గూడదని యాజ్ఞలయ్యే. ఇట్టి యాజ్ఞలు పరిపాలించుటకు నేను Hindu child wife ననుకొంటివి గాఁబోలు! నీయాజ్ఞలు నాకుఁ బనికిరావు. నేను చేసినట్లు చూచి సహింపవలెను. లేకున్న నేమిజరుగునో తెలియునా? హిందూసంసార మనుకొంటివిగాఁబోలు! పాప మెంత వెర్రివాఁడవు.

ఉ॥ ఇంతులుతక్కు బొమ్మలు ర♦హిం దనరారెడి. యాటవస్తువుల్
వింతగు సంతతి న్బడయ ♦ వీలగు యంత్రము లాత్మమోహమున్
శాంతి వహింపఁజేయఁదగు ♦ చక్కని చుక్కలటంచు వారలన్
సొంత గృహంబునందునిచి ♦ స్రుక్కఁగఁజేయఁ దలంతు వక్కటా.

చ॥ కనులును గాళ్లునుంగలవు ♦ కాంచఁగలారలు రమ్యవస్తువుల్
వినఁగలవారు వీనులకు ♦ విందగు నృత్యము లాటపాటలున్
తినఁగలవారు దివ్యరుచి ♦ తేనెలసోనలు పాయసాన్నముల్
కనికరమింత లేక కడుఁ♦గష్టముఁ బెట్టఁగనేల కాంతలన్.

ఉ॥ కొట్టినఁగొట్టనేర రిటు ♦ కొట్టఁగనేటికిఁ గోమలాంగులన్
దిట్టినఁ దిట్టనేర రిటు ♦ తిట్టఁగనేటికి సుందరాంగులన్
బుట్టినయింటికి న్యశముఁ ♦ బుణ్యము మెట్టినయట్టి యింటికిన్
గట్టిగఁ గూర్చుచుందురు ♦ కాంతల నేపఁగ న్యాయమార్గమే.

సీ॥ పతియెదైవంబని ♦ పాదంబు లొత్తంగ, భారతవర్షంపు ♦ వనితగాను
ప్రాణనాథుఁడె భువి♦పరమదైవంబని, యడుగడ్గునకు మడ్గు ♦ లిడగఁబోను
భర్తలోకము వీడ ♦ వహ్నిలోపలఁ జొచ్చి, సతి ధర్మమును నిల్పు♦మతియు లేదు
గృహలక్ష్మియని గొప్ప ♦ కీర్తి పొందఁగఁ గోరి, యింటిలోఁ బడి వ్రుగ్గ♦నిచ్చలేదు

తే॥ కాలుచేతులు బంధించి ♦ కష్టపెట్టు, నోరునొవ్వంగఁ దిట్లచే ♦ నొవ్వఁజేయు
బడితె విరుగంగ దేహంబుఁ ♦ బట్టికొట్టు, భరత భామిని ధర్మంబు ♦ బట్టువడదు.

మాధ—మనోనాయకీ! భారత స్త్రీధర్మంబు పాశ్చాత్య స్త్రీలకుఁ బట్టువడదని నాకుఁ దెలియును. ఆకారణంబుననే నీ వాడినది యాటయుఁ బాడినదిపాటయునగు చున్నది. అందుననే నీ స్వాతంత్ర్యంబు నరికట్టుటకు లేశమైనను బ్రయత్నింప కుండుట! పాశ్చాత్య నాగరికతా వ్యామోహంబునఁ జిక్కిన యబలారత్నం

బును భారతఖండసంప్రదాయ తత్పరురాలనుగాఁ జేయుట నాకుఁగాదుగదా యా చతుర్ముఖ బ్రహ్మకైనను సాధ్యముకాదు! ఎవరు చేసుకొనిన ప్రారబ్ధము వారనుభవింపవలెనుగాని ప్రాక్పశ్చిమ సిద్ధాంతములను దూరిన లాభముండునే.

సరో—తిరిగి మీతలతిక్క ఫిలాసఫీ (వేదాంత సిద్ధాంతము) లోనికి దింపకుఁడు! ఈ దినంబున మనపోలీసుసూపరింటెండెంటుగారును, పెద్దకలక్టరుగారునుమన యింటికి విందుకై దయచేసెదరు! మీరొక మూలను ముక్కుమూసుకొని కూర్చుండి మీ కచ్చేరిపనులలో మునిఁగిపోవక మన మిద్దరము వారినాదరింపవలె! అటు తరువాత నందఱము బోటుషైరునకు వెళ్లుటకేర్పాటు చేసినాము! మీ యిష్టముండినరావచ్చును. లేకున్న యిల్లు కనిపెట్టుకొని యుండవచ్చును. నేను వారితో వెళ్లక తప్పను.

మాధ—మహాప్రసాదము! నాకు కచ్చేరి పనియున్నది! నేనురాను. నీవు వెళ్లుటకు నాయభ్యంతరము లేదు. నాయభ్యంతరమున్నను నీకు లక్ష్యములేదను సంగతి నాకుఁ దెలియును. నీ యిష్టము వచ్చిన ట్లొనరింపుము.

## చతుర్ధరంగము

[ప్రవేశము అనసూయ, అచ్యుతరావు, తండ్రి జనార్దనరావు, సుప్రభ, రుక్మిణి]

సుప్రభ—అచ్యుతా! నీభార్యయమాంగల్యపు బ్రతుకు చూడలేకున్నాము! మడిమైల లేదు. ఆచారము శుభ్రత కంచుకాగడాలతో వెదకినను గనుపింపవు. ప్రతి దానికి నడ్డదిడ్డముగ వితండవాదము, ఎక్కడ దాపురించినదో.

జనార్ద—పైకిచూచినఁ జలిచీమవలె నేమియుఁ దెలియునట్లుండును గాని కొంపలుదీయు నాలోచనలెక్కువ. ఎట్టి దుర్ముహూర్తంబున మనయింటఁ బాదముఁబెట్టినదో నిత్యకల్యాణము పచ్చతోరణములతోఁ గళకళలాడు కొంప నిప్పచ్చరమై పోయినది.

అనసూయ—నిష్కారణముగా నన్నాడిపోసుకొనిన నేమిలాభము! ఎవరు చేసుకొనిన ఫలము వారనుభవించెదరు. కట్నములని పేరుఁబెట్టి మాపుట్టింటివారి యైశ్వర్యమెల్ల దోఁచికొని తెచ్చిన పాపపుసొమ్ము శాశ్వతముగ నుండునా? అట్టి పాపఫలంబు కట్టికుడుపకుండునా? చేతులార నాటిన పాపవిషబీజంబులు మహా వృక్షములై ఫలంబులు ఫలింపవా.

రుక్మిణి—కట్నంటులు మాయొక్కరి యొడిలోనే పడలేదు! మగపిల్లలమీఁదఁ బుచ్చుకొన్న కట్నము తిరిగి యసలుఫాయిదాలతో నల్లుండ్రకు ముట్టజెప్పుట లేదా.

అనసూయ——అవును పాపము! నాభర్త నమ్మి సంపాదించిన రెండువేలలో నీభర్తకు నూటపదార్లిచ్చి చౌక బేరముగా కొన్నారు! తక్కిన 1900 రూపాయలున్ను రేంగంగలో పోసిరో! ఆడుబిడ్డల సంబరము లేనిదే యెవరికి ముట్టఁజెప్పుదురు.

సుప్రభ——రుక్మిణీ? నీవూరుకోవే! అమాచకమ్మతో నీకు వాదమేమిటి. అదినోరు తెరచినఁ దిరిగి గాడిదకూసినఁగాని యూవాగుడున కంతుబొంతుండదు. కడుపున నొక నలుసైనను ఫలింపకున్నను, దానిగర్వము చూచినఁ బట్టపగ్గములైనను జాలవు, పోనీ డబ్బుఁదెచ్చి పడవేయునని యూరకొందమాయన్నచో నానోములును నోచుకొనలేదు! పైఁగా మనలను బెట్టి పోషించుచున్నట్లు మాటలు, ఇంతకు నాకొడుకు దరిద్రపుఁగొట్టు పెద్దమ్మ గనుక, వానిని జచ్చుపీనుఁగువలె నొకమూల పడవేసి, బ్రహ్మరాక్షసివలె మనమీఁదఁబడి విరుచుకొని తినుటకు సిద్ధమైనది. ఇంతకును నాకొడుకునకే మానాభిమానము లున్నట్లైన నీపాటికీ బ్రహ్మరాక్షసి నేనూతిలోనో నేగోతిలోనో. పూడ్చిపెట్టి తిరిగి 5000 కట్నముతో రంభవంటి భూలోకాప్సరసను దీసుకొనివచ్చి పెండ్లిజేసియుండును. ఆచచ్చుపెద్దమ్మ వినఁడు. ఈబ్రహ్మరాక్షసి మనలను వదలను.

అచ్యుతు——అమ్మా! నీకోడలు చేసిన తప్పేమిటే! తప్పుఁజేసిన శిక్షింపుమన వచ్చును గాని, నిరపరాధిని యైన గంగిగోవు నెట్లు పులివాతఁ బడఁద్రోయుదును.

సుప్రభ——ఓరి భ్రష్టాగ్రేసరచక్రవర్తీ! నీభార్య గంగిగోవా? ఆచవిటికౌళ్ళ పెద్దమ్మ తప్పెంఱుంగదా? నినుఁ గన్నతల్లి క్రూరమైన బెబ్బులియా! ఏమి చేసెనని యడుగుచున్నావా ? సిగ్గు లేక! చెప్పెద వినుము.

సీ॥ పొద్దుపొద్దున లేచి ♦ భూషణాదులు దాల్చి, సానివేషము దిద్ది ♦ చక్కనిలచు
నహరహంబుల నెల్ల ♦ హద్దుపద్దును లేక, చదువుసంధ్యలతోడ ♦ సాగుచుండు
క్షణమున కొకకోక ♦ గంటకు నొకవేష, మును దాల్చి యూరెల్ల ♦ ముదితదిరుగుఁ
. గూనరాగంబులు ♦ గోకిలాలాపము, ల్బలుకుచుఁ బనిపాట ♦ భంగపఱచు
భాగవతంబును ♦ భారతంబును బట్టి, దినమెల్లఁ జదువంచు ♦ దేవులాడుఁ
తే॥ బగలు రాత్రియు లేకయే భర్తతోడ, సరససల్లాపములమున్గి ♦ సరసనిలుచు
సిగ్గుబిడియంబు నెఱుఁగదు ♦ యెగ్గులేదు, సానియగుగాని సంసారి ♦ చానగాదు.

అచ్యుతు——తల్లీ! నీకుఁ గోపము వచ్చినఁ జెప్పలేను గాని నీవు చెప్పినవన్నియు దోషములా! భాగవత భారతంబులు జదువుటయు, భగవత్సంకీర్తనంబుఁ జేయుటయు దోషమైనచో, భారతనారీమణులకుఁ జేయఁదగిన ధర్మమేది?

రుక్మి——నీ కోడలు వీనికి మందుఁబెట్టినదే! ఎప్పుడైనను నీ మాటకు వీడెదురాడెనా? ఇప్పుడు చూచితిరా పెండ్లాముమీఁద నీగవాలినఁ గత్తిదూసుకొని మనపైకెటుల వచ్చుచున్నాఁడో!

సుప్రభ—అబ్బాయీ ! ఆ మహాసాధ్వీమణి చేయుపనులలో నావగింజలో నరభాగ
మైనను జెప్పితినా !

సీ॥ గృహకృత్యములయందుఁ ♦ గేలుమోడ్చిననైనఁ, బూచికపుల్లను ♦ ముట్టఁబోదు
పలికి భాషింపంగఁ ♦ బరమశత్రువుబోలెఁ, జిఱ్ఱుబుస్సుమటంచుఁ ♦ జీదరించు
నత్తమామలటన్న ♦ నాడబిడ్డలటన్న,నగ్నిహోత్రిజ్వాల ♦ ననుకరించు
బంధువర్గంబును ♦ వలదయువారినిజూచి, చీటికి మాటికిఁ ♦ జెండుచుండు
తే॥ దైవమెఱుఁగదు పెద్దల ♦ తలఁపఁబోదు, పిలచిననురాదు కోపించుఁ ♦ బ్రేమలేదు
ప్రాణనాథుని మనిబూని♦భంగపరచెఁ, గాంతగాదుర యిదిపెద్ద ♦ వంతగాని.

రుక్మిణీ—అచ్యుతా ! నా మనవి నాలకింపుము,

సీ॥ పూచికపుల్లైన ♦ ముట్టనేరదుగాని, కాఫితాగును పెద్ద♦కడివడైన
నూతినీళ్ళనుదోడ ♦ నొప్పిఁజెందునుగాని, ఫలహారముల చేయఁ ♦ జడలఁబోదు
వంటసేయఁగరోసి ♦ వగపుఁజెందునుగాని. కడిపెడన్నముమైనఁ ♦ గుడువఁగలదు
వడ్లుదంపఁగలేదు ♦ బట్టలనుతుకదు, వేశ్యవేషము వేసి ♦ వీధిఁదిరుగుఁ
తే॥ బలుక గచ్చులపాదవోలె ♦ గలగలాడు,దిట్ట దిగఁ బాఱవోయును ♦దిట్టయగుచుఁ
బ్రాణనాయకియంచును ♦ బ్రిమపెదేమొ,నారి యిదికాదువినుమ మహా♦మారిగాని.

అచ్యుత—అమ్మా ! మీ పూర్వకాలఁపుటాలోచన లిప్పటికాలమువారి కుండవు?
దేశకాల పాత్రాదులనుఁబట్టి యాచారవ్యవహారంబులును, వేషభాషాలంకా
రంబులును మాఱుచుండును ! వానినెల్ల యాక్షేపించుట మంచిదా ! తిట్టి దిగ
బాఱబోయుట భావ్యమా! మీ కాలమునాఁడు పరికినీలు జాకెట్లు ప్రక్క
పాపిటలు, ఫేసుపౌడర్లు, సబ్బులు సెంటు లెఱుంగరు ! ఆ కారణంబున
నిప్పటివారి నవి యుపయోగింపఁ గూడ దన వచ్చునా? పూర్వము సానులఁ
దప్ప సంసారులు సంగీతసాహిత్యంబులు నేర్వరైరి! ఇప్పటికాలంబున స్త్రీల
కాహారం బెంత యావశ్యకమో సంగీతసాహిత్యంబులంత యావశ్యకంబయ్యె!
ఏదియో గౌరవజీవనంబుఁ జేయుచున్నపుడు కోడలును గొంత సుఖపెట్టఁ
గూడదా? దీని కింతరాద్ధాంతము గావలెనా?

సుప్రభ—ఓరి చచ్చుపెద్దమ్మా! పెళ్ళామును వెనుక వేసుకొని మమ్ము మందలింపవచ్చి
తివా? సంసారిగాక సానివలె తయారైన దానితో సంసారమొనర్ప నీకెట్లు
సిగ్గు లేదురా? నీ తెలివితేటలన్నియు మందుఁబెట్టి చలిపివేసినది కాబోలు!
నీ తెలివి మావంటి మూలనున్న ముసలమ్మల మీఁద నుపయోగింపవలెనుగాని,
సింగంబును జూచిన భయఁబడు లేడి పిల్లవలె దానియొద్దఁ గుక్కిన పేనువలెఁ
బడియుందువు! మా చిన్నతనంబున మేముపడ్డ కష్టంబు లిప్పటికిని మఱపునకు
రావు! రాత్రింబవళ్ళు వంటయింటిలోనే పాదుకొని పోయెడిదానను. లంకంత
యిల్లంతయు నేనే చిమ్మి కడిగి యద్దమువలె నుంచెడిదానను, మైలుదూరము
నుండి యలోలక్ష్మణాయని యొద్దడినీరు భుజములఁ గాయలుఁగాయ మోసికొని

వచ్చెడిదానను! రాత్రి పండ్రెండుగంటలు పగలు రెండు జాములైనను పిండముఁ దినుటకు వీలుకలెడిదికాదు! చచ్చి యేలోకంబునకుఁ బోయినదో నా యత్త నన్ను వేడి మంగలములోఁ బడవేసి మాడ్చినది. 10, 15 సంవత్సరములు సంసారంబు మాటఁబెట్టినను బగలు మీనాయనతో మాట్లాడు స్వాతంత్ర్యముండెడిదిగాదు. నాయత్తయు మామయు నకారణంబుగఁ బ్రతినిత్యమును నన్ను బడితెపూజఁ జేయుచుండెడివారు. తిట్లకు శాపములకును విధివిరామముండెడిది కాదు! ఇప్పుడట్టి భూలోక నరకంబేమియు నీ పెద్దమ్మ యనుభవించుట లేదే! మేము నీరాణిగారిని కోకటిలోవేసి దంపుచుండుటలేదే! దేవునివలె నీవామె నంగరంగవైభవంబులతోడఁ బూజింపవద్దన లేదే! మీరు భార్యాభర్తలు సిగ్గులు లేక గదిలోఁ గూర్చుండి యహోరాత్రంబులు గుసగుసలాడుచుండ వలదనలేదే! పగల స్తమానమువఱకును రాత్రి రెండు యామంబులవఱకును నీ దేవిని వంటయింటిలోఁ బాదుకొనిపొమ్మని యాజ్ఞఁ బెట్టలేదే! అత్తమామలకును నాడుబిడ్డలకును జాకిరి చేయుమని పోరుసల్పుచుండలేదే! సాని యలంకారంబులు మానుమంటిమి! బోగముదానివలె నస్తమానము వఱకు నృత్యగీతకావ్యపఠనంబులతోఁ గాలంబుఁగడపవద్దంటిమి! శ్మశానంబువలె మొగంబునుంచుకొనక నొసట నలంకారంబుగా బొట్టుపెట్టుమంటిమి! ప్రిక్కపాపిటలు, గూడకట్టులు, పరికిణీలు జాకెట్లు ధరింపఁగూడదంటిమి! రవికలకు మెడయుఁ జేతులు లేకుండను, కక్ష యుగ్మంబు గనఁబడునట్లును ధరింపక సంసారి యలంకారంబులు జేసికొనుమంటిమి. ఎల్లప్పుడుఁ దలవాకిట సంచరింపుచు నూరివారెల్లరితో నవ్వులు, కేళింతలు, వేళాకోళంబు లాడుచుండక యింటిలో నుండుమంటిమి. ఎల్లప్పుడు క్లబ్బులు, సినిమాలు, నాటకంబులు, పాటకచ్చేరులు, కాన్ఫరెన్సులు జూచుటకుఁబోయి సొమ్ములు దగులవేయ వలదంటిమి! దీనికే యింత మండిపడి మమ్ముల గర్భశత్రువులుగాఁ జూడవలెనా! దీనికే పండువంటి కాపురంబునకుఁ జిచ్చుబెట్టవలెనా? నీవాగయ్యాళిగంపను విడువకున్న నేను గంగపాలయ్యెద! నీవాకలియుగబ్రహ్మరాక్షసి నింటిలో నుండి తరిమివేయకున్న నేనీ యింటికి నిప్పంటించి యందులోబడి దగ్ధమయ్యెదను. ఈ గృహంబున నా మాచకమ్మ విస్తరివేసుకొని యన్నముఁ దినినచో నేనా రోజున హరివాసరంబుండి పస్తుబడి చచ్చెదను. నీవు నామాట విని యీదయ్యంబును వెడలఁగొట్టినచో పదివేలు కట్నంబుతో నొక ద్రిలోకసుందరిని దీసికొని వచ్చి పెండ్లిచేయుదును. లేదంటివా నేనిదుగో యీక్షణంబుననే యురిఁబెట్టుకొని చచ్చి దయ్యమై దానిని బట్టి చంపెదను. [అని పైట చెంగుతో నురిబెట్టుకొనుచుండ నచ్యుతుఁడామెను వారించును.]

అనసూయ—అత్తగారూ! నన్ను క్షమింపుఁడు. నేఁజేసినవన్నియు మీకుఁ దప్పులుగానే తోఁచుచున్నవి.

చ॥ చదువును నేర్వఁగాఁదగదు ♦ సాహితి శాస్త్రవిచారమొప్ప దే
సదమల శీలవర్తనము ♦ సాగదు కూడవు సత్కథావళుల్
మది హరికీర్తనల్పడవు ♦ మంచిదికాదు బుధానురాగ మిం
కిది తగు నిద్ది కూడదని ♦ యింగితము ల్దెలుపంగ రాదొకో.

చ॥ పలుకుట లేదు కిల్బిషము ♦ పాపము సేయుటెఱుంగరాదు నా
చెలులను బంధులన్విడిచి ♦ చేయుచునుంటి సమస్తసేవలుఁ
ఫలితము గానరాదు పలు♦బాములు పెట్టుచునుండి రక్కటా
కలుషితు లిట్టి వారలను ♦ కాదని చెప్పెడువారు లేరొకో.

సుప్రభ—ఛీ! ఊరక వాక్కాయజాడ్యము వచ్చినట్లు వాగకు. నోటిమీఁద వాత వేయించెదను. నీవు మడిఁగట్టుకున్నావు! మేము కలుషితులమా! ఓచవట పెద్దమ్మా! నీవు దీనిని నెత్తిమీఁదఁ బెట్టుకొనుటచేత నే దీనికింత పుట్టెపొగరు బలిసినది. దీనిని మానవతీశిరోభూషణముగా నెంచుచున్నావు గాఁబోలు.

సీ॥ చదువు సంధ్యలు నేర్చు ♦ సదమలాంగియటన్న, విటకాండ్రకునుజాబు♦ వేగవ్రాయు
సంగీతసాహిత్య ♦ చతురురాలని యన్న, పగలు రాత్రియులేక ♦ పాడుచుండు
సౌందర్యఖనియన్న ♦ సాని బృందముబోలెఁ, బ్రొద్దెల్ల వేషము ♦ దిద్దుచుండుఁ
బని పాటలను నేర్చు ♦ పద్మాక్షియని యన్నఁ, బొరుగిండ్లకును జేరి♦పోరొనర్చు
తే॥ నకట వికటపుఁబలుకుల ♦ నతిశయిల్లు, నత్తమామల యాజ్ఞన ♦ నాదరించుఁ
బ్రాణనాథుని పాలిఁటి ♦ పగతురాలు, నారియిది కాదు వినుమహా♦మారిగాని.

సీ॥ పుష్పగుచ్ఛంబుచేఁ ♦ బూఁబోఁణి నిటులన్న, జీపురుకట్టచే ♦ వీపుమలుపు
సరససల్లాపముల్ ♦ సలుపుచోఁ గయ్యాళి, గంపయై విరసంపుఁ ♦ గలహమాడు
నత్తమామల మీఁద ♦ నాడుబిడ్డల మీఁదఁ నేరముల్కల్పించి ♦ దూరదిట్టుఁ
గల్లబొల్లులు పల్కి♦కలవి లేనివి చెప్పి, ప్రాణేశు బుట్టలోఁ ♦ బదిలఁబఱచు
మందు మ్రాకులు బెట్టి ♦ మనసు పాడొనరించి, భర్తను దనచేతి ♦ ప్రతిమఁజేయుఁ
తే॥ చిన్నపెద్దల బంధుల ♦ వేధబెట్టు, దల్లిదండ్రుల పాల్జేయు ♦ ధనమునెల్ల
నత్తమామల బాధించి ♦ యడలఁజేయు, నారియిదిగాదు వినుమహా♦మారిగాని.

అచ్యు—తల్లీ! యిదేటి యభూతకల్పనము! ఏమియన్యాయము! ఇట్టి మృషావాక్యంబులు లోకము మెచ్చునా? నీవు నీ పుట్టింటినుండి యత్తింటి కెట్లువచ్చితివో నీ కోడ లట్లు రాలేదా! నీ యధికార మెట్లిప్పటివఱకుఁ జెల్లెనో యట్లామె యధికారంబుఁ జెల్లించుకొనుటకుఁ బ్రయత్నమొనర్చుటయుఁ దప్పగునా! సాధ్యమైనంతవఱకు నీ యాజ్ఞ జవదాటక మీకు సర్వోపచారంబులఁ జేయుచున్న సాధ్వీరత్నంబు నింటనుండి వెడలఁగొట్టుటకేల యత్నించెదవు! ఈ గృహకల్లోలంబు వారింపుము. అనసూయా! మావారి పలుకులు వినుచుంటివి గదా! నీ సమాధానమేమి!

అన—నాథా! చెప్పుట కేమున్నది.

సీ॥ ధవళవస్త్రముఁగట్టఁ ♦ దప్పుగాఁగనిపించె, స్నానమాడుటయు దో♦షమననయ్యె
భర్తతోఁబలుకాడఁ ♦ బరమపాపంబయ్యెఁ, జేసిన సేవయే ♦ చెట్టయయ్యె
నత్తమామల సేవ ♦ యపరాధమేయయ్యె, నాడుబిడ్డల సేవ ♦ లఘుమయ్యెఁ
దులసిదేవతపూజ ♦ యలఘు పాతకమయ్యె, భారతపఠనంబు ♦ ఘోరమయ్యె
తే॥ దేవపూజయె దురితమై ♦ తేలుచుండె, భర్తసేవయు పాపమై ♦ పరగుచుండెఁ
బరమసాధ్వీస్వభావమే ♦ దురితమయ్యె, నెట్లు గడుపుదు కాలంబు ♦ నేదిదిక్కు.

ఉ॥ పొత్తముఁ బట్టగాఁ దగదు ♦ పువ్వుశిరంబునఁ దాల్పరాదు నో
రెత్తుచు మాధురీమహిమ ♦ లింపువహింపఁగఁ బాడరాదు నా
చిత్తరిచూపులన్ మగని ♦ బ్రీతి నొయ్యారము జూడరాదు నే
నిత్తటి ఘోరబాధల ని♦కెట్లు సహింపుదు ప్రాణనాయకా.

ఉ॥ స్నానము సేయగాఁ దగదు ♦ చక్కని పుష్పములంకరింపఁగా
మానవలెన్ సు భూషణము ♦ మంచిదుకూలముఁ గట్టఁగూడ దే
మానవతీమణి గ్గలసి ♦ మాన్యులస్నేహము సేయరాదు ఈ
దీనదశన్భరించి యెటు ♦ తెప్పరిలంగలదానఁ జెప్పుమా.

చ॥ పవలును రాత్రియు న్నొంటయిని ♦ ఒట్టుకకూర్చొని యేడ్వఁగావలెన్
దివమున నొక్కమారయినఁ ♦ దీయని పల్కులనాథ యాడ వే
యెవరును దిక్కులేరికను ♦ నెట్లుతరించెద మోహతాపముల్
భువిసతిరత్న మెల్లడను ♦ భూరివిపద్ధశవార్ధిఁగ్రుంక బాం
ధవులును దల్లిదండ్రులును ♦ దాలిమిబోవఁగఁ జాలరక్కటా.

అచ్యు—సతీమణీ! నీ సమాధాన మటుంచుము. నా మాతృదేవతను బ్రిసన్నురాలిని గావించుకొనుము.

అనసూయ—అత్తగారూ! నేనుజేసిన తప్పిదంబులన్నియు క్షమించి నన్ను నాథభర్తకు దూరముగాఁ జేయవలదని ప్రార్థించుచున్నాను క్షమింపుము.

[అని మ్రొక్కఁగా సుప్రభ యామెను గాలితోఁ దన్నును.]

సుప్రభ—

ఉ॥ ఛీ కుటిలాత్మ నీ మొగము ♦ సిగ్గుకనుంగొనఁ బాపమెల్కడిక్
నాకును నీకు బాంధవము ♦ నాఁటనె దీరెను నే నికత్తనే
నీకను నీవు కోడలివె ♦ ప్రేమలు ముద్దులుదీరె నెన్నఁడో
నీ కుల గౌరవంబులును ♦ నీ దురితంబులు జెప్పశక్యమే
ఛీకను చింతఁబొసి వడి♦జేరుము పుట్టినయింటి కిప్పుడే.

ఛీ! ఛీ? పిశాచీ! యీ గృహంబువదలి పొమ్ము. నీ వీ గృహంబు వదలినచో నా కుమారుని బట్టినదయ్యము వదలిపోవును. ఎట్టి పాపిష్ఠికాలంబున

నీవు మా యింట నీ పాదంబుఁ బెట్టితివో యప్పటినుండియే మా కష్టకష్టంబులను బ్రాప్తించెను. నీ వింటనుండి వెడలనిచో నీ యన్నంబున విషంబుఁ గల్పెదను. నిద్రింబోవుచుండఁగా నిన్నుఁ దీసుకొనిపోయి నట్టేటిలోఁ బడఁద్రోయుదును. లేదా గరిటఁగాల్చి వాతలు బెట్టెదను. లేదేని గత్తిపీటతో గొంతుఁగోసెదను. అదియు సాగనిచోఁ జాంతాడుతో నురిఁదీయించెదను. నాపంతము నెగ్గి నిన్ను యమపురికంపనిచో నీ ప్రాణంబుల కునూరు మనుచు నేనే యేనుయ్యో గొయ్యో చూచుకొని యందుఁబడి ప్రాణంబులు బాసెదను. ఏమిరా! అచ్యుతా! చచ్చుపెద్దమ్మా! మాట్లాడవేమిరా! నీ భార్యను జావఁగొట్టి చెవులు మూసి యిల్లు వెడలఁగొట్టెదవా? లేక నన్నేగంగలోనైన దిగమానెదవా? నీకుఁ బెళ్లాము పటికబెల్లమువలె నున్నది గాఁబోలు. నాకు శనైశ్చర దేవతవలె నున్నది. దానినిజంపి నన్ను జంపుకొనుమనెదవా? లేక నీవే దానిని గుక్కను గొట్టినట్లు చావఁగొట్టి చెవులు మూసి యింటినుండి తరిమివేయుదువా! నీకుఁ బెండ్లాము దొరుకదని బెంగపెట్టుకొనకు. రేపేపాటికి బంగారు బొమ్మవంటి చక్కని చుక్కను వేయివరహాలు కట్నముతోఁ గూడ దెచ్చి వివాహ మొనరింతును.

అచ్యు—

సీ॥ పతియాజ్ఞ మీఱని ♦ పరమసాధ్వీమణి, సురుచిరగుణశీల ♦ సుందరాంగి
సదమల చారిత్రి ♦ సతి ధర్మశాలిని, సకల కళాభ్యాస ♦ సాధుశీల
శుకశోకి లాలాప ♦ శోణితాధరబింబ, మొలక నవ్వులరాణి ♦ మోహనాంగి
సుమకోమలాంగియు ♦ సుందర వదనార, విందసంశోభిత ♦ విమల చరిత
తే॥ చాదుపావన గృహలక్ష్మి ♦ నాతిమిన్న, పున్నెముల పంట పూజల♦పుణ్యఫలము
పూర్వజన్మలతపముల ♦ పూజ్యఫలము, విడిచి మనఁజాల పరమేశ ♦ విశ్వనాథ.

(అని దుఃఖింపుచు మూర్ఛిల్లును).

అనసూయ—అత్తా! నీ వేచిరకాలంబు వర్ధిల్లి యీయింట నుట్టిగట్టుకొని వేలాడుము. నేనే యరణ్యంబులఁబట్టిపోయెదను. నాతప్పులుఁక్షమించి మన్నింపుము.

చ॥ సతిసుతబాంధవు ల్హితులు ♦ సయ్యన వచ్చుచుఁ బోవుచుండఁగా
క్షితి మనకెప్డు శాశ్వతము ♦ క్షేమసుఖంబులు పొందవచ్చు నం
చతి మమకారమందుఁబడి ♦ యట్టి విమోహమునందుఁ గూలుచు\
హితమగు దైవమున్మఱచు ♦ హేయపు బుద్ధిని మాను టొప్పగున్.

ప్రాణనాథా! నే నెచటికైన నేగెదను. మీ తల్లిగారి కోపము శాంతిఁ బొందిన వెనుకఁ బ్రాప్తమున్నచో మీ పదపద్మసేవ నాకు లభ్యమగుఁగాక! లేకున్న నీ జన్మమున కిదియే తుదిమ్రొక్కు గైకొనుఁడు.

(నమస్కరించి ముందుకు నడుచుచు.)

సీ॥ తెల్లవారఁగ వంట ♦ యిల్లును జేరుచు, సాంధ్యకాలముదాఁక ♦ సర్గవలయు
వినుగు విశ్రాంతియు ♦ విధి విరామము లేక, యింటి చాకిరి జేయు ♦ చేద్వవలయుఁ
బగలు రాత్రియు లేక ♦ వగయునాఁఛయు లేక, పడగాపు పాయిరొద్దఁ ♦ బడఁగవలయు
శాపంబులను దిట్లు ♦ జల్లఁగా సహియించి, దీవెనలంచును ♦ దెలియవలయుఁ
తే॥ జెప్పుదెబ్బ ప్రసాదంబు ♦ లొప్పవలయు, దేహశుద్ధికిఁ దలయొగ్గి ♦ తీరవలయు
భూతలంబున నరకంబు ♦ వోలెనుండె, నత్తవారిల్లు యమలోక ♦ మకట కటట.

సీ॥ శ్రీరామచరితంబుఁ ♦ జెలఁగి పఠించుచో, నోరుమూయుమటంచు ♦ నొక్కి చెప్పు
ధవళవస్త్రముఁ గట్ట ♦ దండిభూషలుఁ దాల్పఁ, జూచి యోర్వఁగలేక ♦ సాధ్వు వెదకు
నాటపాటలయందు ♦ నాదరంబును జూప, సానిపాటలటంచుఁ ♦ బూనితిట్టు
క్షణము గూర్చున్నచోఁ ♦ గనులనిప్పులు రాల, సోమరిపోతన ♦ సొలయుఁదిట్టు
తే॥ బంధుజాలంబునెదుటను ♦ బట్టితిట్టు, భర్తతోడను చాడీలు ♦ బట్టిచెప్పు
లేనితప్పులు గల్పించి ♦ హానిఁగూర్చుఁ, నత్తవారిల్లు యమలోక ♦ మకట కటట.

ఛీ! ఛీ! సంసారసాగరంబు దాటినను నాకీ విషాదమేల! శ్రీహరి నామ సంకీర్తనంబుఁ జేయుచు కాలంబు గడపెదను. (అని వెడలిపోవును.)

అచ్యుతు—(మూర్ఛఁదేరి).

మ॥ అనసూయా సుగుణాలవాల నను నన్యాయంబు గావించితే
ఘనదుఃఖాంబుధిఁ గూలియేడ్చి వెతచేఁ ♦ గన్నీరు మున్నీరుగా
నిను బేర్కొంచును నీ గుణావళులనే ♦ నిత్యంబు వర్ణించుచున్
మనుమంచున్ జిరజీవిఁజేసి చనెదే ♦ మన్మూర్తి ప్రాజ్ఞేసిదే.

ఉ॥ ఎన్నఁడు జన్మమొందితివొ ♦ యెన్నఁడు పెండిలియాడితో మఱిం
కెన్నఁడు గాపురంబునకు ♦ నింపుమెయిన్దయి జేసినావొ యీ
యన్నులమిన్న నీ గుణము ♦ లన్నియు నామది సంచరించు నీ
చెన్ను గురూపసంపదలు ♦ జెందె వినాశము శత్రుకోటిచేన్,

సీ॥ ప్రాణేశ్వరుండె నీ ♦ పాలిటి యముఁడయ్యె, యమబాధలను బెట్టి ♦ నమలినాఁడు
అత్తగారిది కాదు ♦ యమలోకరాక్షసి, నినుమ్రింగయత్నించె ♦ నియతిలేక
మామగారును గాఁడు ♦ భూమిఁబుట్టినశక్తి, కత్తెరబోనులో ♦ నొత్తిపట్టె
వదినెగాదిది దయా ♦ హృదయంబుఁగానని, ఘోరపైశాచిక ♦ క్రూరజాతి
తే॥ కారు బావమఱందులు ♦ కాలభటులు, బంధుజాలము కాదు నూ ♦ బందివారు
ఎట్టి కడగండ్ల గుడుతువో ♦ యెఱుఁగరాదు, సకలసద్గుణనికురంబ ♦ సారసాక్షి,

ఆట్టి ప్రాణేశ్వరియే నన్నెడబాసినపుడు వీరా నను రక్షించువారు. నాకీ సంసారములో నవసరము లేదు; నేను సన్యాసాశ్రమమును స్వీకరించి హరిపరధ్యానతత్పరుండ నయ్యెదను. (అని వెడలిపోవును.)

## పంచమరంగము

[ప్రవేశము-వామనరావు, కాంతిమతి, విమల జబ్బుతోనున్న కుమారుని జోకొట్టుచుండును.]

విమల—కటకటా! ఎంత పాడుకాలమువచ్చెను. ఈ పసికందునుజూడ దిక్కులే దయ్యెగా! నానాఁటికి సన్నిపాతజ్వరం బెక్కుడై సంధించి పిల్లవాఁడు మరణావస్థయందున్నవాఁడు? నా ప్రాణనాథుఁడో వారాంగనా ప్రేమ పాశంబులందగిలి, గృహంబునకు వచ్చుటయే మానివేసినాఁడు. వారాంగనా పాశంబులం దగులువడి యిల్లువాకిలిఁ బట్టక, సదాచార సద్గుణగణంబున కాలవాలమైన సనాతనకుటుంబ మర్యాదను మంటఁగలిపి, మడిమాన్యంబు లాపణ్యసతికి ధారవోసి, ధనకనకవస్తు వాహనాదికంబులుగుదువఁబెట్టి కాసాకు దమ్మిడీగా ఖర్చుచేయుచు, నా వెలయాలి గృహంబున దాస్యజీవనంబు సలుపు చున్నాఁడు. తినుట కన్నంబులేక, యుండుట కిల్లువాకిలిలేక, "యలో లక్ష్మణా" యని పరితపించు కాలమువచ్చినది. ఈ పసిబాలుని మరణావస్థఁ జూచి చింతింతునా? ప్రాణనాథుని దుష్టప్రవర్తనంబు మాన్పఁజాలనందు లకు దుఃఖింతునా! వృద్ధులైన యత్తమామలకు, మా కుటుంబమున కన్న వస్త్రంబులు కఱవయ్యెనని విలపింతునా? నా నాథుఁడదె తూలుచు వచ్చు చున్నాఁడు. మధుద్రవము సేవించెనేమో! (పద్మనాభరావు దూరమునుండి ప్రవేశము!)

బాలు—అమ్మా! అమ్మా? పిశాచము మ్రింగవచ్చుచున్నది, అదుగో సింహము. అదుగో పెద్దపులి, నను మ్రింగుటకు వచ్చుచున్నవి. కొట్టవే! కొట్టవే! నాయనా! బాబో! నేఁ జచ్చిపోవుచున్నాను. అమ్మనికనైనఁ గొట్టఁబోకండి నాన్నా! త్రాగితివి కాఁబోలు వెధవవాసన వేయుచున్నది. నా దగ్గరకురాకు. నా కసహ్యం. అమ్మా నేనిఁక బ్రతుకను. నన్ను దేవతలు పిలుచుచున్నారు. ఎంతచక్కగాఁ మల్లెపూలదండలు వేయుచున్నారో! నేను పోవుచున్నాను. పోవుచున్నాను. వాండ్లతో నాడుకొందును. అమ్మా! నీవుగూడా రావే! నే నొక్కఁడను వెళ్లలేనే! ఇక్కడ నుండినచో నాన్న నిన్నును నన్నునుగూడఁ బట్టుకొని కొట్టి చంపును. అమ్మా! రావా? నేను వెళ్ళిపోవుచున్నాను. (అని లేవఁబోయి పడి యలసటచే నిదుర జెందును.)

విమల—ప్రాణనాథా! మనోనాయకా! ఏల కరుణరాదు?

ఉ॥ అక్కట జీవితేశ్వర మ • హావిపదంబుధి మున్గియుండఁగా
నక్కటికంబుఁబూని సుతు • నాపదద్రోయఁగ నెంచవేల పెం
పెక్కిన వంశశీలములు • పేర్మిగణించుచు దుష్టవర్తనల్
మక్కువబారఁద్రోలి మము • మన్ననసేయవె ప్రాణనాయకా!

సీ॥ బ్రహ్మవంశంబునఁ ♦ బ్రభవించి కాంచిన, కీర్తి ప్రతిష్ఠలు ♦ గీలియయ్యెఁ
దాత దండ్రులనుండి ♦ దండిగూర్చినసొమ్ము, వారాంగనలఁజేరి ♦ దూరమయ్యెఁ
దారహారంబులు ♦ ధనధాన్యరాసులు, ఋణదాతలకుఁజిక్కి ♦ యణఁగిపోయెఁ
బదియు నారవవన్నె ♦ బంగారుమైచాయ, మసిబొగ్గువర్ణమై ♦ మలినమయ్యెఁ
తే॥ గులము శీలము మర్యాద ♦ కూలిపోయె, బ్రహ్మతేజంబు శ్రోత్రంబు ♦ వమ్ములయ్యెఁ
బ్రాహ్మకాంతలతోఁ బొందు ♦ పథ్యమయ్యె, పుస్తెగట్టిన యర్ధాంగి ♦ బూచియయ్యె,

వామన—కుమారా! వృద్ధులమై మంచముఁబట్టి జీర్ణించుచుఁ గాటికిఁగాళ్లు జాచుకొని యున్న మామీఁదనైనను లేశమాత్రము కరుణ రాదా! సకలకలుషంబులకు నాలవాలమై, ధనయౌవనంబులను హరించి సంసారసౌఖ్యంబులను గూలఁద్రోసి తమకు దాస్యంబు సేయునట్లొనర్చు సాని సంపర్కం బెట్లు హితమయ్యెరా! తండ్రీ! వేదవేదాంగాది సర్వవిద్యలకుఁ బుట్టినిల్లై సకలసద్గుణగణంబునకు మెట్టినిల్లైన యీ బ్రహ్మవంశంబునఁ బ్రభవించిన నీకుఁ దుదకబ్బెరా! తురక బాసయనినట్లు వారాంగనాసాంగత్యం బెట్లు సంభవించెరా కుమారా! పదునారవవన్నె బంగారుమైచాయగల్గి, రంభామేనకాతిలోత్తమాది దేవకన్యకామణులను గూడ రూపరేఖావిలాసాదుల జయించు కన్యకామణిని, సకలసద్గుణనికురంబశారదాంబయై వెలయు నీ పతివ్రతామణిని ఎట్లు మోహంబు దినిముంచి పలవింపఁజేసి సాని కొంపల దిరిగెదవురా తండ్రీ!

సీ॥ వెలయాలి వదనంబు ♦ వెండివెన్నెలఁ గాయ, ప్రాణేశ్వరి మొగంబు ♦ భయదకరము
వారాంగనల పొందు ♦ స్వర్గలోక సుఖంబు, భార్యసంపర్కంబు ♦ బహుళబాధ
భోగకన్యలమాట ♦ పురుషార్థముల మూట, సతిమాట వికటంపు ♦ జవిటికూత
ముండ చుట్టల మోవి ♦ ఖండశర్కరఁబోలు, భార్యచక్కెర మోవి ♦ హాలవిషము
తే॥ సొమ్ము సంగిన కూళల ♦ సాకఁజేసి, పసుగురను జేయు పణసతి ♦ పద్మగంధి
జన్మజన్మంబులకునైన ♦ సన్నుతించి, పాద సేవలజేసెదు ♦ పరమసాధ్వి
కంటకంబయ్యె గతియేది ♦ కమల నయన.

సీ॥ నేఁడో రేపో చావుఁ ♦ జూడఁగా నున్నట్టి, తల్లిదండ్రుల ప్రేమ ♦ దలఁపవైతి
పతియె దైవంబని ♦ భక్తితోఁ గొలిచెడి, యిల్లాలి మనవి నా ♦ లింపవైతి
తోడునీడగఁ గూడి ♦ క్రీడసల్పెడు నట్టి, శిష్యబృందంబును ♦ జేరవైతి
కానకకన్న సం ♦ తానంబు బాగోగుఁ, జూచి రక్షింపఁగా ♦ నోచవైతి
తే॥ దురితముల కొంపదూషిత ♦ దుష్టశీల, పాపపంకిల మానస ♦ పతితచరిత
భోగకాంతను మరగుచుఁ ♦ బుణ్యశీల, నింటి యిల్లాలి వేధింప ♦ నేలనయ్య.

ఉ॥ శీలము సున్న సద్గుణము ♦ సెంతకుఁబోరు పవిత్రభావమే
పోలదు పాపజాతియగు ♦ పోకిరి మూకకు నాప్తబంధువై
జాల సతీత్వము న్వెలకుఁ ♦ జయ్యన నమ్మెడు రో పడంతికిన్
చేలత దాస్యము న్సలిపి ♦ పేరును బెంపును మాపితక్కటా.

పద్మ — మీ రా విషయంబుల నాయెదుటఁజెప్పి లాభము లేదు.

కం॥ తిట్టినఁ దిమ్మినఁ గొట్టినఁ, నెట్టెటు హింసింపనున్న ♦ నే నోర్తునుగా
కిట్టులు మోహించిన సతి, గట్టడిపై తిట్ట నేను ♦ గాంచఁగఁగలనే.

ఉ॥ కోమల సుందరాంగమును ♦ గ్రొన్నెలఁ బోలెడు మందహాసము౯
గామిని కమ్మవాతెరయుఁ ♦ గాంత సరోరుహపత్ర నేత్రముల్
కాముని మోహజాలమునఁ ♦ గప్పెడు నాసతి కిద్ది సాటియే
నేమునుఁగంగ గంగయును ♦ నేవరియింపఁగ రంభ కాదొకో.

ఉ॥ అందము లావిలోకనము ♦ లచ్చరలేమల బోలు జవ్వనం
బెందును గంటలేని మొగ ♦ మింపొనఁగూర్చెడు తేటపల్కులు
న్నెందగు లేతచెక్కులును ♦ వీనులవిందగు నాటపాటలి
ట్లెందును జూడఁగాఁగలమె ♦ యిందునిభాననఁ బాయనేర్తునే.

మీకీ వృధావాగ్వాద మెందులకు! ఇష్టమున్న నీగుడిసెలో కలియో గంజియో త్రాగుచుండుఁడు! లేకున్న నీక్షణమే యింటినుండి తరలిపొండు. వార్ధక్యముతో మీకు మతిపోయినట్లున్నది.

కాంతిమతి — నాయనా! నీ తండ్రిగారికి మతిపోలేదు! నీకే కామాంధకారంబు గన్నులఁ గప్పుటచే మిన్నును మన్నును దెలియకున్నావు. "వినాశకాలే విపరీతబుద్ధిః" యనునట్లు, వినాశంబు సమీపించునపుడు మా పెద్దల బుద్ధులెట్లు పథ్యంబగును? పైత్యరోగికి పంచదారయుఁ జేదుగాదె! కామెర్లతోఁగూడిన కన్నుకు సర్వంబును బచ్చగాఁ గన్పింపదే? అట్లే నీకు సానిసంపర్కమే సర్వలోక సామ్రాజ్యముగాఁ దోచుచున్నది? కాలము దీరిన రోగికి మేలగు నౌషధము లెందు పైకొనునే! కుమారా! నీవంటి యభాగ్యుఁడుండునా? ఇల్లు వాకిళ్ళెల్ల సానిపరంబులుగాఁ జేసితివి. మడులు మాన్యంబులు వ్రాసియిచ్చితివి. ధనధాన్యంబులెల్ల వారాంగనల గృహంబులకుఁ దోలిపెట్టితివి. లక్ష్మీవిలాస మందిరం బీనాఁటికి పెద్దమ్మవారి నట్టిల్లైనది. ధనధాన్యసంపదలతోఁ దులఁదూగు గృహంబున నేఁటి "కన్నమో రామచంద్రా" యని విలపించు కాలము వచ్చినది! వేద వేదాంగ శాస్త్ర కళాకలాపంబులతోఁ బ్రతిధ్వనించు గృహంబు నేఁడు వారవిలాసినీ వర్ణనములతో నిండిపోయినది. నీకింకనైన నేల బుద్ధి జనింపను.

సీ॥ వెంగముపూతలఁజూచి ♦ మోజుగా భ్రమియించి, ధనము ధాన్యంబును ♦ దయనొసంగి
యాటపాటలఁజూచి ♦ యందచందముఁ గాంచి, మడులుమాన్యంబులు ♦ కడునొసంగి
కల్లమాటలు మెచ్చి ♦ కంతుబాధకు నొచ్చి, యిల్లువాకిళ్ళెల్ల ♦ నిచ్చివేసి
బూటకంబులు నమ్మి ♦ బుద్ధిమాంద్యముఁగాంచి, సకల భాగ్యంబులు ♦ సరగనొసఁగి
తే॥ సానికొంపల దాస్యంబుఁ ♦ జాలఁజేసి, యిల్లునొడలును విత్తంబు ♦ గుల్లగాఁగ
దైవమును బిన్నపెద్దలఁ ♦ దలఁపఁబోక, కష్టవార్నిధిఁ గూల్చితే ♦ కమలనయన.

చ॥ కులమును సత్యశౌచములుఁ • గూరిమిఁ బ్రేమయు సిగ్గు నెగ్గులున్
వలపును సద్గుణంబులును • బావనధర్మము శుద్ధశీలముల్
గలుగని భోగకామినులఁ • గంతుశరాళికిఁ జిక్కి కొల్చి యి
ట్లలికులవేణి నాత్మసతి • నాకులపాటొనరింపఁ జెల్లునే.

ఉ॥ జోగులు కుష్ఠబాధితులు • చోరులు దుర్మతు లాతతాయులు
న్రోగులు దుష్టవర్తనులు • రోషవిభీషణ క్రూరకర్ములున్
బాగుగ విత్తమిచ్చినను • బంధురప్రేమను కౌఁగిలిచ్చు నా
భోగపురంధ్రుల న్మఱిగి • పూజ్యసతి న్విలపింపఁజేసెదే.

మ॥ అకటా నీ దురదృష్ట మెందుఁగలదే • యత్యంత పూజార్హయా
సకియ న్బ్రాహ్యసతీమణి న్విడువఁగాఁ • జాలె న్మనంబెట్లు నీ
సకల ప్రాభవ మెల్లభూములును సంస్యశ్యామలంబౌ మడుల్
వికలాత్మ యెటువ్రాసియిచ్చితివి ఛీ! • వేశ్యాసతీ పోషకా.

పద్మ—తల్లీ నీవు నన్ను దూషించిన లాభములేదు. "బుద్ధిః కర్మానుసారిణీ"యనునట్లు నాపూర్వజన్మ పుణ్యపాప సంచయంబును బట్టి యీ జన్మము నడుచుచున్నది. నీవు వేయి చెప్పు! లక్ష చెప్పు! నాబుద్ధి యీవారాంగననుండి మరలనే మరలదు. ముమ్మాటికిని నిజము. నీ వావారాంగన సామాన్యభోగ స్త్రీల వంటిదనుకొందువేమో యట్లుకాదు! లోకములోని పతివ్రత లందఱు దానికాలి కొనగోరునకైనను సరిరారు. నాయీ స్త్రీ దానికి ధారవోసితినని చింతించుచుంటివేమో! నాయీ స్త్రియేగాదు, ఈ భూలోక సామ్రాజ్యమంతయు దానికి ధారవోసినను దానిసుగుణంబులకు విలువకానేకాదు. కాఁబట్టి మీ వృథా కంఠశోషను మానుకొనుఁడు. నేను చేసినట్లంగీకరించి యింటిలోనుండెదరా, ముసలిదయ్యంబు లున్నారుగదాయని యింత పిండమును వేసెదను. లేకున్న తక్షణమే వెడలిపొండు. మాగ్రిహచార మీనాఁటితోఁ బీడవిరగడై పోవును.

విమల—ప్రాణనాయకా! పూజ్యులైన తలిదండ్రులు గంపెడు దుఃఖమున మునిఁగియుండ మీహృదయవిదారకములైన పలుకులచే వారిని నొప్పింపనేల?

సీ॥ చంద్రబింబముఁగేరు • చక్కని సుతుమోము, నొక్కి ముద్దాడంగ • నోమకైతి
పదిపదారేడుల • పసిబాల యర్ధాంగి, నింపుసొంపార చొ•క్కింప కైతి
ప్రేమమీఱెడు తల్లిఁ • బేర్మితోఁ బూజించి, యానందమునుబొంది• యలరకైతి
ముదుసలి తండ్రిని • ముప్పొద్దు సేవించి, పితృవత్సలత్వంబుఁ • బెంపకైతి
తే॥ మడులుమాన్యంబు లభివృద్ధిఁ•బడయవయ్యె, కాసువీసంబు గఱవయ్యెఁ•గష్టమబ్బె
సానికొంపలదిఱుగుటే • సౌఖ్యమయ్యె, సర్వసౌభాగ్యమునుబాసి • చనియెనకట.

చ॥ జనముల దూషణోక్తులకు ♦ నైచితి వాప్తులు బాంధవోత్తముల్
మనకిది కూడరాని పని ♦ మానుమటంచును బుద్ధిజెప్పినన్
వినవు సతీమణిన్ సుతుని ♦ వీడితి వింతయు సిగ్గులేక సా
నిని దరిఁజేరఁదీసి కడు ♦ నిందలపాలయి తక్కటక్కటా.

చ॥ ధనములు వమ్ములయ్యెఁ గడు ♦ దర్ప మహంకృతి గోపమెచ్చెఁ బా
వనమగు కీర్తిచంద్రికకుఁ ♦ బాయని హెచ్చుకళంకమబ్బె శో
ధన గుణముల్దొలంగె బహు♦భంగుల లేమి కలంపసాగె జీ
వన మెటుసాగునో సిరులు ♦ బాసెఁ దొలంగెను సర్వసంపదల్.

ఇంతవఱకు వచ్చినను నీకనైనను వేశ్యాభోగంబులు విడువఁజాలరా! మాకంటెను వేశ్యలు దివ్యలోకసుందరులా!

పద్మ—ఛీ! ఛీ! నోరుమూయుము. ఆ భోగవనితామణి యెక్కడ? నీ వెక్కడ? నక్క యెక్కడ? దేవలోకమెక్కడ? హస్తిమశకాంతర భేదమున్నది.

ఉ॥ మాసినచీరఁగట్టి కడు ♦ మౌనముఁదాల్చుచు మాటలాడినన్
మోసమువచ్చునంచు భయ♦మున్ననుసిగ్గును దాల్చుచుందువ
భ్యాసముచేత సంతతముఁ ♦ బాటల నాటల మెప్పుఁగూర్చు నా
భాసుర భోగకాంతకును ♦ వత్తురె సాటి సహస్రజన్మలన్.

సీ॥ నీ కఠినోక్తులా ♦ రాకేందు బింబాస్య, స్వాదువాక్కులతోడ ♦ సమములగునె
నీ భయంకరరూప ♦ మాభామిని మనోహ, రాకారము విధాన♦నందమగునె
నీ పాడువక్త్రమా ♦ నీరేజదళనేత్రి, ముఖచంద్రసామ్యంబుఁ ♦ బొందనగునె
నీ మౌఢ్యజాడ్యంబు ♦ లామాననీమణి, నిఖిలవిజ్ఞాన స♦న్నిభములగునె
తే॥ హీనజాతికిఁ జెందిన ♦ యింతి యగుతఁ, గులము కీర్తులు వోయినఁ ♦ గొదువ లేదు
కలది వెలయాలె యగుఁగాక ♦ వీడఁజాల, నా మనోహారి నెడఁబాయ♦నాకుఁదరమె.

ఉ॥ ఆదరహాసచంద్రికలు ♦ హాస్యవిలాసపు ముద్దుబల్కులున్
ఆ దివిజాంగనామణుల ♦ యందముఁ గ్రిందొనరించు చందమున్
యాదరభావమున్మదిని ♦ హత్తుకొనెన్ వినుమందు నేదియున్
నీ దరికానవైతి తరు♦ణీ నిను వీడిన కారణం బిదే.

విమల—మనోనాయకా! మా సౌఖ్యంబులు మంటఁగలసిపోనిండు! మీరు సౌఖ్యంబుగానుండుటయే నాకుఁ గావలసినది! కాని యీ దుఃఖసముద్రమును దాటింపరా! మీ కుమారుఁడు! ఏకైక పుత్త్రరత్నము! వంశదీపకుఁడు! మరణావస్థయం దున్నాఁడు! వానియెడనైన నాదరముజూపి వాని బ్రతుకుతెరువు లాలోచింపవలదా? ఇప్పటికిఁ బదునైదుదినంబులనుండియుఁ బ్రలాపసంధిచే బాధపడుచున్నాఁడే! వానిపై నైనను మీకుఁ గరుణరాదా! మీ రెక్కడ దిరుగుచున్నను షోడశకళాపరిపూర్ణంబగు చంద్రబింబమువలె శోభాయమానం

బగు నీ ముద్దుకుమారుని ముఖమండలంబు వీక్షించుచు నా సంతాపంబుల మఱచెదను.

పద్మ—పిల్లవాఁడు పిల్లవాఁడని పడియేడ్చెదవేమి? వాని వ్రాత యెటులుండిన నట్లు జరుగును! ఏవో నగలు చాలా బెట్టినావే! [అని మెడలోఁజేయివేసి నగలు దెంపుకొని నాల్గుకొట్టి పాటిపోవుచు] చావుముండా! నీవు చచ్చినచో నీ యాస్తి నా ప్రియునికి వ్రాసియిత్తును! ఇంతవఱకు నా మనోహారిణి నాకై నిరీక్షించుచుండును. వేగ నామె సందర్శనంబునకుఁ బోవలెను.

## షష్ఠమరంగము

[సరస్వతి మగవేషంబున నలుగడలను బరికించుచు]

సరస్వతి—మధుసూదనా! మనోనాయక!

చ॥ తిరిగితి నెల్లదేశము ల • దేపనిగా నెటుజూచివచ్చినన్
గరుణయొకింత బూనిననుఁ • గౌఁగిలిఁజేర్పఁగరా వదేమి నా
నెరసు లకాంచఁగానగునె • నేఁబెరదాననె ప్రోవరాదొకో!
బిరబిర వీరమూర్తి వలి • వేణుల నేచుట ధైర్యసారమే.

సీ॥ నవమోహనాకార • నవ్యమంజులభాష, దర్శనంబొసఁగవే • ధన్యనగుదు
సుందరవదనార • విందభాసురగాత్ర, కనులకుఁదోఁపవే • కన్నమిత్తు
సకల సద్గుణధామ • సర్వశాస్త్రాభిజ్ఞ, పలికిభాషింపవే • భక్తిఁగొలుతు
నిఖిల సద్గుణజాల • నిర్మలశుభగాత్ర, కౌఁగిలి యొసఁగవే • కదలివత్తు
తే॥ నెచటదాగినవాఁడవో • యెఱుఁగరాదు, సేతుశీతలనగమధ్య • భూతలంబుఁ
గంచుకొంగడా వెదకినం • గంటఁబడవు, దైవమా! యెంతపాపినో • తలఁపరాదు.

చ॥ తురకలు నన్నుఁబట్టుకొని • తోఁకొనిపోవఁగ నడ్డి యడ్డమై
కరుణను నాదు ప్రాణములఁ • గావఁగఁబోరుచుఁ దీవ్రవేదనన్
బొరలితి వంత నాపయిని • పోరువిధం బది యేమియయ్యెనో
యెరుఁగను భూతలంబునను • నెక్కడనుంటివొ లేకపోతివో.

సీ॥ వైద్య శాస్త్రములందు • వన్నెగాంచఁగ నాకు, నుత్సాహమునుగూర్చి • యుండినావు
తెలియని విషయము • ల్దేటతెల్లముగాఁగ, విషయంబుబోధించి • వెలసినావు
తృణము గొప్పగఁజేసి • తెల్వితేటలుజూచి, యనురాగమునుజూపి • యలరినావు
మంకువేషముసైచి • పెంకెమాటలనోర్చి, గౌరవంబునుగూర్చి • మీఱినావు
తే॥ ఆపదలు నన్ను నలమంగ • నాత్మరక్ష, సరకుసేయక పోరాడఁ • జాలినావు
అట్టి మహనీయు నిన్ను నా • యాత్మనాథుఁగను వరింపంగఁగోరెదఁ • గంటఁబడవె.

సీ॥ ఓమహీజములార • యో లతామణులార, నా నాథుఁగంటిరే • నవ్యమతిని
ఓ మహీధరులార • యోవనచరులార, మధుసూదనుని జాడ • మాకుఁజూపుఁ

జో పుణ్యసతులార ♦ యో మునివరులార, నా మనోహరుఁగాంచి ♦ నారలయ్య
రో భిల్లవరులార ♦ యో కాననములార, మీకంటఁబడియెనే ♦ మిహిరతేజుఁ
తే॥ డెట్టి కాననములడాగి ♦ యెట్టిగుహలఁ,బట్టి కృశియించుచుండెనో ♦ యెట్టు తెలియు
నెట్లు వెదకుదు విరహంబు ♦ నెట్లుసైతుఁ, గటకటా దైవ మీభంగిఁ గష్టపెట్టె.

సీ॥ కుడిచికూర్చుండక ♦ కులకట్టులనుద్రోసి, విద్యపేరున నిల్లు ♦ వెడలనేల.
జాతిమతంబుల ♦ నీతిశీలము వీడి కానివారల ప్రేమఁ ♦ గాంచనేల
బ్రాహ్మణౌన్నత్యంబు ♦ భంగపాటొనరించి, తురకస్నేహముజేసి ♦ త్రుళ్ళనేల
మాధవి ననువీడి ♦ మారుత్రోవనుబట్ట, దేశద్రిమ్మరినయి ♦ తిరుగనేల
తే॥ నెల్లదేశంబు దిరిగిన ♦ నెచటనైన, నామనోనాథు జాడయే ♦ నాకుఁదోప
దెటులతాళుదు విరహంబు ♦ నెట్టుసైతుఁ, గటకటా దైవమీభంగిఁ ♦ గష్టపెట్టె.

సీ॥ కామించి ప్రేమించి ♦ కౌఁగిలివ్వనటంచుఁ, గోపింపన్యాయమా ♦ కోమలాంగ
ద్వేషించి నోనాడి ♦ విడనాడెననియెంచి, యాగ్రహింపఁగ మేలె ♦ యతనురూప
పరులపైఁ బ్రేమంబుఁ ♦ బఱపెఁజంచలయంచు, బాధింపభావ్యమా ♦ పద్మనేత్రి
తురకయింటనుజేరి ♦ చెరఁబోయెననిచూచి, ద్వేషింపసరియౌనె ♦ వీరవర్య
తే॥ ప్రేమభైక్ష్యము నడిగినఁ ♦ బ్రీతిలేక, త్రోసిపుచ్చెనటంచు నన్ ♦ ద్రోతువయ్య
కీడుజేసినవారికిఁ ♦ గీడు చేతఁ, న్యాయమగునయ్య రక్షింప ♦ నరయవయ్య.

ఉ॥ నీ సుగుణంబులు న్విమల ♦ నీతిచరిత్రము నీదు ప్రేమయున్
నీ సుకుమారదేహమును ♦ నీ మృదుమాధురి జిల్కుపల్కులున్
నీ సుమబాణరూపమును ♦ నీదుశుచిస్మిత మానసాబ్జమున్
నీ సరసంపుఁబల్కులును ♦ నే నెటు నెమ్మది విస్మరించెదన్,

సీ॥ ఏ చంద్రబింబాస్య ♦ యింపుతో నినుగూడి, మదనసామ్రాజ్యసం ♦ మ్మాన్యయయ్యె
నే కోమలసుభాంగ ♦ యేరికోరివరించి, క్రీగంటిజూపులఁ ♦ గేరుచుండె
నే లతాలలితాంగి ♦ యింపుసొంపులఁగూడి, బాహువల్లరుల చేఁ ♦ బట్టికట్టె
నే కోకిలాలాప ♦ యేర్పాటుమైజేసి, మధురభాషణల మై ♦ మరచియుండె
తే॥ నేనుకోమలిపెండ్లాడి ♦ హెచ్చుమీఱ, మోహతాపంబుదీర్చుచు ♦ మురియుచుండె
నట్టిభాగ్యంబు నాకింక ♦ నెట్టుగలుగుఁ, గటకటా దైవ మీభంగిఁ ♦ గడకుఁద్రోచె.

సీ॥ సరససల్లాపంబు ♦ సలిపెద నెవనితో, నీవులేకున్నచో ♦ నిర్మలాంగ
ముద్దుముచ్చటల చే ♦ మోదింతు నెవనితో, నీవులేకున్నచో ♦ నిర్మలాంగ
మందహాసముల నా ♦ నందింతు నెవనితో, నీవులేకున్నచో ♦ నిర్మలాంగ
చదువు సంధ్యలలోన ♦ మదిగూర్తు నెవనితో, నీవులేకున్నచో ♦ నిర్మలాంగ
తే॥ సుగుణగణముల సరిలేని ♦ సుందరాంగి, రూపురేఖలఁ దులలేని ♦ లోలనయన
యనెడు బిరుదులనందెద ♦ నవని నెట్లు, నీవులేకున్న నింక నో ♦ నిర్మలాంగ.

మ॥ సదయా దాపఁగనేల నిన్ గినిసి నీ ♦ సాధుత్వమునోర్చి నీ
మది నారాటముఁగూర్చి ప్రేమలతలన్ ♦ మర్దించి దుష్ప్రాప్తమై
తుదినేదిక్కును లేక నీదుపదముల్ ♦ దోషంబున న్వీడితిన్
మదిఁబూజించెద ప్రేమదానమిడవే ♦ మర్యాద గాపాడుమా.

చ॥ కటకట మోహతాపమును ♦ గంతునిశాంత శిలీముఖోద్ధతిం
ఎటువలెఁ దాళుదాననిఁక ♦ నెట్టులనోర్చెద నీ వియోగముల్
జటులతరంబుగాఁ గుసుమ♦సాయకవహ్ని దహింపఁజొచ్చె న
న్నిటు కఠినాత్ముఁడై విడిచి ♦ హింసయొనర్చుట మేరగా దిఁకన్.

మ॥ కరుణాసాగర నన్ను నిట్లు వెతలం ♦ గారింపఁగా న్యాయమా
సరసంబా యిటు ప్రేమలేక విడువం ♦ జాతుర్యమా నీమమా
మరుగోలల్ నను బుంఖపుంఖములుగా ♦ మర్దింపఁగా సాగె నీ
మరుగు న్జొచ్చితి దోసిపుచ్చుకు సుమా ♦ మర్యాద కాపాడుమా.

చ॥ అడవులఁ జిక్కినావొ కడు ♦ నాకలిడస్సి కృశించినాఁడవో
యిడుమల సంకటంబుల న♦హీనగతి న్వెసదాటినాఁడవో
పడతులు మోహపాశమునఁ ♦ బట్టి యనంగుని రాజ్యసౌఖ్యముల్
గుడువఁగఁజేసిరో యకట ♦ కూరిమియెల్ల స్మరింపకుంటివో.

చ॥ కడునిశితంపుబాణములు ♦ కంతుఁడు వేయఁదొడంగెనయ్యొ నా
పడిన శ్రమంబులన్నియును ♦ వ్యర్థములై తుదముట్టనయ్యె నే
యెడఁ గనుగొందు నిన్ను నెటు ♦ లింపెసలారగఁ గౌఁగిలించి యా
గడుసరి మాయమన్మథుని ♦ ఘాతకుఁ దప్పుకొనంగఁజాలుదున్.

## స ప్త మ ర ం గ ము

[మధుసూదనుఁడు నలుదిక్కులు వెదకుచుఁ బ్రవేశము]

సీ॥ నవమోహనాంగి నీ ♦ నవ్యమంజులభాష, వీనులువిందుగా ♦ వినఁగనైతిఁ
గలకంఠి మృదులమౌ ♦ గానామృతంబును, దనివిదీరఁగ నేను ♦ ద్రావనైతి
నరుణబింబాధరీ ♦ యధరసుధారసం, బల్లారు ముద్దుగా ♦ నాననైతి
సుమకోమలాంగి నీ ♦ సుందరంబగు మోముఁ, గాంచి ముద్దాడి నేఁ♦గ్రోలనైతిఁ
తే॥ బళిర బంగరుబొమ్మయో ♦ పద్మనేత్రి, మదనసామ్రాజ్యమేలుచుఁ♦బొదలనైతి
నన్నివిధముల దుఃఖంబు ♦ లందుచుంటిఁ, బ్రేమజూపుచు వేరమ్మ ♦ కోమలాంగి!

సీ॥ కోపమా నామీఁదఁ ♦ గోమలాంగిరో నీకు, ముద్దాడలేదని ♦ ముచ్చటగను
దాపమా నాపైని ♦ దన్వీశిరోమణి, బాహువల్లికల చేఁ ♦ బట్టనంచు
నాగ్రహంబా నీకు ♦ నీతనుతాపంబును, దీర్పలేదని నీకు ♦ దివ్యకాంత
శిక్షయాయిదినాకు ♦ శీతాంశుముఖినిన్ను, విడిచిపోయితినని ♦ వెరినగుచు

తే॥ బాధలాయివినాకు నో ♦ పద్మగంధి, యతను తాపంబుదీర్పని ♦ యలకవలనఁ
దప్పుసైరించి కావు మో ♦ తలిరుఁబోఁడి, నిన్ను విడనాడఁ దగ్యంబు ♦ సన్నుతాంగి

ఉ॥ అన్నులమిన్న నే నెప్పుడు ♦ నన్యసతీమణిఁ గోరలేదు గా
సన్నుత కోమలాంగి నినుఁ ♦ జాలముదంబునఁ గోరియుంటిఁ గా
నన్నిటు మోహవారినిధి ♦ న్యాయమె ముంపఁగఁ గన్యకామణీ
యెన్నఁడు నీ ముఖాంబురుహ ♦ మింపుగలిర్పఁగఁ గాంతుఁ జెప్పవే.

ఉ॥ ఏటికి విద్యకై ధనము ♦ హెచ్చుగ దుర్వ్యయముం బొనర్చితిన్
ఏటికి నా మనోహరిని ♦ నెంచివరించితి నాత్మయుందునన్
ఏటికి నా తలోదరియు ♦ నీప్సితముల్సమకూర్పరాదు నా
కేటికి నష్టకష్టము లి ♦ కెట్టులు ద్రెంపుదు మోహపాశముల్.





# అభినవసరస్వతి

## చతుర్థాంకము

### ప్రథమరంగము

[మాధవుఁడు బొంబాయిరాజ్యమునఁ గలక్టరుపదవియందు బంగాళాలోఁ బని జేసుకొనుచుండును]

డఫేదారు—ఒక పేదమానవురాలు తమదర్శనంబునకు వచ్చినది. ఏమో చెప్పుకొనవలెనఁట; దిక్కులేనిదఁట.

మాధ—ప్రవేశపెట్టుము.

డఫే—చిత్తము. (వెడలిపోవును)

[ప్రవేశము ప్రభావతి యామెకుమారుఁడు కృష్ణరావు]

మాధ—అమ్మా! నీవెవరు.

ఉ॥ ఎక్కడిదాన వెం దునికి ♦ యెవ్వరు నీతలిదండ్రు లాప్తులున్
ఇక్కడి కేలవచ్చితివి ♦ యేలవియోగభరంబు నొంద ని
న్నెక్కడఁజూచి నేనెఱుఁగ ♦ నేల ననున్గనఁ గార్యమేమి ని
న్మక్కువ నాదరించఁగను ♦ నాథుఁడు బంధులు నాప్తు లుండరే.

ప్రభా—(నమస్కరించి) అయ్యో! తామెవ్వరో నేనెఱుంగుదు! ఈ దుఃఖభాగిని చరిత్రంబు మనవి జేసినచోఁ దాము జాలి జెందెదరో లేక కాఠిన్యము వహింతురో నేనెఱుంగను! నాపేరు ప్రభావతి. నాయత్తమామలు విష్ణురావు హైమవతి యనువారలు. మాకాపురము చెన్నరాజధాని యందు గుంటూరు జిల్లా! నాభర్త మాధవరావు! ఈ పిల్లవాఁడు నాకుమారుఁడు కృష్ణరావు.

మాధ—ఏదో బిచ్చమెత్తుటకు వచ్చినదానవు నీచరిత్రంబు మాకేందులకు. ఏదోధర్మమిచ్చెదను. తీసుకొని వెడలిపొమ్మ.

ప్రభా—అయ్యా!

తే॥ తిరుపమెత్తంగ రాలేదు ♦ తిండిలేక, మరణమొందెడు వారలు ♦ ధరణిఁగలరొ
పుడమిఁ బుట్టించు దేవుండు♦పోష్యమొసఁగ, శక్తిగలవాఁడు గాఁడొకో♦సాధుశీల.

నేను బిచ్చమెత్తుటకు మీయొద్దకు రాలేదు! ప్రేమభిక్షుకఁగూడా రాలేదు! భారత దేశంబున నావంటి దిక్కుమాలిన యభాగ్యులకు బిచ్చము వేయు మహా మహు లనేకులున్నారు! నేను నాచరిత్రంబుఁ దమకు విన్నవించుటకే వచ్చితిని. తమ యధికార ప్రాబల్యంబుచే నన్ను మీరింకను జిక్కులు బెట్టవచ్చును! లేనిచో సత్యముగ్రహించి, సర్వేశ్వరుని యాజ్ఞలకు బద్ధులై నను జేపట్టినను జేపట్టవచ్చును. నాప్రాణనాధుఁలైన మీకు నాసర్వవృత్తాంతమును విన్నవించు టవశ్య కర్తవ్యంబు.

సీ॥ అత్తవారింటను ♦ నడుగుబెట్టిననాఁడు, కౌఁగిలించినయట్టి ♦ కరుణ యేది
ఇంగ్లండు పయనంబు ♦ నింపుసాగింపుచో, విడనాడనను బాస ♦ ప్రేమ యేది
కన్నసంతానంబు ♦ గాంచువేడుకజూపి, వ్రాసినలేఖల ♦ ప్రతిభ యేది
దిక్కుమొక్కును లేక ♦ దీనత్వమును జెంది, ప్రాణనాయకిమీఁద ♦ భావ మేది
తే॥ నిద్రజెందితో! మరచితో! ♦ఝుమ్రలంచుఁ, బారఁదోలఁగఁ దలఁచితో!♦వైభవంబు
కనులఁగప్పెనో యాంగ్లేయ♦కాంతవలనఁ, గష్టములుగల్గుననియెంచి♦కాంచవైతో
కారణంబేమి పరులమే ♦ కరుణరాదె.

మాధ—నీకు దయ్యము పట్టినదా! లేక పిచ్చియెక్కినదా? యున్మాదినివలెఁ బ్రేలు చున్నావేమి.

చ॥ కలగనుచుంటివో యబల ♦ గాకనను న్మరపింపనెంచెదో
చలనము నొందెనో మనసు ♦ సత్యపథంబును వీడి తిర్గెదో
యిల నిటువంటికల్పితము ♦ నేల సృజింపఁగ నమ్మఁబోలునే
ఫలితముగల్గునే పరుల ♦ వంచనసేయుదె! యింతమోసమే.

ప్రభా—మీరెంత యధికారులైనను నాప్రాణేశ్వరులు గాకపోరు! ఈచిన్నకుమా రుఁడు మీ పుత్రుండుగాకపోఁడు! మీరు విదేశవాసంబున నున్నపుడు, మీ జననీ జనకులు మీవియోగ దుఃఖం బనుభవింపఁజాలక స్వర్గతులైరి. మీరాంగ్ల దేశంబున నాంగ్లవనితల తగులంబులందగిలి, సొమ్ముఁ బంపుమనినప్పుడెల్ల నప్పు నొనరించి సొమ్ముఁబంపి, ఋణదాతల హస్తంబులం జిక్కి యాస్తియంతయుఁ బోఁగొట్టుకొని, మీరాంగ్లవనితను బెండ్లియాడితిరనివిని, మీరీ దూరదేశంబు నకుఁ దిరిగి వచ్చెదరను నాసలేక, దుర్భర దుఃఖంబున గుండెపగిలి మామగారు పరలోకంబున కేగిరి. అంతకుమున్నే మీతల్లి మీవియోగంబుచేఁ గాయంబుఁ బాసె. వారియనంతరంబున నాయాస్తి ఋణదాతల కప్పగించి, పుట్టింటివా రింక తకుమాన్నే గతించుటంజేసి, దిక్కులేనిపక్షినై యల్లాడుచు, దేశదేశంబులుదిరిగి యీయర్భకుని రక్షించుచు, మిమ్మన్వేషించుచుంటి! మీ యిప్పటి మహోన్నత

స్థితియందును, నాయిప్పటిదైన్యావస్థనుఁబట్టియు, నీ యభాగ్యురాలు మీ భార్యయని చెప్పుకొనుటకు మీకు ధైర్యము లేకపోవచ్చును. నవమాసములు గర్భముతోనున్న మీభార్యను మీరు వదలి విదేశంబుల కేగునపుడు, కాళ్ళపైఁబడి వలదని మొత్తుకొన్నను వినక పరస్త్రీలపై వ్యామోహంబు జెందనని మీరొనర్చిన ఘోరప్రమాణంబులన్నియు మఱవవచ్చును. మీకు వివాహమే కాలేదనిగాని, వివాహమైనను బాల్యంబుననే మీభార్య మరణించినదనిగాని యాంగ్ల వనితామణులను మోసముఁజేసి వారలఁ జెట్టఁబట్టి యుండవచ్చును. నేనును నాకుమారుఁడును బ్రాణంబులతో నుండుటయే మీకుఁ గంటకంబుగా నుండవచ్చును. కాని లోకాధినాథుండైన పరమేశ్వరుఁడు ప్రపంచంబుఁ బాలించుటలేదా? దయాధర్మసత్యంబులు తమవంటి విద్యావంతులు గమనింపనిచో నీ లోకంబున ధర్మంబు నిలువఁగలదా! అష్టైశ్వర్యంబులను రూపుమాపుకొని, బంధుజాలంబునంతయు దిగఁద్రోచి చూడఁ జుట్టంబును మ్రొక్కఁ దైవంబును లేక, దుర్భరక్షుధాభారంబున మ్రగ్గుచున్న మీ యర్ధాంగిమీఁదను కుమారరత్నంబుమీఁదను నిట్టి యాగ్రహంబుఁ జూపవచ్చునా? నాకు దయ్యము బట్టెననియు, నే నాడునవి యున్మత్తప్రలాపంబులనియు నీ రోజునఁ ద్రోసిపుచ్చినచో రేపు పరమేశ్వరుని యెదుట మన ముభయులము నిలువఁబడినపుడుగూడ, పరమేశ్వరునికంటఁ గారముఁజల్లి మోసగింపఁగలరా! ఈ యల్లారుబిడ్డఁడు పుట్టినదాదిగాఁ దండ్రిని జూచిన పుణ్యంబుఁ గట్టుకొనలేదే!

సీ॥ తల్లిదండ్రులముందు ♦ తగుబాంధవులముందు,గళమున నూత్రంబు ♦ గట్టియుండి
అగ్నిసన్నిధియందు ♦ నధ్వర్యులెదుటను, వేదప్రమాణము ♦ ల్వేగఁజదివి
కామభోగములందుఁ ♦ గాంక్షదీరఁగఁగూడి, సంతానమునుగాంచి ♦ సౌఖ్యమంది
చదువుసంఖ్యలటంచుఁ ♦ జాలమోసముజేసి, కలవిత్తమెల్లను ♦ ఖర్చుపెట్టి
తే॥ యాంగ్లవనితను బెండ్లాడి ♦ యన్యదేశ,మందు నుద్యోగమునుజెంది ♦ మభ్యబెట్టి
భార్యబిడ్డయు వెతజెందఁ ♦ బాపమనవు,కర్మఫలమిది నిను దూరఁ♦గలదె ఫలము.

నా దురదృష్ట మిట్లు మండిపోయినది పోనిండు! ఆ కన్నులు దెఱువని పసికూనపై నేల మీకుఁ గరుణరాదు. ఆ పసికందు నా గర్భమం దున్నపుడు మీరు విదేశంబుల కేగుచుఁ జేసిన ప్రమాణములన్నియు మఱచియుందురని నేను నమ్మఁజాల! తొల్లి దుష్యంతుఁడు రాజ్యమదాంధకారంబునఁ దనప్రాణేశ్వరియైన శకుంతలాదేవిని వంశోద్ధారకుఁడైన భరతుని నవమానించి యావలఁ ద్రోఁచినట్లు మీ యధికార ప్రాబల్యంబున మమ్ము విడనాడి పరాభవంబొనరించి వెడలఁగొట్టవచ్చును. మీరు మమ్మెఱుంగమని యసత్యంబుఁ బల్కవచ్చును. మీ యధికారంబు దీనులను రక్షించుట కుపయోగపడవలయును గాని దిక్కుమాలినవారి మఱింత క్షోభపెట్టుట కుపయోగింపఁజనదు. ఇపుడు

మీ రాంగ్లవనితామతల్లితో సంసారభోగంబు లనుభవించుచున్నారని నే నెఱుంగుదు. నన్ను మీ యర్ధాంగిగాఁ గైకొనవలయునని నేను మి మ్మర్థింప రాలేదు. అప్పునఁ గొట్టినట్లు సుగుణగణంబులందును, రూపరేఖావిలాసాదుల యందును, మి మ్మనుకరించెడి నీ బాలుని స్వీకరింపుమని వేడుటకే వచ్చిన దానను.

తే॥ ఆంగ్లవనితలపాదాబ్జ ♦ మమరఁగొల్చి, భూసురులకన్యఁబోఁద్రోచి♦ పొంగియున్న
గర్భవాసంపుపంటనీ ♦ కన్నకొడుకుఁ,గాంచియుప్పొంగి పెంపుమా ♦ కరుణశీల.

మాటలు వచ్చినదాదిగాఁ దండ్రిని జూపుమని నన్ను వీఁడు నిర్బంధించు చుండ, మీ కొఱకు వెదకి వెదకి వేసారి యిటువచ్చితి. మీ యర్ధాంగి ప్రిభావతిపైనున్న పూర్వపు టనురాగంబు భగ్నంబైనది. కానిమ్ము. ప్రిభావతి స్థానము నాంగ్లవనితామతల్లి పూర్వపుణ్యవశంబున నాక్రమించినందులకు నేను జింతింపను. కాని సంపూర్ణపూర్ణిమాచంద్ర సదృశంబగు ముద్దు మోముతో విలసిల్లు నీ పసిబాలు నంకపీఠంబునఁ జేర్చి నా హృదయపరితాపంబుఁ జల్లార్చుము.

కృష్ణా! ముద్దుకుమార!

తే॥ అమ్మ! తండ్రినిజూపింపు♦మనుచుఁగోరి, చాల యలసితివోకుర్రి ♦ మేలుగూర్చు
జనకుఁడాతండె వెసఁజేరి ♦ సన్నుతించి, దండమొసఁగుము ప్రణమిల్లు♦తండ్రికిపుడు.

తే॥ చంద్రిరాకను జీకటు ♦ ల్సమసినట్లు, సూర్యకాంతిచే హిమరాశి ♦ చెదరినట్టు
లలచికలఁచిన దుఃఖము♦ల్తొలఁగిపోయెఁ, దండ్రిపదముల మ్రొక్కు—మో♦ధన్యచరిత

కృష్ణ—తండ్రీ! నమస్కారము! [అని మ్రొక్కఁగా బూటుకాలుతో నతనిని బడఁదన్న దెబ్బతగిలి యతఁ డేడ్చుచుఁ బ్రిభావతియొద్దకు రాఁగా నామె యెత్తి ముద్దాడి గౌరవించును.]

రాధ—ఛీ! ఛీ! అవతలకుపొమ్ము! Stupid నీవెవతెవు! నేనెవడను! get away! you rascal!

ప్రిభా—(గంభీరస్వరంబున)

చ॥ కటకట! కన్నపుత్రికుని ♦ గాలునఁదన్నెడిద్రోహి యుండునే
తటుకున భార్యవీడి పర♦తన్విశిరోమణిఁ జెట్టఁబట్టుచున్
జటుతరమైనధర్మములు♦బంధురప్రేమయు మంటగల్పుచున్
గుటిలమతిన్ విదేశముల♦కుం జని నేర్చిన శీలమిద్దియే.

ఉ॥ బాలుఁడు తండ్రితండ్రియని ♦ పల్మరు శోకముతోడ నేడ్చు నే
వేళను నీదునామము నె ♦ జేపఠియించుచు నుండుఁగాని తాఁ
గూళలఁగూడఁబోఁడు ♦ పెరకొంపల దుష్టులమైత్రి జేయఁ డీ
బాలునిగాలఁదన్న నెటు♦వచ్చె మనంబు నెఱుంగ జెప్పుమా.

చ॥ సతులను గారవించి బహు•సన్నుతిఁగాంచుచు వేడ్కతోడ సం
తతిఁగని వారి ప్రేమమెయిఁ • దాలిమిఁ బెంచుచుఁ బెద్దఁజేసి సం
స్తుతిఁగనునట్లు విద్యలును • శుద్ధచరిత్రముఁ గాంచునట్లుగా
మతి జరియింతురిగాక యిటు•మానక తన్నుదు రయ్యబిడ్డలన్,

ఉ॥ తల్లిని వీడలేదు తన•తండ్రికిఁ గీడును గోరలేదు తా
నుల్లమునందుఁ గ్రూరుఁడయి • యుద్వహమాడిన భార్యవీడఁ డే
ప్రల్లదమాచరించెఁ దగ•వా సుతునక్కనఁ జేర్ప కీగతిన్
జెల్లునె ద్రోసిపుచ్చగను • జేసినపాపము గట్టిగుడ్పదే.

మాధ—అమ్మో! పిశాచమువలెఁ బట్టుకొని విడువకుంటివేమి? అడుదానవని కరుణించి యుంటినిగాని యింకొకరైనచో నీ తుపాకితోఁ బ్రేల్చియుందును, ఛీ! ఛీ! వెడలిపొమ్ము. నీవెవ్వతెవో నేనెఱుంగ, నీకును నాకు నెట్టి సంబంధమును లేదు! నీభర్తయైన మాధవుఁడింకెవ్వఁడో యైయుండనోపు! శీఘ్రమే మరలిపొమ్ము!

చ॥ నడునడు మిట్టినీచములు • నాయెదుటన్బలుకంగ న్యాయమే
కడుఁగడు వెర్రిదానవయి • కష్టములందును మున్గియుంట చే
బుడిబుడి యేడ్పుతో మనసు • బుద్ధియుమాన్పఁగ నెంచినావా నీ
చిడిముడి మాటఁగట్టుమిఁకఁ • జేయుము నీ గృహ మంబుజాననా

ఉ॥ తిండికి లేనిచో నడుగు • తీర్చెద నీదు మనోరథంబులన్
బండగునట్టి కాపురముఁ • బాడొనరించుచు దేశద్రిమ్మరై
యెండను వానలన్దిరుగ • నేటికి నీగృహమందుఁజేరి నీ
యండను బ్రోవు నీదుసుతు • నాతఁడె తీర్చెడు నీదుకష్టముల్.

చ॥ పరపురుషాళిఁజూచి కడు•భక్తి భయంబులుఁవీడి మానమె
ట్లరుదుగవీడి నాథుఁడని • యర్భకుఁజూపి కుమారుఁడంచు నీ
దురితముఁగప్పిపుచ్చెదవు • దుష్టచరిత్రవు నిన్నుఁగాంచఁగన్
వరలును పాపపుంజములు • వక్రచరిత్రవు పొమ్ము పొమ్మికన్

ఉ॥ ఎక్కడ చెన్నరాజ్యమది • యెక్కడ బొంబయి రాజధాని నీ
విక్కడి కేగుదెంచి నను•నింపుగ నీహృదయేశుఁడంచు న
న్నెక్కులు దూషణోక్తులను • వేదనపాలొనరించి నావుగా
యక్కట యిట్టి వాక్యముల • నాదరణంబున విందురే జనుల్.

ఛీ! ఛీ! అవతలకుపొమ్ము వెళ్ళెదవా? లేక పాదరక్ష ప్రయోగము గావలెనా?

ప్రభా—ప్రాణనాథా! యింతకన్నఁ దమరెక్కువ మర్యాదఁజూపెదరని నేనిచటకు రాలేదు! అధికార ప్రాబల్యంబున దిక్కులేని యనాథపక్షిని నన్ను ద్రోసి వేయవచ్చును; విదేశ కన్యకామణీ మోహాతిరేకంబున, మీ భార్యా భర్తల

యనురాగంబునకు నేను బ్రక్కలో బల్లెమై యుందునని నన్ను విడనాడవచ్చును! నాపాపకర్మఫలంబున నా పుట్టింటివారు నత్తింటివారును గతించుట చేతను, మీరు వేఱొక రాజధానియందుండుట చేతను మీరు నన్నెఱుంగనని యనృతమాడి నన్ను ద్రోసివేయవచ్చును! కాని యిధము శుభమెఱుంగని యీ చిన్నారి పసికూనను ద్రోసిపుచ్చవచ్చునా? మీరింగ్లండున కేగునపుడు నేను సంపూర్ణ గర్భవతినై యుండుట మీరెఱుంగరా! అటుపైని మీకుఁ బుత్రుఁడు జన్మించెనని వ్రాయ మీరా బాలునకు శ్రీకృష్ణనామంబుఁ బెట్టుమని వ్రాయలేదా? అటుపైని 2,3 సంవత్సరములు మీ క్షేమసమాచారంబులు మాకుఁ దెలుపలేదా! మీరా విదేశకన్యకామణితగులంబున జిక్కినతరువాతగదా మమ్ము మఱచినది! మీ భార్యాభర్తలిరువురకు వియోగంబుఁ గల్పించుట నాతాత్పర్యంబుగాదు. కాని మీవంశోద్ధారకుడైన మీ ప్రియపుత్రుని ముద్దాడి యతని గౌరవంబునిలిపి మీరు జనకుఁడని గౌరవంబు బొందుఁడు. మీకుమారుని మీరు గైకొన్నచో నా నెత్తిపై బరువుదీరిపోవును? అంత నేనూతినో గోతనో బడి బలవన్మరణము నిశ్చింతగాఁ బొందెదను! అంత మీరును నాయాంగ్ల వనితయు నిశ్చింతగా నానందవారాశి నోలలాడవచ్చును! ఈ పిల్లవానిని సంరక్షించుట కింత కాలము జీవించియుంటిగాని లేకున్న మీ పునర్వివాహ మహోత్సవానంతరమే నేఁబరలోకంబున కేగి యుందును. నేను జెప్పినదెల్ల కలయో కల్లయో లేక సత్యవాక్యంబులో యీ యుత్తరంబుల వలనఁ దెలిసికొనుఁడు. నిక్కంబుగా నిద్రించువానిని మేల్కొలుపఁగలముగాని, కపటనిద్ర నటించు వానిని రణభేరియు మేల్కొలుపఁజాలదు. [అని యొక యుత్తరంబుల కట్ట నీయఁగా యుత్తరంబులను బరిశీలించి నిప్పుపుల్లతో వెలిఁగించి వానినన్నియు దహించివేయును.]

మాధ—అమ్మా! యిప్పుడు తగినశాస్తియైనదా! నే వ్రాసిన యుత్తరంబులెల్ల నాభస్మ రాశిలో నున్నవి! ఇఁక నీబిడ్డను దీసికొని యవ్వలకుఁ బొమ్ము! లేకున్న గెంటించివైచెదను!

ప్రభా—క్రూరహృదయా! నీకేల కరుణగలుగదు! ఉత్తరంబులను భస్మమొనరించిన మనము భార్యా భర్తలము గాకుందుమా! పంచాంగంబులను జింపివేసిన గ్రహంబులు గతులు దప్పునా? సూర్యచంద్రాది నక్షత్రంబులు మనవివాహంబునకు సాక్షులుగారా? తొల్లి వివాహంబున నరుంధతీ దేవిని జూపి మనమొనర్చిన ప్రమాణంబులు లేవా? నీ నా మనస్సాక్షులు మనము భార్యాభర్తలమని బోధించుచుండుట లేదా? ప్రాణనాథా! నన్ను మఱచిపొందుకాని—

ఉ॥ నీలము లౌశిరోజములు ♦ నిద్దఁపుటద్దపు దళుక్కు చెక్కులున్
మేలగు సుందరాననము ♦ మేల్మి పసిండిశరీరకాంతియుం
జాలమనంబు లోఁ గొనెడు ♦ చక్కని తేట తెనుంగుబల్కులున్
జాలిన నీకుమారుని ♦ సజయ్యనఁ గైకొనుమయ్య వేడెదన్

చ॥ సదమల సుస్మితాననము ♦ చక్కని చిక్కని ముంగురుల్ గడున్
మృదులములైన హస్తములు ♦ మేలగు ముద్దులఁగూర్చు పల్కులున్
విదిత యశోభిరామమగు ♦ విద్యయు బుద్ధులు గల్గుబాలుని
ట్లదయతఁద్రోసి పుచ్చఁదగునా ♦ పరికింపవె ప్రాణనాయకా॥

అనాథులమై దిక్కులేక యంగలార్చుచున్న మమ్ము ద్రోసిపుచ్చుట తెలికయే గాని తుదకుఁబరమేశ్వరుని కొలువుకూటంబున న్యాయాన్యాయంబులు దేలక మానవు.

కృష్ణ—తల్లీ! ఈ కఠినాత్ముని మనస్సు కరుగలేదు. మన మెక్కడనో బ్రతుక లేక పోవుదుమా! లేనియెడ క్షణకాలంబునఁ బ్రాణంబులు విడువవచ్చును! వీరిని శ్రమపెట్టనేల! పోదము రమ్ము!

మాధ—డఫేదార్ (బంట్రోతుహాజరు కాగా) వీరు పిచ్చివారువలెనున్నారు! నోటికి వచ్చినట్లెల్ల వాగుచున్నారు! నీవు వారిని పిచ్చివాండ్ల ఆసుపత్రికిఁ దీసుకొని పోయి డాక్టరుగారికొప్పగింపుము! తరువాత నేను వారితో మాట్లాడెదను.

డఫా—అమ్మా! పదండి! యిదిమార్గము (అనివారిని దీసికొనిపెళ్ళును.)

సరో—(సరోజని ప్రవేశించి) మనోనాయకా! ఆ యువతీమణి యెవ్వతె! ఆమెతో నేమో రహస్యంబులు బల్కుచుంటిరే! పరస్త్రీవిముఖుండ నని పల్కితి రిదియేగాఁబోలు! మీ హిందూ సాంప్రదాయంబులంబట్టి బరకాంతామణితో బల్కుట పాపమని చెప్పితిరే! మా యాంగ్లసంఘాచార ప్రకారము నేను బరపురుషునితో మాట్లాడిన నసూయఁ జెందెదరే! మీరిప్పుడీ కాంతామణితో మీ స్వభాషను మాట్లాడుచుంటి రదియేమో తెలుసుకొనవచ్చునా? మీబాల్య స్నేహితురాలేమో! ఎంతైనను బురుషులుఁగదా? మీ రహస్యపు ప్రసంగంబుల జోలి నాకేల! నా యువతిరత్నమెవ్వతె?

మాధ—ప్రేయసీ! ఏటి యనుమానంబులు? ఆమెపిచ్చిది! బంట్రోతులయనుమతిఁబొంది వచ్చి యేమో యవాచ్యంబులనేకంబులు ప్రేలినది! మా దేశస్థురాలు గాన వినోదార్థంబు వినుచుంటినిగాని వేరు కాదు! నీవు షికారునుండి యింతత్వరిత ముగా వచ్చితివేమి! నీవు పిల్లివలెవచ్చి యేమి మాటాడెదమో యని పొంచి యుండి వినుచుంటివి కాబోలు,

సరో—నేనంత యశ్యక్తపుఁబనిజేయుదాననుగాను! నాకును మాయాంగ్లసంఘంబున కును నేఁటితో సంబంధము దీరినది! నేనును వారివలెనే యాంగ్లదేశంబున జన్మించినను, నేను మిమ్ము వివాహమాడి వారిజాతికంతకుఁ గళంకంబుఁదెచ్చి నట్లు భావించి వారు ద్వేషభావంబునుజూపుచుండిరి! కొంతకాలమునుండియు నేను క్లబ్బునకు పెళ్లినంతనే యితరాంగ్లాధికారులును వారి భార్యలును, నన్ను జూచి తొలఁగిపోవుటయు, రహస్యముగా నన్నుగూర్చి గుసగుసలాడుటయు, సూటిపోటిమాటలతో నన్నవమానించుటయు నిట్టిపరాభవంబు లనేకంబులు

జరిగినవి! ఎప్పటికైనను వారు ద్వేషంబులుమాని కలిసికట్టుతోఁ బ్రవర్తించెద రేమోయని యాసపడితినిగాని యవి యడియాసలయ్యె!

మాధ—ప్రేయసీ! నీకిట్టి యవమానంబులు గ్రొత్తలేమోగాని మాకవి సర్వసామాన్యములే! ఆకారణంబున నే, నేనింగ్లీషుక్లబ్బులకుఁ బోవుట మానుకొంటిని!

సరో—నాథా! నేను మిమ్మెప్పుడు వివాహమాడితినో యప్పటినుండియు మీదేశాచారంబు లవలంబింపవలసినదాననేగాని తెలియక ముందట్లొనరింపనైతిని! నేఁటినుండియు హిందూసతీధర్మం బవలంబించితిని! ఇఁకముందు మీయాజ్ఞానువర్తినై హిందూపాతివ్రత్యధర్మం బవలంబించెదను! తెలిసియుఁ దెలియని యజ్ఞానంబు చేతను, పాశ్చాత్యవిజ్ఞానవ్యామోహంబువలనను స్త్రీస్వేచ్ఛాపారవశ్యంబువలనను మీయాజ్ఞ బరిపాలింపక మీకెదురాడి దురితంబులు గట్టుకొన్నందులకుఁ బశ్చాత్తాపతప్తురాలనై మీపాదపద్మంబులకుఁ బ్రణమిల్లుదాన నన్ను క్షమింపుఁడు [అని నమస్కారమొనరించును మాధవుఁడు లేవదీసి]

మాధ—సతీమణీ! నీపవిత్రనమం దఖండమైనమార్పు క్షణకాలంబునఁ గలిగినదే!

సరో—ప్రాణప్రియా! ఒకప్రక్క నాంగ్లేయసంఘంబు నేను హిందువును వివాహమాడితినని మనల నిద్దరను దృణీకరింపుచుండ, మనము హిందూసంఘగౌరవంబునకుఁగూడ వెలిగానేల! ఏనాఁడు మిమ్ము వరించితినో యప్పటినుండియు హిందూధర్మాచారవ్యవహారంబు లవలంబింపవలసినదే! రెంటికిం జెడిన రేవఁడనై హాస్యాస్పదనుగా నేల! కాని కండకావరంబున మొదటఁ దెలియనైతిని! ఈనాఁటికి బుద్ధివచ్చిన దదియే చాలును!

మాధ—ప్రేయసీ! నేను కడుధన్యుఁడను.

## ద్వితీయరంగము.

[పేరిశెట్టి, పద్మిని సరసాలాపంబు లాడుచుందురు.]

పద్మిని—ప్రాణేశ్వరా! మిమ్మీదినంబున నవ్యశోభనపుఁ బెండ్లికుమారుని వలె నలంకరింపఁదలఁచినాను! మీ బట్టతలకు సంపెంగనూనెరాచి, మొక్కజొన్న పొత్తిపీచువలె నున్న మీ శిరోజంబులకుఁ బుష్పహారంబులు జుట్టి మీ గుమ్మడికాయవంటి బంగారు బొజ్జకుఁ జందనంబలంది, మీ డోకుకొని పోయి పాలిపోయిన దవడలకుఁ జుక్కబొట్టుఁబెట్టి, మీతో సరసాలాడవలెనని యున్నది.

తే॥ బట్టతల బొండుమల్లెలు ♦ బాగఁజుట్టి, గ్రుడ్డి కంటికి కాటుక ♦ కొలఁదిబెట్టి
బానబొజ్జకు గంధంబు ♦ బైనఁబూసి, బోసినోటికి తమలంబు ♦ జేసియిత్తు.

చ॥ నెరసిన వెంట్రుకల్ మ్రడిచి ♦ నీటుగఁ దైలము రాచి దువ్వుదున్
బరువగు బానబొజ్జకును ♦ బాగుగఁ బూసెద మంచిగందమున్
తరుచుగఁ దమ్మ బెట్టెదను ♦ దంతములూడిన బోసి నోటికిన్
పరిణయమాడి పొంగెదను ♦ వానరరూపము దాల్చుమన్మథా.

పేరిశెట్టి—అబ్బో! అబ్బో! ఏమి నీసింగారము! ఏమి నీ మాటలు నేర్పు! మొదటి నుండి చివరవఱకు నంతయు వేశనమేనా! సరేగాని నీ వక్కవినయాలు, సరసాలును నాయొద్ద డబ్బు లాగునంతవఱకేగాని యాతరువాత నన్ను దోసి రాజనకుందువా?

ఉ॥ నీ వినయంపుఁ బల్కులును ♦ నీదు విలాసపు మోహచేష్టలున్
నీ వలపు న్వీరాళియును ♦ నీయనురాగపుఁ బ్రేమచూపులున్
నీ విటుఁ జూపకారణము ♦ నెమ్మది సాధనమెల్ల లాగఁగా
భావమునందు నెంచిగద ♦ పద్మదళాక్షిరొ నే నెఱుంగనే.

ఆ॥ వె॥ ధనముగల్గునాఁడు ♦ దరిజేరి ప్రేమించి, కల్ల నాటకంబు ♦ నల్లుచుందు
ధనము లేనినాఁడు ♦ దయమాలి ద్వేషించి, కుక్క బాదినట్లు ♦ గొట్టి ద్రోతు.

ఎన్ని మాయ మాటలు జెప్పినా నీ మనస్సు, నీవలపు, ఆ దౌర్భాగ్య దామోదరుఁడు పద్మనాభయ్య మీఁద నేగాని మావంటి వారి మీఁద నుండునా మాకు సొమ్ము బుర్రితుడుపేగాని, సుఖమంతయు నా బాపనయ్యదే.

పద్మిని—ఛా! ఏమి మాయమాటలు! డబ్బియ్య వచ్చునని ముందరి కొల్లకుబందమా! మీరునన్ను చేటఁబట్టినప్పటినుండి యాశనిగానిని నాయింటి పట్టైనను రానిచ్చుచున్నానా? మీరు మాపైఁగనకధారలు వర్షించుచుండఁగా నట్టి దగుల్బాజీ వెధవల మాటయైనను దలపెట్టెదనా?

తే॥ రవలహారం బొసంగెద ♦ రమణియంచుఁ, బల్కవచ్చును మాటల ♦ భ్రమలు గొల్పి
సరసములనాడి మోహంబు ♦ జూటవచ్చు, సత్యవచనంబు జెల్లింప ♦ సాధ్య మగునె
వైశ్యు లేడను సత్యంబు ♦ బల్కలేడ.

ఏదీ కెంపులహారము దెచ్చి పెట్టెదనంటిరి! మీ మాట నీళ్లలోమూటే! మాటలకేమి కోటలుదాటును! అన్నమాట నిలుపఁబెట్టుకొను మొగతనము లేదు కాఁబోలు! అసలే షాహుకారు బిడ్డలు! మీ వంశములో సొమ్మునకును బ్రాణంబునకును లంకే, పూర్వమొకఁడు చెప్పినాఁడట.

తే॥ తివిరి యిసుమునఁ దైలంబుఁ ♦ దీయవచ్చుఁ, దవిలి మృగతృష్ణలో నీరుఁ ♦ ద్రావవచ్చుఁ
దిరిగి కుందేటి కొమ్ము సాధింపవచ్చుఁ, గోమటిని గూడి కాసైనఁ ♦ గొనఁగరాదు.

పేరి—అసి వెర్రిమొగమా! ఇదేనా నీబుద్ధి బూరెలుతిన్నట్లేయున్నది! అన్నమాట మీఁద నిలఁబడితినో లేదో చూడు నాదెబ్బ?

శా॥ చాలుఙ్జాలును ఇట్టిమాట బలుక ♦ న్జంద్రాస్య సిగ్గుండదే
ఫాలాయంబుగ వేలులక్షలును వే ♦ వచ్చుందుదం బోవుఁ గా
బాలా! పల్కిన పల్కులెప్పుడయిన ♦ న్వాచించి చెల్లింపనే
నేలా నీవిటు క్రూరవాక్యములచే ♦ నిర్బంధము న్జేయఁగ౯

[జేబులోనుంచి తీసి] ఇదుగో! రవ్వలహారము! ఎప్పుడైనను జన్మలోఁ జూచితివో లేదో! కన్నులు మిఱుమిట్లు గొలుపుచు నెట్లు మెఱయుచున్నదో? దీని ఖరీదైదు వేలవరహాలు! నీపద్మనాభిగాఁ డెప్పుడైన నిట్టి నగయిచ్చినాఁడా? వాని యాస్తియంతయు వేలము వేసినను దాని ఖరీదులో కీసపాలు రాదు.

పద్మిని—అబ్బో! శెట్టిగారు పెద్దయెత్తే యెత్తినారు! ఎట్లైనను సాహుకారు బిడ్డలనిపించినారు! ఇంతకు నిది నిక్కమైన రవ్వలో లేక గాజురవ్వలో! తళుకు బెళుకు రాళ్లన్నియు నిక్కములైన రత్నములగునా! ఇందులో నేదో మాయ మర్మమున్నది. ఏదో నాకండ్ల నీళ్లు తుడుచుటకుఁ జౌకబారు గాజుతావళము దెచ్చినారు గాఁబోలు.

శెటి—ఇంకను నపనమ్మకమేనా! నన్ను జంపుకొని తిన్నంతఒట్టే! ఇది నిజముగా రవ్వల తావళమే!

తే॥ కనులమిరుమిట్లుగొలుపుచుఁ ♦ గాంతులీను, రవలహారంబుజూడుమా ♦ రమణి నీవు
ప్రాణమునకంటె ప్రాణమై ♦ వరలుదీని, నీ కొసంగెద బ్రీతితో ♦ నొసఁగుముద్దు.

ఇది నీ మెడలో వేసి యొకముద్దుఁ బెట్టుకొననిమ్మ! (మెడలో వేసిముద్దాడును)

పద్మిని—ఆహా ఎంతబాగుండండి! మీరవ్వలతావళమే బాగున్నదో మీ ముద్దేబాగున్నదో చెప్పుకొనుఁడు చూతము (పద్మినీ యనిపిలుపు) మా యమ్మ పిలుచుచున్నది ఇక్కనే యుండుడు.

శెటి—ఇదివరస! ఎప్పుడును పానకములోఁ బుల్లవలె నడ్డమే! ఖర్చు నాది ఫలిత మింకొకరిది.

# తృతీయరంగము

[శశిముఖి, పద్మనాభుఁడు ప్రవేశము]

పద్మ—అత్తా! నిన్ను బ్రతిమాలుకొనెదను! ఒక్కసారి మాపద్మిని దర్శనముజేయనిమ్ము! దానిని జూడనిదే నేనిఁక బ్రతుకఁజాలను.

శశి—ఏమిటయ్యా! బాపనయ్యా! అల్లా జలగవలెఁ బట్టుకొని పీల్చిపిప్పి చేయుచున్నావు. గుడ్డిగవ్వచెయ్యని విధవలకెల్లా మాపద్మిని దర్శన మబ్బునటయ్యా? కాలము మాఱి పోయినది! ఏమో చిన్ననాఁడేమి స్నేహమున్నదో తీరిపోయినది! ఇప్పుడది బోడిబాపనయ్యలతోఁ గాలక్షేపముఁజేయుటకు వీలులేదు.

పద్మ—అత్తా! నేను మన్మథాగ్నిని జల్లార్పలేకున్నాను! పూర్వపుటౌన్నత్యమునందు నాయాస్తియంతయు మీకుఁ గుస్మరించుట యప్పుడే మరపునకు వచ్చినదా! నాయిల్లు వాకిలి, మడులు మాన్యంబులు, ధనధాన్యంబులు నాసర్వసంపదలు నీయింటఁ జేరలేదా? నాసర్వసంపదలుగైకొని, నన్ను బుకొక్కుపకీరునుజేసి తుద కొకసారి దర్శనభాగ్యంబు గలిగింపుమన్నను నింత తృణీకరింపవలయునా? ఒక్కసారి పద్మిని సందర్శనంబొనరించి నాజన్మ తరించెనని వెడలిపోదును. చంద్రదర్శనంబునకు నిరీక్షించు చకోరంబులభాతి, నినకర సంస్పర్శనకై తపించు పద్మంబుల కరణి, మాపద్మినీ సందర్శనంబునకై నిరీక్షించుచున్న వాఁడ! వియోగసంతాపభరంబునఁ బ్రాణాపాయంబుననున్న నాపై నాపద్మిని దయారస వీక్షణంబులు బఱపినచో, నా ప్రాణంబులు నిలుచును.

శశి—ఓపరమ దౌర్భాగ్యుఁడా! లేవలేని చవటపెద్దమ్మా! పుట్టికెక్కలేనమ్మ స్వర్గమున కెక్కఁగలదా? భార్యను బిడ్డలను బోషించుకోలేనివాఁడవు, వెలయాలి నెట్లు పోషింపఁగలవు! నీ వెక్కడ మా బంగారుబొమ్మ పద్మిని యెక్కడ! నక్కయెక్కడ! దేవలోక మెక్కడ! మీయిద్దరిస్థితిగతులకు హస్తిమశకాంతరమున్నది! నీకు మాటలతోఁ జెప్పిన బుద్ధిలేకున్నది. దేహశుద్ధి కావలెనాయేమి! నీభాగ్యమేనాఁడో కడిగిపెట్టితినని మురిసెదవేమి? ఏనాఁటి దానాఁడు పరగడుపే! ఏనాఁడుభాగ్యమిచ్చితివో యానాఁడా మెయాలింగనా సౌఖ్యమనుభవించితివిగదా! అంతటితో నీభాగ్యంబువిలువ తీరెనుగదా! నీబ్రతుకు తెరువుఁజూచుకొనుము! నీకింకను బుద్ధిరాలేదని నీభార్యయుఁ బిల్లలు, దరిదండ్రులెంత దుఃఖించుచుండిరో! ఇకనైనను వారిగతిఁజూడుము! లేదా మాపద్మినిదర్శనము గావలెనందువా దొంగతనము చేతనో, మోసము చేతనో, సొమ్ముఁ దీసుకొనిరమ్ము! తేనెపట్టునఁ దేనెయున్నంతకాలము మాపద్మిని నిన్ను గొలిచినది! తినుట కన్నమును, త్రాగుటకు గంజియు, నుండుట కిల్లును లేనివాఁడవు. నీకింకను భోగపుఁబడుచులమీఁద నాశయేమి? నడునడు! నడువకుంటివా గెంటించెద! లేక చెప్పులతో దేహశుద్ధిఁ జేయించెద! లేకున్నఁ జేపకలాబిఁ గొట్టించెద! మానాభిమానంబులు చచ్చిపోయినవా? చివాట్లు చెప్పుదెబ్బలు బెట్టినకొలఁదిని చూరుఁబట్టుకొని వ్రేలాడెదవేమి.

పద్మ—తల్లీ! నీవు నన్నేమిజేసినను సరియే! నాప్రాణములిక్కడఁ బోఁగొట్టుకొందును గాని, పద్మినీ సందర్శనంబులేనిది, నేనువెళ్లను! నీవు చెప్పుతోఁగొట్టినను, ఉరికంబంబున కంటఁగట్టినను, నగ్నిహోత్రంబునఁ బడద్రోచినను సరియే పద్మినీ సందర్శనంబుఁ గలిగింపుము!

శశి—ఈబాపనపిశాచము వదలునట్లులేదు. శనిబట్టిన యేడేండ్లు, వీఁడుబట్టినఁ బదునాలుగేండ్లు! ఇక్కడనేయుండుము. ఆపద్మినివచ్చి బుర్రపగులఁగొట్టి చావఁగొట్టి చెవులుమూసి యవ్వలకీడ్చినగాని నీవు వదలవు. [అని వెడలిపోయి పద్మినితోఁ దిరిగి ప్రవేశించును.]

పద్మనా—పద్మా! నాప్రాణేశ్వరీ! నీదర్శనభాగ్యంబుచే నీ జన్మతరించె! నీవు వెల యాలివనియు నేను దమ్మిడిలేని పరమ దౌర్భాగ్యుఁడననియు నెఱుంగుదు! ఐనను తుది యాలింగనంబిచ్చి నన్ను బంపివేయుము!

సీ॥ నీమూలమునగదా ♦ నిలువ నీడయులేక, కొంపయుగోడియుఁ ♦ గోలుపోతి
నీమూలమునగదా ♦ నిత్యకల్యాణమౌ, భవనమంతయు నేఁడు ♦ పాడుపడియె
నీమూలమునగదా ♦ కోమలాంగిని బాసి, వెలయాలి కొంపల ♦ వెంటఁబడితి
నీమూలమునగదా ♦ నిత్యకర్మలవీడి, వేదాది విద్యలఁ ♦ బేదపడితి
తే॥ నీదుమూలంబున నెగదా ♦ నాదు సర్వసంపదలుమాసె శుభములు ♦ సన్నగిల్లె!
దైన్యమదిహెచ్చె దుస్థితి ♦ దరికిఁజేరె!, లక్ష్మితొలఁగెను పెద్దమ్మ♦లావుమీఱె.

పద్మి—ఏమిటయ్యా! వెఱ్ఱిబాపనయ్యా!

సీ॥ పొరుగింటి మీనాక్షి ♦ పొందుగోరినవాఁడు, కనకాభిషేకంబు ♦ గలుగఁజేసె
మెల్లకన్నుల చాన♦మీఁద మోహముఁజెంది, మేడమిద్దెలొసంగి ♦ కూడెనొకఁడు
పలుకాడనేరని ♦ పల్లవాధరి మెచ్చి, తారహారములిచ్చి ♦ తనిపెనొకఁడు
తొఱ్ఱిమాటలఁబలుకు ♦ తోయజాక్షినిగూడి, వజ్రవైడూర్యము ♦ లంపెనొకఁడు
తే॥ కాసువీసంబులేకనే ♦ కష్టపడుచు, భోగకాంతలవెనువెంట ♦ వేగతిరుగ
నాదరింతురె పొమ్ము పొ♦మ్మందరాని, పండ్లకడియాసపడినచో ♦ ఫలముగలదె.

చ॥ వయసునుమళ్లె ప్రాయమును ♦ వాసెను లక్ష్మితొలంగిపోయెఁగా!
నియమము నీతిమానితివి ♦ నిర్వాలపించిన లాభమున్నదే,
వయసు విలాసినీమణులు ♦ వత్తురె రొక్కముభూములియ్యకే
దయనెఱుఁగంగరాదు ధన♦ధాన్యములుండినఁ దెమ్ము కూడదన్.

ఏదో నోటికివచ్చినట్లు వాగెదవేమి! అన్నానికల్లాడుదునందువా మాయమ్మ ముష్టివేయును తీసుకో! నీవంటి వెధవలందఱితో మాటలాడుటకు నాకు దీరిక యున్నదా? నాదర్శనార్థంబు రాజాధిరాజులు గనిపెట్టుకొని యుండ నీకా నాదర్శనము, ఆలింగన సౌఖ్యము! ఊరక వాగక యేదో కానియోదమ్మిడియో యడుగుకుని లేచిపొమ్ము! నీ వన్నమోరామచంద్రాయని యేడ్చుచున్నావా, నీవు వ్రాసియిచ్చిన మామిడితోటలో, నీవు, నీభార్య, తలిదండ్రులు చెట్లకు నీళ్ళుబోయుఁడు; మీరు మాపాలిటఁబడితెరిగదాయని యింతపిండము వేసెదము! అంతేగాని తారతమ్యము తెలుంగక పిచ్చిగోరణిగా వాగకుము. దవడపండ్లు రాలఁగొట్టించెదను! పూటకు టికాణాలేని వెధవవు నాతో నేమొగముఁ బెట్టుకొని సరసాలకువచ్చినావు! ఈనాఁటి కీగతి పట్టినది. ఇఁకనైన బుద్ధిగలిగి బ్రతుకుము! తక్షణము నాగుమ్మము మైలబరుపక వెడలిపొమ్ము! లేనిచో దొంగతనముఁ జేయవచ్చితివని పోలీసువారి కప్పగించి ఖైదువేయింతును (అని చెప్పి వెళ్లిపోవును)

శశి—అయినదా! అకొంచెము పరాభవము! సంపుసఁబోసినఁగాని తీర్పంబుగాదు! మా బంగారుబొమ్మచేతఁ జివాట్లు పెట్టించినఁగాని నీపొగరణఁగలేదు! కొంచెము పేడకలాబిగూడఁ గొట్టించెద క్షణమోపికఁ బట్టుము! అప్పుడుగాని నీపీడమాకు వదలదు.

చ॥ ధనమునొసంగి మెచ్చెదవొ ♦ ధాన్యముసంపదఁగూర్చియిచ్చెదో
వనములు నిండ్లువాకిళులఁ ♦ బాయని మోహముచేతఁ గూర్చెదో
ఘనమగు భూషణావళులు ♦ కంతుశరాళికి మ్రొగ్గికప్పెదో
నిను నెటు మెచ్చి కూడనగు ♦ నీరజలోచన పొమ్ము పొమ్మికన్

నీకుఁబట్టిన మోహపిశాచము చీపురు కట్టతోను పేడకలాబితోను గాని వదలదు! [అని పేసినీళ్ళు జల్లి చీపురుతోఁగొట్టును. పద్మనాభుఁడు దూరముగా జని]

పద్మనా—పరమేశ్వరా! ఎంతకష్టకాలము వచ్చినది.

చ॥ కొడుకును గోలుపోయితిని ♦ గోమలి ప్రేమకు దూరమైతి బె
క్కుడుములు నెత్తిపైకొఱగె ♦ నింపువహించెడు భోగభాగ్యము
ల్గడు గరవయ్యె మాన్యములు ♦ కన్గతితి న్వెలకమ్మి వేసితిన్
సుడివడె ప్రాణముల్ దుదకు ♦ స్రుక్కుచు నాకలిబాధకోర్వమిన్.

ఉ॥ ఎవ్వరి వేడుకొందునిఁక ♦ నేగతిలేమి హరించు నెవ్వరే
నివ్వసుధాస్థలిందలఁప ♦ నీగతిభోగపురంధ్రి మాయలన్
రవ్వలఁజిక్కి సర్వము ని♦రామయముం బొనరించియుండి రే
యివ్వల నవ్వలంగనిన ♦ నిట్టిదురాగతమబ్బియుండునే.

చ॥ ధనమునుదోచిపెట్టితిని ♦ దానము ధర్మము మంటఁగల్పితిన్
గొనములపోవు భార్య నటు ♦ గొట్టుచుఁదిట్టుచు పీడనాడితిన్
ఘనులగు తల్లిదండ్రులను ♦ గష్టసముద్రమునందు ముంచితిన్
వెనుకను ముందునారయక ♦ వేవెలఁదిన్మదినమ్మి సర్వనా
శనమును బొందినాఁడ నను ♦ జాలినదుష్టుఁడికొక్కఁ డుండునే.

చ॥ దయయును ధర్మమార్గమును ♦ దప్పితి నాలిని గష్టపెట్టితిన్
నయమును నీతిఁగోల్పడితి ♦ నష్టముఁజెందితి భూములమ్మితిన్
వయసునఁగండకావరము ♦ ప్రాపున వేవెలయాండ్రఁ బొందితిన్
భయమును సిగ్గు నెగ్గు నెడఁ♦బాసితిఁ జేసితి దుష్టకార్యముల్,

మ॥ ధనమాపోయెను సంపదల్సమసె ని♦ర్దాక్షిణ్యమే పొరఁగా
వనితారత్నముఁబీడి భోగవనిత ♦ న్వాలాయము న్గూడితిన్
జనముల్బంధులుఁగూడదన్న వినకే ♦ జన్మన్వృథా జేసితిన్
ఘనమోహాంధుఁడనై సదా మెలఁగితిన్ ♦ గర్వాతిరేకంబునన్.

చ॥ కులమును శీలమున్మఱచి • కూరిమిఁగొల్చెడు ప్రాణనాయకిన్
పలుగతులన్ బయల్పఱచి • బాంధవబృందము గేలిసేసినన్
ఖలమతి భోగకాంతలకుఁ • గాన్కయొసంగితి సంపదల్ బళా
యిల నను బోలు దుర్మతియు • నింద్రియలోలుఁడు నెందుఁగల్గునే.

ఉ॥ బాగుగ రొక్కమిచ్చినను • బంగరు నాణెము లెన్నిగూర్చినన్
భోగము సౌఖ్యమున్ నెఱపి • భూములు దోటలు వ్రాసియిచ్చినన్
వేగ నలంకరించి తన • పేరును గీర్తియుఁ బెంపుజేసినన్
భోగపురంధ్రి కించుకయుఁ • బుట్టునె! నిక్కపుఁ బ్రేమమోహముల్.

మ॥ సుతుఁడా పోయెను స్వర్గలోకమునకు, • నొస్నెమ్మెల్ల వమ్మయ్యె నా
హితులు న్జుట్టలు జెప్పువాక్యముల నే • నిచ్ఛింపఁగానైతి నా
సతిఁబోఁద్రోచితి మోహసాగరమునన్ • సర్వంబుఁబోనాయె నే
నతిదుష్కర్ముఁడ బంధుఘాతుకుఁడ న•త్యంతంబుఁ బాపాత్ముఁడన్.

ఛీ! ఛీ! నేనీ పాపప్రపంచంబున నందఱయెడలను మహాపరాధంబులొనర్చి తుదకే మొగంబుఁ బెట్టుకొని నాసతీతిలకంబు ముఖపద్మంబును బొడగందును! పొడగందునుబో వారిని బలుముఖంబుల నావరించియున్న దారిద్ర్యచింతాభరంబునెట్లు బాపఁగల్గుదును! పుడమిలో దారిద్ర్యంబుకన్న దుఃఖంబుగలదా! నాకు సర్వవిధంబుల సన్యాసాశ్రమంబే సర్వోత్కృష్టమైన యాశ్రమంబు! నేనాయుత్తమోత్తమాశ్రమ స్వీకారం బొనరించి యాసేతు శీతనగమధ్యభాగంబున దేశాటనంబొనరించుచు వారాంగనా సాంగత్యంపు దోషంబులు జాటుచు సంచరించెదను. [అనుచుఁ గాషాయవస్త్రంబులుదాల్చి వెడలిపోవును]

## చతుర్థరంగము.

[ప్రవేశము - జనార్దనరావు, సుప్రభ, రుక్మిణి]

సుప్రభ—కటకటా! ఎంతపాపిష్ఠకాలమువచ్చెను! తినుట కన్నంబును గట్టుటకు వస్త్రంబును గఱవయ్యెనే! ఎట్టి దుర్ముహూర్తంబున గంగిగోవువంటి కోడలిపై లేనిందలుమోపి యిల్లు వెడలఁగొట్టితిమో యప్పటినుండియే యినుపగజ్జలతల్లి మనయింటఁ దాండవమాడుచున్నది!

చ॥ కటకట లేనిలోపములఁ • గల్మషబుద్ధినినంటఁగట్టితిన్
జొటజొట బాష్పముల్దొరుగ • సుస్రుము జేడిన జాలిమాలి నేఁ
కుటిలమనస్కనై సతిని • గోడలిఁగొట్టుచుఁ బొఱఁద్రోలి య
క్కటికము లేక జీవనముఁ • గాసిలఁజేసితి నేమిసేయుదున్.

నాగర్భవాసంబునఁ బుట్టినకొడుకును గూతునునుగూడఁ గన్పింపకుండఁ బోయిరి! భారతీ! నిన్నాముసలి ముండకొడుకున కిత్తుమని భయంబుచే నింటినుండి పాఱిపోయితివి! బ్రతికి యున్నావో లేదో కదా!

జనార్ద—భారతీ! ననుగన్న తల్లీ!

చ॥ అనలముఁజొచ్చి కాయము సమర్పణజేసెనో? నూతఁగూలెనో?
ఘనమగు దుఃఖభారమునఁ ♦ గామిని వాహినులందు మున్గెనో?
వనముల ఘోరజంతువుల ♦ బారినిబొందెనో మిత్తిజెందెనో
వనరుహనేత్ర భారతిని ♦ బాసి యరిష్టముజెందితింగటా!

మ॥ కొడుకాపోయెను దూరదేశములకు ♦ న్గోడల్ గనంరాదుగా
వడకన్నాగెను మేను నార్థకము దా♦పైవచ్చె సంపత్తి దా
నడచెన్ద్రామును జేరినట్లుగనె య♦న్యాయంబుగాఁ గోడలిన్
బడలంజేసిన పాపముంగుడువ కే ♦ భంగిన్ సుఖింపందగున్.

రుక్మిణి—అనసూయాదేవి! నీవు నిక్కంబుగా ననసూయవే! నీపైలేని యపరాధంబులు గల్పించి యెంతపాపంబొడిఁగట్టుకొంటి.

సీ॥ ఆటపాటలయందు♦నన్యోన్యముగనున్నఁ, బలువిఘ్నంబుల బాధ♦పఱచియుంటి
నాకలిదప్పుల ♦ నలసటజెందంగ, నన్నపానములిచ్చి ♦ యరయనైతి
నత్తమామలతోడ ♦ నన్నదమ్ములతోడ, సాడీలుకల్పించి ♦ వీడుమంటిఁ
గపటనాటకములు ♦ గల్లలుగూర్చి దంపతులప్రేమము భంగ♦పఱచియుంటి
తే॥ గృహము గల్లోలములనించి ♦ కీడొనర్పఁ, గష్టవార్ధిలో మున్గఁ♦గలిగె నేఁడు
సకలసద్గుణగణయైన ♦ సన్నుతాంగి, యెట్టికష్టంబులందెనో ♦ యెఱుఁగరాదు.

జనార్దన—

సీ॥ కోడలి పుట్టిల్లుఁ ♦ గూలిపోవఁగజేసి, కట్నంబు చేపట్టి ♦ ఖలుడనైతి
పెండ్లిపీటలమీఁద ♦ పెండ్లిండ్లు పడగొట్టి, పెంపుగా ధనమును ♦ బీల్చియుంటి
శుభకార్యములయందు ♦ సొడ్డు శోధనజేసి, వేడుక పేర్బెట్టి ♦ వేసయిడితి
నత్తింటిలోఁ గోడ ♦ లడుగుఁబెట్టినదాదిఁ, యతికాలఁద్రొక్కితిఁ ♦ గరుణలేక
తే॥ గంగిగోవగు నిల్లాలి♦గంగపాలు,జేసి తిరిపెంబు నెత్తుచు ♦ సిగ్గులేక
సుగుణగణములప్రోవైన ♦ సుతునిబాసి, బ్రతికియుండితి జీవచ్ఛ♦వంబనగుచు

సీ॥ తిట్టి కొట్టినఁగాని ♦ పట్టికాల్చినఁగాని, కోపంబు నెఱుఁగని ♦ కోమలాంగి
దోషమెంచినఁగాని ♦ తూలనాడినఁగాని ♦ దూషింపనెఱుఁగని ♦ తోయజాక్షి
భూషణంబులుమార్చి ♦ బూదియిచ్చినఁగాని, పోరుఁబెట్టఁగలేని ♦ పువ్వుఁబోణి
యన్నంబుపెట్టిన ♦ సున్నంబుపెట్టిన, నాగ్రహంబెఱుఁగని ♦ యలఘుఁబోడి
తే॥ యత్తమామలసేవల♦నలరుచుండు, ప్రాణనాథుని కనుసన్నఁ♦బ్రబలుచుండు
సుగుణగణములకిమ్మైన ♦ సుందరాంగి, యష్టకష్టంబులనుబొందె ♦ నక్కటకట

సుప్రభ—నాథా! మనము. చేతులారఁజేసుకొనిన పాపఫలంబనుభవింపక తీరునా? "లలాటలేఖా నపునః ప్రయాతి" యని పెద్దలు చెప్పుదురుగదా? మనమిట్టి కష్టంబులనుభవింపవలయునని బ్రహ్మ మననొసటను వ్రాసియుండ నాలక్ష్మి

దేవిని మనము గౌరవించుట తటస్థించునా? కలకంఠకంఠి కన్నీరొలికిన సిరియింట నుండనొల్లదు కదా! ఆపరమపతివ్రతాతిలకంబు ప్రాణేశ్వరు నెడఁబాయఁ జాలక నాపాదంబులను బట్టుకొని భార్యాభర్తల కెడబాటుఁ జేయవలదని కన్నీరు మున్నీరుగాఁ బలవించి బాష్పధారలచే నాపాదంబులు గడిగి బ్రతిమాలు కొన్నను కర్కశపాషాణ హృదయుండనై యాసతీరత్నంబును గృహంబు నుండి పాఱఁదోలిన పాపఫలంబు జన్మజన్మంబులకు మనల వెన్నంటి బాధింపకుండునా.

సీ॥ అత్తమామలయెడ ♦ నాదరంబునుజూపఁ, జడిముడిపాటుతో ♦ నిడుమలిడితిఁ
బ్రాణేశ్వరునిమీఁదఁ ♦ బంచప్రాణములున్నఁ - బతిభక్తిలేదని ♦ వదరియుంటి
దైవభక్తియు దయా♦దాక్షిణ్యఁములుగల్గ - దండించి శిక్షించి ♦ మొండినైతి
నాడుబిడ్డలయెడ ♦ ననురాగమునుజూపఁ - దప్పులవెదకుచుఁ ♦ దరలుమంటిఁ
తే॥ గష్టములముంచి పలుమారు♦నష్టపరచి- దుఃఖములముంచి సుఖములఁ♦దొలఁగఁజేసి
కూడుఁగుడ్డయు నొసఁగక ♦ కుందఁజేసి - పాపకూపంబునను గూలి ♦ భంగపడితి.

చ॥ కనులను బాష్పపూరములు ♦ గ్రమ్మఁగ గద్గదయుక్తకంఠయై
యనునయమొప్ప పాదముల ♦ కంజలిఁజేయుచు దుఃఖమందుచున్
"నను నిలునుండి త్రోయకుము ♦ నాహృదయేశుని బాయజాల"నం
చను సతిరత్నశీలమును ♦ జయ్యన నేగతి విస్మరించెదన్.

ఉ॥ పుట్టినయిల్లు వీడి తను ♦ ముద్దుగఁబెంచిన తల్లిదండ్రులన్
నెట్టనఁబాసి భోగము గ♦ణింపక యింతయు సేవసేయఁగా
మెట్టినయిల్లు జొచ్చితన ♦ మేనుకుసౌఖ్యలవంబు జూడకే
పెట్టినకష్టముల్సయిచి ♦ పేర్మివహించెడు తన్విఁబాసితిన్

ఆసతీతిలకంబు నాగృహంబునుండి యెప్పుడు వెడలఁగొట్టఁబడినదో యప్పటి నుండియే శ్రీలక్ష్మీదేవి మనగృహంబువీడె! ఆక్షణంబునుండియే యనుపగజ్జలతల్లి మనపట్టింట స్థిరమైన కాపురంబుఁ బెట్టె. నాఁటినుండియే ధన కనక వస్తువాహన సమృద్ధియు సర్వసంపదలును గరిమ్రింగిన వెలగపండువలె నదృశ్యంబులయ్యె. దాసదాసీజనంబులు సంపదలు గలిగినపుడు కనుసన్నల మెలఁగి లేమి గల్గిన వెంటనే యదృశ్యులైరి! పంచభక్ష్యాన్నంబుల రుచిజూచిన నోటనే యుప్పుగల్లును లేని గంజియుఁ గుక్కలకు బాఱవైచెడు చద్దియన్నంబును భుజింపవయ్యె! అహా! కాలమహిమ! పూవులమ్మిన యంగడినే పుడకలమ్మవలసివచ్చె గదా! శ్రీలక్ష్మీదేవి యతిచంచల! లక్ష్మీదేవి క్రీగంటి ప్రసారం బీనాఁడు ఒకనిపై ప్రసరింప నతఁడు దేవేంద్రసదృశుండై రాజాధిరాజగును! ఆక్రీగంటి ప్రసాదంబు దప్పినచో గర్భదరిద్రుండై పూటకంజికిఁ డికాణాలేక యన్నమో రామచంద్రాయని పలవించుచుండును. కలిమిలేములు కావటికుండలు! సంపదలు తటిల్లతా సదృశంబులు! వానిని శాశ్వతంబనినమ్మి మోసపోవు

వారు పాపకూపంబునఁబడిపోవును! సంపదగలనాఁడు మహోన్మత్తుల మైయొడలెఱుంగక మనసమానులు లేరని విఱ్ఱవీగితిమి గాని గర్భదారిద్ర్యంబు వచ్చుటతోడనే యామదంబెల్ల దిగిపోయినది! ఇప్పటికైనను బుద్ధిదెచ్చుకొని నా కుమారుఁడును గుమార్తెయుఁ గోడలును నేదేశంబున కరిగిరో యాసేతుశీనగ మధ్యప్రదేశంబంతయు గాలించి యన్వేషించెదను, నాథా! మన పాపకార్యంబులవలనను దుష్టచారిత్రంబువలనను నీదారిద్ర్యంబును "తోవఁబోవు ప్రారబ్ధకర్మమా! మాయింటిని దొంగిమాచిపొమ్మని" యాహ్వానించితిమి! తిరిగి యీదారిద్ర్యదేవత మనలనెప్పుడు విడుచునో తెలియరాదు. కొడుకును గూతురును గోడలును నన్వేషింప నేగుదము రండు? కష్టకాలంబున శ్రీ హరినామ స్మరణంబే సర్వకలుష నివారణంబు.

శ్లో॥ హరే రామ హరే రామ రామరామ హరేహరే
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే.

శ్లో॥ శ్రీరామరామ రామేతి రమేరామ మనోరమే
సహస్రనామ తత్తుల్యం రామనామవరాననే.

## పంచమరంగము.

[చికిత్సాలయము - డాక్టరు సరస్వతీదేవి; సరోజిని మాట్లాడుచుందురు. ప్రభావతి జ్వరముతో సంధిప్రలాపముఁ జేయుచుండును. కృష్ణమూర్తి ప్రభావతి దగ్గరకూర్చుండి పరిచర్యఁజేయుచుండును.]

సరో—డాక్టరుగారు! ప్రభావతి కెట్లున్నది.

సర—ఏమని చెప్పమందురు! నట్టేటిలోఁ బ్రచండమైన తుపానుచేఁ జిక్కి నావకొట్టుకొనుచుండునట్లు ప్రభావతి బాధపడుచున్నది! మృత్యుదేవతతో ఘోరసమరంబు సలుపుచున్నది! తెప్ప తేలునో మునుఁగునో యెవరు చెప్పఁగలరు! బ్రతుకుట బహుదుర్లభము.

తే॥ సంద్రమందున సుడిగాలిఁ జాలజిక్కి, మునుఁగ నున్నట్టిచిరు నావ ననువునుండె
తెప్ప తేలునో మునుఁగునో తెలియరాదు, దైవఘటనంబు దెలియఁగఁ దరమె మనకు.

తే॥ ఘోరవ్యాఘ్రంబు హరిణంబుఁగూల్చునట్లు; క్రూరసింగంబు హస్తి పైఁ గుదుకునట్లు
కారుచిచ్చు మహాటవిఁ గాల్చునట్లు; మృత్యుదేవత చేఁజిక్కె నింతి నేఁడు!

సరో—పాప మాబాలుఁడుఁ తల్లికెట్లు పరిచర్యఁ జేయుచుండెనో వీక్షింపుఁడు! ఆమెనుజూచి నప్పటినుండియు నామెయెడ సోదరీభావము గల్గినదండి! అందువలననే ప్రతిదినము నీమె క్షేమం బరయుచుంటిని! ఏ సంజీవియో యమృతమో యొసంగి యామెను బ్రతికింపవలసిన భారము మీది!

తే॥ మందుమాత్రికల లోపంబు • మానుమమ్మ; యివ్వఁగల యౌషధంబు లి • ప్పింపుమమ్మ
పురుషయత్నంబు వీడఁగాఁ • బోలునమ్మ; ధాతవ్రాతలు దుడిపింపఁ • దరమటమ్మ

సర — మీరింతగాఁ బదిసారులు జెప్పవలెనా! నాసర్వశక్తుల నుపయోగించెదను! మీ రాపిల్లవాని దుఃఖ మోదార్పుఁడు! నే నిప్పుడే తక్కిన రోగులను బరీక్షించి వచ్చెదను.

ప్రభా — (ఆవేదనముతో) పరమేశ్వరా! నీకు నామీఁద నేల కరుణరాదు! ప్రపంచంబునఁ దలిదండ్రులా లేరు! ప్రాణనాథుఁడా విదేశ కన్యకామణిని వివాహమాడి నన్ననాథగా నొనర్చినారు! ప్రేమించు నత్తమామలా దుఃఖసముద్రములో మునిఁగి స్వర్గస్థులైరి! ప్రాణేశ్వరా! సర్వన్యాయాన్యాయ విచక్షణ దక్షుండవై రాష్ట్రాధిపత్యంబొనర్చుచుంటివే! నీపైఁ బంచప్రాణంబులం బెట్టుకొన్న యిల్లాలిని దిక్కులేని పక్షివలెఁ దఱిమివేయ న్యాయమగునా? పాణిగ్రహణకాలంబున నెడఁబాయనని చేసిన ఘోరప్రమాణంబులన్నియు మిథ్యగావించితివా? కానిమ్ము! నాగతి యేమైనను నేను చింతింపను! దిక్కుమాలిన పక్షిని నేను బ్రతికినను జచ్చినను బ్రపంచమునకు లోటుకాదు. కాని సంపూర్ణ పూర్ణిమా చంద్రబింబమును ధిక్కరించు నీకన్నపుత్రుని మొగమైనను జూచి గౌరవింపవలదా? నేనీ ప్రపంచంబును వీడినతరువాత రెక్కలురాని యీపిల్లఁడల్లాడి మరణింపవలసినదేనా? ఛీ! ఛీ! మరణగహ్వరంబునఁ జొఱనున్న నాకీ విచారమేటికి? ఆర్తజన పరాయణుండును, దీనజనరక్షాకల్పకంబును; దుష్టశిక్షణ శిష్టరక్షణవ్రతదీక్షా బద్ధకంకణుండును; గజేంద్రప్రహ్లాద విభీషణ ద్రౌపదీత్యాది భక్తవర ప్రదాయకుండునునగు పరమేశ్వరుండొక్క దిక్కుమాలిన పక్షియైన నాకుమారుని రక్షింపఁజాలఁడా? నారుబోసినవాఁడు, నీరుబోసి నారును బెంపఁజాలఁడా? రాతిలోని కప్ప కాహార మెవ్వఁడొసంగును! భూమ్యాకాశంబుల సంచరించు పశుపక్షి మృగకీటకంబులకు బ్రహ్మాండంబులు మొదలు పరమాణువు వఱకు సర్వప్రాణులను సంరక్షించు పరమేశ్వరుండే నాకుమారునికి దిక్కు! సర్వేశ్వరా! ఆర్తశరణ్యా! అనాథనాథా! దీనదయాపరా! పాహిమాం! పాహిమాం! పాహిమాం.

సరో — తల్లీ! విలపింపకు! సర్వేశ్వరుఁడు నీ దీనాలాపంబు లాలకించెను! నీకును నీపిల్లవానికిని నేలోపంబును లేదు!

తే॥ అణువు మొదలుగ బ్రహ్మాండ • మావరించి-నింగివిహరించు పక్షుల • నియతిఁ బ్రోచి
జలములందలి జంతులఁ • జాలమనిచి - రాతి నివసించు కప్పకుఁ • బ్రాణమిచ్చు
దేవదేవుండు నీబిడ్డఁ • బ్రోవలేడె.

నీపిల్లవానిని రక్షించుభారము నాది! మీ ప్రాణనాథుఁడు మిమ్ము గౌరవించి గైకొనును. అధైర్యము పొందకుఁడు.

ప్రభా—(కన్నులు దెరచిచూచి) తల్లీ! నీవెవరవు? నన్నురక్షింపవచ్చిన లక్ష్మీదేవివా? పార్వతివా? లేక సరస్వతివా? సంజీవివంటి నీ వాక్యామృతంబు చేత నావ్యాధిక్షణములో మాయమైనట్లున్నది.

సరో—నే నెవరైననేమి! నన్ను నీ చెల్లెలుగా భావింపుము! నీవు నీప్రాణస్నేహితుల నడుమ నుంటివిగాని, నీ వనుకొన్నట్లు దిక్కుమాలిన పక్షివిగా లేవు! నీవు ధైర్యముగా నిదురబొమ్మ! నీ రోగము నిముషములో వదలిపోవును.

శా॥ అక్కా! లేశము చింతనందకుము నీ ♦ యజ్ఞాతవాసంబులున్
మొక్కుం దైవముఁ జూడ చుట్టమును నీ♦కు న్లేని కష్టంబులున్
నిక్కం బెంతయు నీవు జెందితివిగా ♦ నీ సూర్యుఁడున్పూర్వపు
న్దిక్కు న్వెల్గినఁ జీకటుల్సమయు వే ♦ తేజంబు దీపింపదే.

ప్రభా—తల్లీ! నేను ధన్యను! దిక్కులేనివారికి దేవుఁడే దిక్కు! ఆ పరమేశ్వరుఁడే నిన్ను నాపిల్లవానిని రక్షించుటకుఁ బంపినాఁడు! నేనింక నిశ్చింతగా మరణింపవచ్చును (అని నిదురఁబోవును).

సరో—ప్రభావతి నిదురించుచున్నది! వీరిపుట్టుపూర్వోత్తరంబు లీబాలునినడిగి తెలిసికొందును! కుమారా! నీతలిదండ్రులెవరు! మీరిచటి కేల వచ్చితిరి!

కృష్ణ—ఈమె నాతల్లి! మా తండ్రిగారు కలక్టరుపని చేయుచున్నారు గాని మమ్ము వదిలివేసినారు! మాయమ్మ ప్రార్థించినను వినక మమ్ము వెడలఁగొట్టి నన్నుఁ గాలితోఁ దన్నినారు!

తే॥ తల్లి మువురుతల్లులఁబోలు ♦ ధన్యచరిత, తండ్రి న్యాయశీలుండైన ♦ దాంభికుండు
పరిణయంబైన భార్య దా♦వ్యధను జెందఁ, దెల్లదొరసాని పెండ్లాడెఁ ♦ దెంపుజేసి॥

సరో—కన్నకుమారుని గాలితోఁ దన్నిన క్రూరుఁ డెవ్వరమ్మా!

కృష్ణ—మా నాన్నగారి పేరు మాధవరావుగారు! నేను మాయమ్మ పిచ్చివారమని మమ్మీయాస్పత్రికిఁ బంపినారు.

సరో—మీయమ్మ వారి నెందులకు విడిచిపెట్టినది!

కృష్ణ—మాయమ్మ వదలిపెట్టలేదు! నేనుఁ బుట్టకముందే వారు చదువుకొరకు యావత్తు సొమ్ముఁ దీసుకొని యింగ్లండుకు మాయమ్మను వదలి వెళ్లినారు! అక్కడ మాయమ్మను నన్ను మఱచిపోయి వేరే దొరసానిని పెళ్లిచేసుకొన్నారు. తిరిగి యీదేశము వచ్చినతరువాత మమ్ముఁ జూడనైనను జూడలేదు! మాయమ్మ నన్ను దీసుకొని వారికొరకు తిరిగితిరిగి చివరకు వారినిఁ జూచి బ్రతిమాలఁగా దొరసానికిఁ గోపమువచ్చునని మమ్ము వెళ్లఁగొట్టి యిచటికిఁ బంపినారు! మాయమ్మకిచటజబ్బుచేసి చావుబ్రతుకులమీఁదనున్నది! డాక్టరుగారెన్ని మందులిచ్చినను నయము లేదు! ఇంతకష్టములోనున్నను మా నాన్నకుఁ గరుణలేదు! ఎంత క్రూరాత్ముఁడో!

తే॥ పరిణయంబైన భార్యను • వదలివేసె, కన్నకొమరుని నరికొలఁ • దన్నిపైచె
పిచ్చివారంచు పేర్వెట్టి • వెడలఁద్రోసె, అమ్మ చానున్న క్షణమైన • నరయరాఁడు
కరుణలేదొక్కొ తెలియరో • కర్మఫలము ॥

(కన్నుల నీరునించును)

సరో—(బాలునెత్తుకొని ముద్దులాడుచు) నాచిట్టితండ్రీ! మీయమ్మజబ్బు త్వరలోనే నయమగును! నీకష్టములుఁ దీరినవితండ్రీ! నీకేమైనను సొమ్ము గావలెనా? (అని నూరురూపాయలిచ్చును) మాయింటికివచ్చెదవా? నీకుమంచినగలు బట్టలు నిచ్చెదను. నామోటారిచ్చెదను!

కృష్ణ—అమ్మో! మాయమ్మను వదలటమే! నాయెత్తుడబ్బుపోసినను నేను మాయమ్మను వదలను! మాతండ్రి చిన్నప్పుడేవదలివేసినాఁడు! నేనుగూడ వదలివేసినమాతల్లి గుండెపగిలి చచ్చిపోదా? నాకు మోటారుగీటారులక్కరలేదు! ఈ పాడుడబ్బు మాకువద్దు! మాయమ్మను నేనువదలి యెక్కడకును రాను!

సరో—నేను మీయమ్మనుదీసుకొనివెళ్ళిన నేమిచేయుదువు?

కృష్ణ—అప్పుడు నేను మాయమ్మతోఁ జక్కఁగాఁ బెండ్లికొడుకువలె వచ్చెదను.

సరో—తండ్రీ! నీభాగ్యమే నిన్ను గాచునులెమ్ము! మీయమ్మను రేపీపాటికి యావత్తు జబ్బు నయమగును! నేనుదిరిగి రేపువచ్చెదను। మీయమ్మయొద్ద జాగ్రత్తగాఁ జూచుచుండుము.

కృష్ణ—మాయమ్మను జాగ్రత్తగాఁ జూచుచుండమని మీరుచెప్పనక్కరలేదు.





# అభినవసరస్వతి

## పంచమాంకము

### ప్రథమరంగము

[మహారణ్యము - పద్మనాభుఁడు, అచ్యుతుఁడు, విక్రముఁడు కాషాయవస్త్రంబులతో నరణ్యంబున దారిఁదెలియక భ్రమ్మరుచుందురు.]

పద్మ—

చ॥ అదుగో కయామదయ్యె వ్యాళయంబునఁదాపముఁ జాల హెచ్చె నీ
యిడుమలుదీరుకాలమిఁక ♦ నెన్నఁటికైనను వచ్చితీరునే
వెసగుఁదనంబునన్ సతిని ♦ వేదనపాలొనరించి భోగపుం
పడతినిఁగూడి సర్వమును ♦ బాడొనరించితి నక్కటక్కటా.

(అని నడచుచుండును.)

అచ్యు—విక్రమా!

మ॥ అకటా నే నెటువంటిదుర్మతినో య♦న్యాయంబు గాఁ నంగనన్
వికటంబైన విరక్తితోఁ గినిసి యే♦ప్రీతిన్ సమ్మదింజూపకే
సుకముం బాపి గృహంబునుండి వెలికి ♦ సుట్టూడఁ బోఁదన్నితిన్
మెకముల్ క్రింగెనొ, దుఃఖమున్గడిచెనో ♦ మిత్తిన్ ధర న్బాసెనో ?

విక్రము—మిత్రమా! రోలువచ్చి మద్దెలతో మొఱఁబెట్టుకొనినట్లున్నది నీగోడవ! నాదుఃఖ మెవరితోఁ జెప్పుకొందును! సకలసద్గుణ సమ్మతాంగియైన భారతిని నేఁ బ్రేమించియుండ నామెజనకుఁ డామె నొక ముదుసలి పండుకొటికీయఁ బ్రయత్నింపఁగా నాబాలిక పాఱిపోయె! ఎచట వెదకినను నాకామె గానరాకున్నది!

అచ్యు—అయ్యా! మీరెవరో బాటసారులవలెనున్నారు! మావలెనే మీరును దుర్గమారణ్యంబునఁజిక్కి త్రోవఁదెలియక నవయుచున్నట్లున్నదే!

పద్మ—అయ్యా! నాపేరు పద్మనాభుఁడు! వారాంగన వలయందుఁజిక్కి, యిల్లును నొడలునుఁ బాడుచేసుకొని, భార్య నెడఁబాసిన యధమాధముఁడను! కాశీ ప్రయాణమొనర్చుచు నీ యరణ్యమందుఁ జిక్కితిని. మీ రెవరు!

అచ్యు—నాపేరచ్యుతుఁడు! నేను తల్లిదండ్రుల పోరుఁబడలేక పరమ పతివ్రతా మతల్లియైన యిల్లాలి నింటనుండి వెడలఁగొట్టిన భ్రష్టాగ్రేసర చక్రవర్తిని! తిరిగి నా యిల్లాలి నన్వేషించుచు నిట్లడవులు గుట్టలు బట్టి తిరుగుచున్నవాఁడ!

విక్రముఁడు—మీసోదరియైనదిగదా! నాగోడవగూడ నొక్కింత యాకర్ణింపుఁడు, నేను వలచిన భారతీదేవి చక్కనిచుక్క! త్రిలోకసుందరి! ఆపిల్లను దల్లిదండ్రులు ముసలికోతికిచ్చి వివాహముఁజేయ సంకల్పింపఁగా నాపిల్ల పాఱిపోయినది! ఆ ముద్దులగుమ్మను వెదకి వివాహమాడవలయునని నాప్రయాణము.

పద్మ—మిత్రులారా! మనమందఱ మొక్కపడవలోనే ప్రయాణముఁ జేయుచున్నాము! ఎవరియదృష్టమెట్లున్నదో.

విక్రముఁడు—మనయదృష్టంబున కేమిలోటు! ఈ మహారణ్యంబునఁ జిక్కుకొంటిమి గదా! ఈ యరణ్యంబు దాటినఁగదా మనభార్యారత్నంబుల నన్వేషించుట! పెన్న దాటినఁగదా? పెరుమాళ్ళసేవ.

సీ॥ మట్టమధ్యాహ్నంబు ♦ మహితతేజస్కుఁడౌ, సూర్యకాంతియునైనఁ ♦ జూడరాదు
అల్లిబిల్లిగఁగూడి ♦ యాకసంబునునంటు, లలితలతావళు ♦ ల్వెలయుచుండు
పగలు రాత్రియునైన ♦ భయముఁగొల్పఁగఁజాలు, ఘోరమృగావళు ♦ ల్జేరుచుండు
కాకఘూకంబులుఁ ♦ గడుకూరమృగములుం, బలుదిక్కులందునఁ ♦ బాధవిల్లు
తే॥ మనుజసంచారమేజాడ ♦ మనకుఁదోప, దిట్టినడుకానఁజిక్కితి ♦ మేదిగతియొ
కాననంబునుఁదరియింపఁ♦గలమొ లేమొ, యడః మరణింప విధివ్రాసె♦నక్కటకట.

అచ్యు—ధైర్యసాహససంపన్నుఁడనైన నేనే యీ యడవుల కష్టములనుచుండఁగా శిరీషకుసుమకోమలలతాంగియగు నాప్రేయసి యెచట నెట్టి యిడుమలందు చున్నదో గదా!

చ॥ వనములఁదాపసాకృతిని ♦ భక్తిఁగొల్చి విరాగియయ్యెనో
ఘనమగుమోహతాపమునఁ ♦ గాయముఁ బాయఁగనీటఁ గూలెనో
వనధినిగూలి ప్రాణములు ♦ వాసెనొ కోరవిషంబుఁ ద్రావెనో
యనలమునందుఁ జొచ్చినదొ ♦ యక్కట కష్టములేమిపొందెనో.

పద్మ—నాకుఁ బ్రాణములు కంఠగతములగుచున్నవి! అదు గొక యామడగాఁ జూపట్టు చున్నది.

ఉ॥ గ్రామము దూరమయ్యెనెటు ♦ గాంచిన ఘోరమరణ్యమేకదా!
పాములు ఘోరసత్త్వములు ♦ ప్రాణముఁదీయగ సంచరించెడిన్
వేమరునీరముస్వేదకి ♦ వేసటఁగాంచినఁ గానరాదు నే
మేమి యనర్థముల్గలవొ ♦ యెట్లుతరింతుము గాననంబులన్.

విక్రము—మీరు సాహస విక్రమార్కులవలెనున్నారే! కష్టములు వచ్చినపుడు చింతిల్లినఁ గష్టములు బాఱిపోవునా?

అహా! ఈమహారణ్యంబు ప్రాణి భీకరంబుగానున్నను నెంత మనోహరంబుగా నున్నది.

ఉ॥ అల్లదె కీరశారికలు ♦ నయ్యదె ఘోరవనప్రజంతువుల్
అల్లదె కేకిసంఘములు ♦ అయెడరమ్యకురంగసంతతుల్
అల్లదె కుంజరాళియును ♦ నా దెశసర్పములు న్వరాహముల్
ఎల్లెడ సింహముల్పులులు ♦ హింసయొనర్చుచునుండె నక్కటా!

అచ్యు—మిత్రులారా! ఎటుజూచినను గ్రూరమృగంబుల బొబ్బలుఁ గర్ణకఠోరంబులై వినవచ్చుచున్నవి.

ఉ॥ ఎచ్చటనుండి పైఁబడునొ ♦ హింసయొనర్పఁగ వ్యాఘ్రరాజముల్
ఇచ్చట దిక్కు మ్రొక్కుమది ♦ కింపలరన్గవరాదు బాణముల్
మచ్చునకైనగానరావయొక ♦ మంచి కృపాణముచేతలేదుగా
హెచ్చగు నాపదల్గలిగె ♦ నెట్లుచరింతుము కాననంబునన్.

(లోపల బెబ్బులుల గోండ్రింతలు వినఁబడును)

[అందఱు నులిక్కిపడుదురు]

అల్లదె వ్యాఘ్రంబులు మనదెసకే వచ్చుచున్నవి. ఈ యరణ్యంబున మరణంబు దప్పదు గాఁబోలు మృత్యుదేవతవలె మనమీఁదికే వచ్చుచున్నవి. పాఱిపోవుదమురండు (ముగ్గురును తెరలోనికిఁ బాఱిపోవుదురు.)

[తెరలో హతోస్మి, హతోస్మి యను కేకలు-విమలాదిత్యశర్మ ప్రభాకరశర్మ, భరతశర్మ యాయుధపాణులై ప్రవేశము.]

విమలా—మిత్రులారా? యరణ్యంబున వ్యాఘ్రంబులు బెచ్చుపెరిగి బాటసారులను వధించుచున్నవి. పాపమెవరో హతోస్మియని కేకవేయుచున్నారు. తత్క్షణము బాణంబులు ప్రయోగించి దుష్టమృగములను వధింతము రండు!

ప్రభా—అటుచూడుము! ఆ వ్యాఘ్రంబు బాటసారినొకని గాయపఱచి రెండవవానిపై కురుకుచున్నది! అందఱము బాణంబులఁ బ్రయోగింపవలెను.

(ముగ్గురును బాణంబులు ప్రయోగింతురు)

భరత—అన్నన్నా! నీబాణము తప్పిపోయినది! నాబాణముతో నా వ్యాఘ్రము పరలోకమునకేగినది.

ప్రభా—అదిగో! మరియొక ఘోరమృగము! ఈ బాణంబుతో దానిని వధించెదను చూడు (అని బాణమునుఁ బ్రయోగించి మఱియొక పులినిఁ జంపును)

విమల—మృగంబులన్నియు మృతిఁజెందినవి! బాటసారులు మూర్ఛఁ జెందినట్లున్నది. వారిదరిఁజేరి సేదఁదీర్చెదమురండు.

## ద్వితీయ రంగము.

[మాధవుఁడు, సరోజని ప్రవేశము.]

సరో—మనోనాయకా! మీరు నన్నెంత మోసము చేసితిరి. మీ కపటనాటకమంతయు నాకు బట్టబయలైనది! మీ చర్యలు శ్రీకృష్ణభగవానుని చర్యలవలె మహాద్భుతంబులుగా నున్నవే!

తే॥ కల్లకపటంపు మెరమెచ్చు • పల్లదంబు, లాడి బహుభార్యలోలుఁడై • యరుగఁదగునె
అష్టమహిషుల నేలిన • యిష్టదేవు, లీలలను మెచ్చియటుజేయఁ • బోలునొక్కొ.

మాధ—(రిచ్చపడి) ప్రేయసీ! నీకుఁ దెలసినవిషయమేది! విషయంబు దెలుపక నన్ను దూషింపుట న్యాయమగునా!

సరో—ప్రాణనాథా! మిమ్ము దూషించుట లేదు. హిందూపతివ్రతామణి నాథుని దూషించినచో నామె కిహపరలోకంబులు గలవా? నేనార్యమతావలంబనము జేసితిఁగాన నాకసూయాద్వేషంబులు లేవు? మీతో సంసారసుఖంబు లనుభవించుటకును గష్టసుఖంబులఁ బాల్గొనుటకును నాకెట్టి యధికారముగలదో యంతకన్న సహస్రగుణంబు లధికమైన యధికారము గలవనితారత్నమొండు లేదా? మీ రానాఁడు పిచ్చిమానవురాలని యాస్పత్రికి బంపినవనితారత్నమును, అముద్దులబాలుఁడునుఁ బరమ పతివ్రతామతల్లియైన మీప్రథమభార్యారత్నమును మీపిల్లవాఁడునుగారా? పరదేశంబుల మీరు వంచనఁజేసినన్ను బెండ్లియాడుట యామెయెడఁజేసిన మహాపరాధముకాదా! ఆయిల్లాలు మిమ్ము న్వేషించుచువచ్చినను, నామెనుఁ బరిభవించుట న్యాయాన్యాయవిచక్షణ దక్షులగు మీవంటివారికి ధర్మమా?

మ॥ ననుమీరెన్నఁడుఁ జూడకున్న మునుపే • నారీశిరోరత్నము
న్ఘనతన్బెండ్లియాడలేదె? సుతుని • న్గాంచంగలే దేమటన్
నను బెండ్లాడుము బ్రహ్మచారిననుచున్ • నన్మోసముంజేయవే
తనుజున్నన్నవె భార్యపిచ్చిదనుచు • న్దండించి పోఁద్రోయవే.

మాధ—ప్రేయసీ!

చ॥ కలగనుచుంటివో కథలు • గల్పనఁజేసి వచింపుచుంటివో
ఫలరహితంబులౌపలుకు • బల్కి వినోదము లాచరించెదో
పలుకులసత్యమై వెలుఁగఁ • బల్కఁగ నేలనె నీవెఱుంగవే
యలికుల వేణి నే నెఱుఁగ • నన్యసతీమణి కూర్మి నెయ్యముల్.

నే నేమియొనర్చినను నీపైగాఢానురాగంబువలన నే గదా జేసితిని! అట్టి యఖండస్వార్థత్యాగంబునకు నేను బూజ్యుఁడను గావలసినవాఁడనే గాని నీవలనఁద్యాజ్యుఁడ నెట్లగుదును! కాని యెంతహృదయపరివేదనతో నాయిల్లా

లిని బాసితినో, యెట్టి దుఃఖవేదనాదందహ్యమానుఁడనై సంపూర్ణచంద్రచంద్రికాకాంతిని భాసిల్లు నాముద్దుల కుమారుని నెడబాసి పరితపించుచుంటినో యాపరమేశ్వరునకే తెలియవలెను! నాహృదయంబునకే తెలియవలెను.

ఉ॥ ఎంతటిమోహతాపముల ♦ నింపువహించెదు భార్యవీడి నే
నెంతగ జాలిమాలి గదు ♦ హీనత కన్నకుమారుఁదన్నియా
కంతుశరాళిఁగుందుచును ♦ కాని విదేశపుకాంతఁగూడితిన్
వింతలు గాఁగఁదోచెనొకో ♦ వెర్రికి వేయివిధంబు లుండవే.

సరో — ప్రాణప్రియా! ఆప్రభావతియుఁ బిల్లవాఁడునుఁ దిరిగి వచ్చినచోఁ గైకొందురా! లేక యడ్డదిడ్డపుఁ బ్రసంగంబులు జేసి, వారినితిరిగి వెళ్ళఁగొట్టెదరా?

మాధ — దేవీ! ఏమియిట్లడిగెదవు! నేనువారిని గైకొను టెట్లు సంభవించును! నీవు సవతికయ్యంబున కెట్లనుమతింతువు! నాఁడు నీ వివాహసమయంబున నేను నావారినందఱిని ద్యజించి నీపాణిగ్రహణంబొనర్చితిని గదా? ఆప్రమాణంబునకుఁ గట్టుబడియే యిప్పుడు ప్రభావతినిఁ బిల్లవానినిఁ బరిత్యజించితిని! ఈ జన్మలోఁ దిరిగివారిదర్శనభాగ్యంబుఁ గలుగదు! కలిగినను వారును మనమునుఁ గలసియుండుటకు వీలులేదు. ఆకారణంబుననే వారినట్లు పిచ్చివారియాస్పత్రికంపితిని! అచట ప్రభావతి బ్రతికియున్నదియో వియోగసాగరంబునమునిఁగి మృతినొందినదో తెలియనైతి.

సరో — ప్రాణనాయకా! ముందుండిన చెవులకన్న వెనుకవచ్చిన కొమ్ములువాడియైనట్లు, మిమ్ముఁబ్రథమంబున వరించిన ప్రభావతికంటెను నే నెక్కువదాననైతినా? నే నెట్లు మిమ్మువరించితినో యామెయట్లు వరింపలేదా? నేను మీ ప్రభుత్వపువారివంశంబునఁ బుట్టినమాత్రంబుననే నా కొశంబు పైనుండి యూడిపడితినా? నాముఖంబునఁ జుక్కలుఁబొడిచెనా? ఆంగ్లవనితరత్నమైనంతమాత్రంబున నడుగులకు మడుగులొగ్గి పూజింపవలెనా! అవనితారత్నము యుత్తమబ్రాహ్మకుల సంభూతయైనను, నామెతల్లిదండ్రుల ధనసహాయ్యంబున మీరట్టి మహోన్నతదశకు వచ్చినను, నామెను గన్నెత్తిచూడనైనఁజూడక, యష్టకష్టంబులొంది తనకుఁ దా మిమ్మన్వేషించుచు వచ్చినను నాపరమపతివ్రతామణినిఁ బిచ్చియాస్పత్రియందుఁ బెట్టించి, మీగర్భవాసంబునఁ బుట్టిన కుమారరత్నంబునుఁ గాలితోఁదన్ని త్రోసివైచెదరా! మీకు దయాదాక్షిణ్యంబులు, కరుణాసౌహార్ద్రంబులు లేవా?

మ॥ పతిదైవంబనికొల్చు భార్యసుతునిన్ ♦ వర్జించి మోహాంధుఁడై
పతితుండై భువినన్యదేశ సతిని ♦ న్వాంఛించి పెండ్లాడుదే
యితరుల్మెత్తురె తానువల్చినసతుల్ ♦ యెట్లైనరంభానొకో
కతుకంబోయిన చొటికొలువలెటు ♦ ల్గంగన్సరినొప్పునే.

మాధ—ప్రేయసీ! మండుచున్న కాయంబునఁ గొలిమిఁబెట్టి కాల్చినట్లు విషాద దోధూయమానుండనైన నన్ను హృదయవిదారకంబులగు పలుకులచే నేల నొప్పించెదవు! పశ్చాత్తాపతప్తుండనైతిఁ గాని కింకర్తవ్యతామూఢుండనై యూరకుంటిని!

సరో—మనోనాయకా! ఆ ప్రభావతి నిపుడు రప్పించిన నామెను గైకొందురా? లేక తిరిగి వెళ్ళఁగొట్టెదరా?

మాధ సఖీ! నీవు నాతోఁ గాపురముఁ జేయుచున్నంతకాలముఁ బ్రభావతి యీయింట నడుగుఁబెట్టుటకు వీలులేదు! నీ మాట అంగీకరించెదవు! నేను జేసిన ప్రమాణము నెట్లు తప్పఁగలను.

సరో—నాథా! మీకు నావలన భయమక్కఱలేదు. ఈగృహంబున కాపురంబుఁ జేయుటకుఁ బ్రభావతికున్న యధికారము నాకు లేనే లేదు!

మ॥ మునుమున్నుట్టిన యాత్మకర్మములఁ దా•పోఁదోఁచి యా వెక్కఁదో
చినకొమ్మల్నెరివాడియై పొడువ వా•శించెదుఁగాదే ధరన్
ఘనమౌ బ్రాహ్మణవంశజాత సతిని • న్గాదంచుఁబోఁదోఁచి మ్లే
చ్ఛను పెండ్లాడి విమోహతాపములచే • జాలిన్బడిన్గూలెదే.

నేను విజాతికన్యను! నామోహంబున మీరు జాతిమతభ్రష్టులై మీబంధువర్గంబునకెల్ల దూరమైతిరి! మీ ప్రేయసి సేవఁ బాసితిరి! కన్నకుమారునిఁ గాలఁ దన్నితిరి! ప్రభావతి మీతోఁ గాపురము జేయుచున్నను నే నామెను గాని మిమ్ముఁగాని ద్వేషింపను! మీరు మీకుమారుని ప్రభావతిని విడనాడిన పాపఫలంబువలన నేమో మనకు సంతానభాగ్యము గలుగలేదు! నేను మిమ్మును మాయక్క ప్రభావతిని, మన కుమారునిఁగూడ సేవించుచుండెదను! హిందూ ధర్మశాస్త్రప్రకారము ద్వితీయభార్యా స్వీకరణంబుఁ దప్పుగాదు! లేదా మీ కంగీకారంబు గానిచో మీరు ప్రభావతితోడనే గాపురంబుఁ జేయుఁడు! నేను మీకందఱకును భరతవర్షంబునకును సేవఁజేసి నాజన్మ సార్థకంబుగావించుకొనెదను! లేకున్న సన్యాసాశ్రమంబుఁ గైకొని హిందూసంఘసంస్కరణంబునకై నా జీవితంబు ధారవోసెదను! మీరు ప్రభావతితోఁ గాపురంబుజేయుట కంగీకరింతురేని నే నామెను బిలిపించెదను.

మాధ—ప్రేయసీ! ఇది యెట్టి స్వార్థపరిత్యాగము! విదేశకన్య నీవెచట! హిందూవనితామణి ప్రభావతియెచట! మీయుభయులును గలసి కాపురంబుఁ జేయుట సాధ్యమగునా?

సరో—మనోనాయకా! నేను హిందూధర్మ మవలంబించినను నన్నింకను విదేశకన్యఁగా నే తలంచుచున్నారా? మీయంగీకారంబుఁ దెల్పుఁడు! మాయక్కనిచ్చి మీకు ద్వితీయస్వయంవరంబొనరించెదను,

మాధ — ప్రాణనాయకీ! నీకాక్షేపణలేదేని యట్లే గావింపుము! నేను నీభృత్యుండను! గదా?

సరో — నాథా! మీరు మాభృత్యులైనచో మాయాజ్ఞాపరిజ్ఞుల వర్తించుచుండుఁడు నే నిప్పుడే పెండ్లికూతురును తీసుకొనివచ్చెదను, మీరు వేచియుండుఁడు. (సరోజిని నిష్క్రమించి ప్రభావతితోడను కృష్ణమూర్తితోడను దిరిగి ప్రవేశించును)

సరో — అక్కా! అదుగో నీప్రాణనాథుఁడు ముసిముసి నగవులతోఁ గ్రొత్తపెండ్లి కుమారునివలెనున్నారు! ఇంతకాల మజ్ఞాతదీక్షనుండి తిరిగి నీప్రాణనాథుని గలిసికొంటివి. మీ కిద్దరికిఁ బాణిగ్రహణ మహోత్సవంబు సలుపవలెనని నామనంబువ్విళ్లూరుచున్నది! చిన్నవాఁడు మీతలిదండ్రులెట్లొనర్చిరో వివాహంబు నేనెఱుంగ! దేశభ్రష్టులై విడిచిపోయిన ప్రాణనాథుని బ్రసన్నుని జేసుకొని వారిఁజేసుట ద్వితీయస్వయంవరమే! నీకరంబిటులిమ్ము (అని పుచ్చుకొని) నాథా! మాయక్కను దిరిగి వివాహమాడుఁడు! ఏది మీహస్తము! అటుల సిగ్గుపడి వెనుదీసెద వేమి! కట్నము గావలెనేమో - ఇదుగో కట్నము మీయొత్తు ధనముబోసిన దొరకని మీ కుమారరత్నము - మీరు దుష్యంతుఁడు, మాయక్క శకుంతల, యీ పిల్లవాఁడు భరతుఁడువలె నున్నారు. వారిచారిత్రంబాచంద్రతారకంబైనట్లు మీచరిత్రయు నాచంద్రతారకం బగుఁగాక! (అనియుభయులకు బాణిగ్రహణంబొనరించును).

మాధ —

సీ॥ కోపమా లలితాంగి ♦ కోమరారబిగియారఁ, గౌఁగిలింపఁగనైతిఁ ♦ గఠినుఁడంచు
నేరమా కమలాక్షి ♦ నీమేలునరయక, పాఱదోలితినంచుఁ ♦ బద్మగంధి
రోషమా పద్మాక్షి ♦ దోసని తిట్టితినంచు, మోహంబుఁదిగఁద్రావి ♦ మెఱుఁగునగుచు
నాగ్రహంబా నీకు ♦ నల్లారుపనికూనఁ, గాలఁదన్నితినంచుఁ ♦ గమలనయన

తే॥ చేసినవియెల్ల దురితము ♦ ల్వాసిదొఱఁగి, బుద్ధిహీనుండనైతినిఁ ♦ బ్రోచికావు
తప్పుసైరింపుమింక నో ♦ తలిరుఁబోఁడి, దాసుతప్పుల క్షమియింపు ♦ దండమిడుదు

ప్రభా — నాథా! తప్పులెల్ల నావియేగాని మీవికావు! శీతలకరుణాకటాక్షవీక్షణంబులు నాపైఁబ్రసరింపఁజేసి నన్నుగైకొంటి రదియే పదివేలు! ఇఁక మీపాదపద్మంబులఁ గొల్చి మీసేవకురాలిహపరసౌఖ్యంబు లందఁగలదు.

సరో — నాథా!

ఉ॥ పావనపుణ్యశీల నను ♦ బ్రాయఁపుఁబ్రేజవరాలు లేశముఁ
భావమునందు నిన్మఱచి ♦ పాపముఁగట్టుకొనంగలేదు నిఁ
సేవలభక్తితోఁగొలిచి ♦ కీర్తియుసంపద నందఁగోరు నీ
వావనజాక్షిఁ గైకొనుమ ♦ యందుమనంత విభూతిసంపదల్॥

(కుమారునిచే మ్రొక్కించి)

తే॥ పూర్ణశశిఁబోలు ముద్దుల ♦ మోమువాఁడు, లేతనగవులు గలవాఁడు ♦ నీతిచరితుఁ
డతులితానంద సంధాయి ♦ యమలకీర్తి, శోభనకరుండు ముద్దాడు ♦ సుతుని బ్రేమ

శా॥ ఏయేదేశములందుఁ గ్రిమ్మరియెనో ♦ యెచ్చోటఁ బ్రార్థించెనో
యేయేపుణ్య నదీనదంబులను తా ♦ నెబ్భంగి వర్తిల్లెనో
యేయేదైవములన్ననుం గొలెనో యే ♦ యే మానులం గాంచెనో
యాయాపుణ్యతపఃఫలంబునను ని ♦ న్నాత్మన్వరించెన్ జుమీ॥

శా॥ అక్కా నీపరితాపమున్మఱవుమ ♦ మ్మా నీకుకష్టంబులిం
కిక్కాలంబునకెల్లఁ బాసెనుజుమీ ♦ యింక న్సుఖంబందుమీ
యెక్కాలంబున కేది వచ్చునొగదా ♦ యెవ్వాఁడెఱుంగున్మదిన్
నిక్కంబింతయు నీదుపుణ్యతపమే ♦ నిన్గాచెఁగల్యాణిరో॥

## తృతీయ రంగము

[పద్మిని కాషాయవస్త్రధారిణియై ప్రవేశించును.]

ఛీ! ఛీ! ఎంత పాపిష్ఠపుబ్రతుకు బ్రతికితిని! కులవృత్తియగుఁగాక పడుపువృత్తి న్యాయమగునా! సదసద్వివేక విజ్ఞానంబుగలవు మానవజన్మమెత్తి, యుక్తాయుక్త వివేచనాదక్షనై, యజ్ఞానాంధకారంబు నడంచు సుజ్ఞానం బభ్యసించి, తుట్టతుదకు మదోన్మత్తనై క్షణభంగురంబులగు కామోపభోగంబు లనుభవించుటకు నాదేహం బన్యులకు విక్రయించితినిగదా!

సీ॥ విత్తంబుగడియించి ♦ పేరుఁబెంపునుగోరి, వెలయాలివృత్తికి ♦ వెఱవనైతిఁ
గామాంధకారంబు ♦ గనులపైఁ గప్పంగఁ, బడుపు వృత్తికిలోంగి ♦ భంగపడితి
సరసులు గుమిగూడఁ ♦ బరిహాసకము జేసి, మరుబాధలనుముంచి ♦ మాయజేసి
రసికశేఖరులెల్ల ♦ రంజిల్లనటియించి, ధనధాన్యములఁగూర్చి ♦ దర్పమంది
తే॥ లోకమందున ననుబోలు ♦ లోలనయన, లెందులేరంచు గర్వించి ♦ క్రిందుమీఁదుఁ
గానకుండితి గర్వంబు ♦ గడచిపోయి, వ్యాధిబాధయుఁ దలసూపె ♦ వయసుగడచె
ముదిమిదాపయ్యె మృత్యువు ♦ వెదకవచ్చె.

జన్మమా? నీచాతినీచమగు భోగకులంబున! అవలంబించిన వృత్తియా? పురుషులను మోహాంధకార నిమగ్నులనుగావించి, మరుకేళిసంతసింపఁజేసి వారి సంపదలను హరించునట్టి పడుపువృత్తి! రూపరేఖావిలాసాదులందు దేవలోకమునందలి రంభా; మేనకా; తిలోత్తమాది దివ్యాప్సరసలను దలఁదన్నుటచే; యువకులు నా క్రీగంటిచూపులకు భ్రమసి; నామోహజాలంబుందగిలి, యగ్నిహోత్రంబునఁబడి నాశనంబందు శలభంబులవలె సంపదలెల్లఁ గోల్పోయి నాశనంబందిరి!

సీ॥ గర్భవాసమునందుఁ ♦ గన్నబిడ్డలఁబ్రోవ, ధనధాన్యములులేక ♦ తల్లడిల్లి
పరిణయంబాడిన ♦ ప్రాణేశ్వరికిఁజెందు, నగలునాణెంబులు ♦ పాగడియొసగి

తల్లిదండ్రులుగూర్చ్చు ♦ నిల్లువాకిండ్లను, నప్పులవారికి ♦ నమ్మివైచి
ముక్కరుధాన్యంబు ♦ లెక్కలమునఁబండు, నీనాముపొలముల ♦ దానమొసఁగి
తే॥ మేడిపండునుబోలిన ♦ మేల్మిపూతఁ, దలఁచిమోహించి భోగంపు♦ దన్వితోడ
గలసిమెలఁగుచు యౌవన ♦ గర్వమొప్పఁ, బుట్టుభోగులు జోగులై ♦ పోయిరకట.

అట్టి రసికశేఖరుల ధనధాన్యంబులును, గృహారామగుందిరంబులును, ధనకనక వస్తువాహన సమృద్ధియు నా స్వాధీనంబులై నాయిల్లు నిత్యకల్యాణము పచ్చతోరణముగా మహోన్నతవైభవంబందుచుండె! మహోన్నతోత్తుంగ రమ్యహర్మ్యంబుల, శారద రాకాచంద్రచంద్రికలయందు, హంసతూలికా తల్పంబున రసికశేఖరులతోఁ గలిసిమెలసి యనంగ సామ్రాజ్య పట్టాభిషేకంబుఁ గట్టుకొంటిని! నందనోద్యానవనంబుల, నల్లిబిల్లిగా నల్లుకొనిన యుత్ఫుల్ల మల్లికా ప్రసూన లతా గృహంబుల, పుష్పశయ్యల, వనమయూర శుకశారిక కోకిలాలాపంబు లాకర్ణించుచు యమందానందకందళిత హృదయారవిందనై కాలంబుఁ గడపితిని, దివ్యసౌధాంతరంబుల నవరత్నమణిమయ విభూషితంబులగు భూషణంబులుదాల్చి జిలగల పట్టు పీతాంబరంబులు, చీని చీనాంబరంబులు ధరించి యిష్టమృష్టాన్నకలన సంతుష్టురాలనై దాసదాసీ జనంబులు పరివేష్టించికొలువ రసికశిఖామణులు మోహానురాగంబులఁ జేరికొలువ నానందసాగరంబున మున్గి వత్సరంబొక క్షణంబుగా జీవనంబుఁగడపితి!

కాని కటకటా! యెందఱు పతివ్రతామతల్లులు దమసంసార సౌఖ్యంబు గోలుపోయిరోగదా! ఎందఱు సతీమతల్లులు దమప్రాణనాధులు నన్నుఁ గొలుచుచుండ రాత్రిందివములు మోహావారాశిని మునింగి తపించిరోగదా! ఎందఱుమానినీమణుల భాగ్యభోగ్యంబులు నేనుహరించి, వారిభర్తల సన్యాసులనుజేసి తిరిపమెత్తించితినో గదా! నామూలంబున నెన్నిసంపన్నగృహంబులు తమ భాగ్యభోగ్యంబులంబాసి గర్భదారిద్ర్యంబున కాలవాలమైనవోగదా?

ఉ॥ ఎందఱు బాలికామణులు ♦ హెచ్చగునాపదఁ బొందినారొకో
యెందఱుభామ లాత్మహృద ♦ యేశ్వరుఁబాసి కృశించినారొకో
యెందఱుమానహీనత వ♦హింపఁగఁజాలక నగ్నిఁగూలిరో
యెంద అసూర్యపశ్యలగు ♦ నింతులు భోగము లెల్లబాసిరో.

అసూర్యంపశ్యలగు నెందఱు సుదతీరత్నంబులు తమ యఖండైశ్వర్యంబును బాసి, తమ భర్తలు నాదర్శనంబునకుఁ బడఁగాపులుగాఁ బడియుండ, జీవిత సౌఖ్యంబులెల్లఁ గోల్పోయి తమ పసిబిడ్డలు క్షుధాపీడితులై పలవించుచుండ నాహారపానీయంబు లొసంగుటకు శక్తిలేక, తమ జీవితంబులు బలాత్కారణంబునఁబాసి, యీ ఘోరపాపంబులు నా నెత్తిపైఁద్రోచిరోగదా? కోటికిఁ బడగెత్తి యఖండైశ్వర్యంబునఁ దులఁదూగుచుండిన పేరిశెట్టి నా గృహంబుఁ బావనంబుఁ జేయుటతోడనే యతిచంచలయగు లక్ష్మీదేవి యతని మందిరంబు

వీడి నా గృహంబున స్థిర నివాసంబుఁ జేయుచుండె! సంపదలతోఁ దులఁదూఁగుచున్న పద్మనాభుఁడు నా స్నేహ మొనర్చినతోడనే యతనియైశ్వర్యంబు నన్నుఁ జేరి యతఁడు బుక్కాపకీరయ్యె! అతని గృహారామంబులు నా స్వాధీనములయ్యె! అతని మడిమాన్యంబులు నా హస్తగతంబులయ్యె! పాప మాతని యిల్లాలు గంగిగోవువంటి పరమసాధ్వీమణి! తెల్లని నెల్లఁ బాలును, నల్లని నెల్ల నీళ్ళనని తలంచు యమాయకురాలు! ఆ సతీమణి యమూల్యాభరణంబు లెల్లఁ బద్మనాభుఁ డెత్తుకొనివచ్చి నాకర్పించె! ఆసుదతీరత్నంబు విభూషణరహితయై కంఠంబున మంగళసూత్రంబునకు బదులుగాఁ బసుపుకొమ్మునుధరించి ప్రాణనాథుని పదంబులే గొలుచుచుండెను. కాని నేనో యాభూషణంబులన్నియు హరించి మరునాఁడే పేరిశెట్టినిమఱుఁగి పద్మనాభు నింటిలోనికి రానీయక వేడ కలాబిఁ గొట్టించితిని! తగిలిన కాలే తగులును. నొగిలినకొంపే నొగులునన్నట్లా మానవతీమణి కుమారునకు వ్యాధికన్పించి, గర్భదారిద్ర్యంబుచే నౌషధసేవఁ జేయు దిక్కులేక యా ముద్దుల కుర్రఁడు మరణంబుఁజెందె! కటకటా పుత్రశోకం బెట్లా వనితామణి భరించెనోగదా! ఆసద్వంశం బష్టకష్టంబు లనుభవించుటకును, వారిని గర్భదరిద్రులను గానొనరించి "యన్నమోరామచంద్రా" యని పలవింపఁజేయుటకునుఁ గారణము నేనేగదా? గతజన్మంబుల నెట్టి ఘోర పాపంబు లొనర్చుటచేతనో యీ భోగకులంబున జన్మించి, ముసలి ముతక, యగ్రజన్ములు కనిష్టజన్ములనక, కులశీలవయః ప్రాయంబులు విచారింపక, చీకు, ముసలి, గుడ్డి, కుంటి లోభివారలను ధనంబునకై యాశించి సుఖపరవశులంజేయుటయే వృత్తిగాఁ గైకొంటి. యౌవనమా నశించె! శరీర సౌందర్యంబా మాటుమణఁగె! విషయసౌఖ్యంబుల యాశయా మాయమయ్యె! శిరోజంబులుఁ దెల్లనై రాలిపోనాయె! స్వరంబు డగ్గుత్తికపడియె! ముఖ మండలంబుపై వళులు గానవయ్యె! శరీరంబా వార్ధక్యంబునకు నానావిధరోగంబులకు నాలవాలమయ్యె! ఇట్టి మరణావసాన సమయంబున నాకీ సంపదలతోను భోగసౌఖ్యంబులతోను గలుగు నానందమేమి! నే నెవరి ధనసంపదల హరించితినో వారి కెల్లరకు నా సంపదఁ బంచియిత్తును! ఆసేతు శీతనగమధ్యోర్వీతలంబగు భరతఖండంబునకు దుర్భరకళంకంబైన యీ పడుపువృత్తి నిర్మూలనంబగుటకు సర్వవిధంబులఁ బాటుఁబడెదను! నా యైశ్వర్యంబును గురించి చేయవలసిన యేర్పాట్లొనరించి దానిని ప్రభుత్వంబున కర్పించెదను.

సీ॥ సంగీతసాహిత్య ♦ చతురతఁ గనవచ్చి, భోగులెల్లనుపట్టి ♦ జోగులైరి
రూపురేఖలఁజూచి ♦ రొక్కంబు వెదఁజల్లి, ధనధాన్యములఁబాసి ♦ దాసులైరి
కామాంధకారంబు ♦ గన్నులఁగప్పంగఁ, మేడమిద్దెలాసంగి ♦ గోడువడిరి
సానికొంపలఁజేరి ♦ సంసారమదిరోసి, భార్యబిడ్డలవీడి ♦ భంగపడిరి

తే॥ దల్లిదండ్రులఁ జుట్టాల ♦ ధర్మబోధ, పెడచెవినిఁబెట్టి వ్యభిచార♦గోడవలందు
మత్తు సారాయములద్రావి♦ మదము హెచ్చి, పుట్టుభోగులుజోగులై♦హోయిరకట.

ఉ॥ చేసితి ఘోరపాపములఁ ♦ జేసితిఁ జెప్పఁగరాని దోషముల్
గాసిలిఁబెట్టి విత్తములు ♦ గట్టిగలాగితి యౌవనంబుచే
దోసమెరుంగనైతిఁగడు ♦ దుఃఖముఁజెందితిఁ గామమోహముల్
బాసె వయస్సు పైఁబడియె ♦ వచ్చెడు మృత్యువు నేఁటరేపటన్.

నా కిపుడు సర్వదోష లతాలవిత్రింబగు శ్రీ హరినామస్మరణంబే జన్మ పావనము.

## చతుర్థరంగము

[విమలాదిత్య శర్మ పద్మనాభునకును, ప్రభాకరశర్మ యచ్యుతునకును, భరతశర్మ విక్రమునకును బరిచర్యలుఁ జేయుచుందురు.]

విమ—పద్మనాభా! మీగాయము నేఁటితోనయమైనది! మీకు బాగుగా స్వస్థత చేకూరెనా?

పద్మ—మిత్రమా! నీసహాయంబునఁ దిరిగి పునర్జన్మ మెుందితిని, నీ యొనర్చిన మేలా జన్మాంతము మఱవను.

ప్రభా— అచ్యుతా? మీకారోగ్యంబుఁ గల్గెనా ! మా పటపటీరంబుననుండుటకు మీకెంతకష్టముఁ గల్గెనో? మీపూర్వచరిత్రంబుఁ జెప్పెదనంటిరి చెప్పెదరా?

అచ్యు—ప్రాణసఖా! చెప్పుటకేమున్నది! తల్లిదండ్రుల పోరుఁబడలేక పరమ పతివ్రతామతల్లియైన యిల్లాలి నింటనుండి వెడలఁగొట్టి భ్రష్టాగ్రేసర చక్రవర్తినై తిరిగి నాయిల్లాలి నన్వేషించుచు నిట్లడవులు గుట్టలుబట్టి తిరుగుచున్నవాఁడ.

చ. వనములఁదాపసావళిని ♦ భక్తిని గొల్చి విరాగియయ్యెనో
ఘనమగు మోహతాపమునఁ ♦ గాయముఁబాయఁగ నూతఁగూలెనో
వనధినిఁగూలి ప్రాణములు ♦ వాసెనో, క్రూరవిషంబుఁద్రావెనో
యనలమునందుఁజొచ్చినదొ ♦ యక్కట కష్టములేమి పొందెనో.

విమలా—కట్టుకొన్న పెండ్లాము కొంపదీయుట కచ్యుతుఁడు గొప్పవాఁడే! పద్మనాభా! నాప్రాణమిత్రుఁడవైన నీవట్టి ద్రోహివికాదుగదా? నీవేల యరణ్యంబునఁ జిక్కువడితివి!

పద్మ— మిత్రమా! క్షమింపుము! నేనచ్యుతునికన్న నధమాధముఁడను. వారాంగనవలలందుఁ జిక్కి యిల్లును వాడలును బాడుజేసుకొని, భార్య నెడఁబాసి, కాశీప్రయాణంబుఁజేయుచు నీయరణ్యంబునఁ జిక్కువడితిని.

చ. కొడుకును బాసి, కోమలిని ♦ ఘోరతరంబగు మోహవార్ధిలోఁ
బడి మునుగంగఁజేసియును ♦ బంధులయాప్తుల నీతివాక్యముల్
పెడచెవిఁబెట్టి తండ్రికినిఁ ♦ బేరిమిఁగూర్చెడుకన్న తల్లికిన్
గడు పరితాపమున్గలుగఁ ♦ గాఁగలవిత్తముఁ ద్రోచిపెట్టి రో
సడఁతిని బాగుజేసితిని ♦ వమ్మొనరించితి సర్వసంపదల్.

భరత—అటులైన మీరిద్దఱు నొకరినిమించిన వారు మఱియొకరు! సరసాగ్రగణ్యులు గనిక శేఖరు లందుమా? లేక యిసుకతక్కడగాఁడు పేడతక్కడగాఁడని బిరుదు లిత్తుమా! విక్రమా? నీవరణ్యంబునకు వచ్చుటకుఁ గారణమేమి!

విక్రముఁడు—మిత్రమా! నేను మోహించిన వనితారత్నంబు నామె తలిదండ్రులొక ముసలివానరంబున కిచ్చి వివాహంబుఁ జేయఁ బ్రయత్నింప నాబాలికామణి పుట్టినింటినుండి పాఱిపోయె! నేనాబాలిక నన్వేషించుచుంటిని!

పద్మ—స్నేహితులారా! మీ యాదరాతిశయంబునను, మీయాతిథ్య సత్కారంబు కలనను మేము మరణావస్థనుండి తప్పించుకొంటిమి! మేము మీకుఁ గృతజ్ఞులము!

విమలా—మీరుమాకేగాదు! మిమ్మాజన్మాంతము చేరికొల్చి మీపాద సేవకురాండ్రైన మీయర్ధాంగులకుఁగూడఁ గృతజ్ఞులరే? మీరు మీ యర్ధాంగులయెడ నెట్టి కృతజ్ఞతఁ జూపితిరో మాయెడలఁగూడ నటులే చూపెదరుగాఁబోలు! అది యటులుండనిండు! మీ మీ వనితామతల్లుల రూపరేఖావిలాసాదులను వర్ణించి నారు కారేమి! పతివ్రతల వర్ణనము పాపనిర్మూలమందురు గదా! మేమును గర్ణరసాయనముగా నాలకించి ధన్యులమయ్యెదము!

విక్ర—మిత్రులారా! మీరుమమ్ము బరమరహస్యములను గుచ్చిగుచ్చి యడుగు చున్నారుగదా? మీకీయరణ్యవాసం బెందులకు సంభవించెనో యొక్కమాట యైనను జెప్పరేల!

భరత—చెప్పుటకేమున్నది పరమరహస్యము! వడ్లగింజలోనిది బియ్యపుగింజ! మీముగ్గురి ప్రాణంబులను రక్షించుటకే మేమీయరణ్యవాసము! దుష్టశిక్షణ శిష్టరక్షణము లొనర్చుటయే మావంటిధర్మాత్ములకు నిరంతరదీక్షకదా?

విమ—సోదరా! చూచితివా వీరిటక్కరితనము! మనగుట్టును మట్టును దెలుసుకొని వీరు మనలను శత్రువులకప్పగింపఁ జూచుచున్నారు! మన మెక్కడికైననుఁ బాఱి పోవుదమా!

ప్రభా—అగును! నాకును భయమగుచునే యున్నది! పోయిదాగుట కెలుకకన్న మైననులేదు! శత్రువులువచ్చిననుఁ దోచుకొనిపోవునదేమి! ఈ వల్కలాజినంబులను, ఈనారచీరలను, ఈదర్భాసనంబులు బుడ్డిచెంబులను, కందమూలఫలంబులను, ఈహరిణశుకశారికాపవన మయూరశాబకంబులను దీసుకొనిపోవలెనుగాని మనయొద్ద వజ్రవైడూర్యమరకతమాణిక్యాది నవరత్నంబులేమైనను గలవా? నవనిధానంబులు గలవా? దుకూలమాల్యానులేపనంబులుఁగలవా దోచుకొనుటకు!

చ॥ కలితదుకూలవస్త్రములుఁ ♦ గాంచనభూషణ తారహారముల్
సలలిత మందిరంబులునుఁ ♦ జక్కనిమేడలు దివ్యభూములుఁ
విలువగు రత్నరాశులును ♦ బెంపువహించెడి మేల్ధనంబులుఁ

గలవని కొల్లగొట్టఁగను ♦ గ్రిచ్చర తస్కరులెల్ల వచ్చినన్
ఫలితమునున్న దొంగకును ♦ బట్టువడుట్ ఘుటమొందుమాత్రమే.

భరత — సోదరా! నీవుపచించినది నిక్కమే!

ఉ॥ ఎక్కడ మేల్మిసౌధములు ♦ నెక్కడమందిర సుందరాకృతుల్
ఎక్కడ వారకామినులు ♦ హెచ్చువిలాసపు మోహతాపముల్
ఎక్కడ నీ కుటీరములు ♦ నిట్టితపోవిభవంబు జూడ వా
రిక్కడి కేలవత్తురిఁక ♦ నేటికిఁ బ్రాణభయంబు సోదరా.

పద్మ — మిత్రులారా! మీరుమమ్మెఁ గేలిసేయనక్కఱలేదు! మేము బ్రథమంబున దుర్మార్గులమైనను బశ్చాత్తాపంబు నొందితిమి!

విమలా — పశ్చాత్తాపంబు నొందకిప్పుడేమి యున్నది! "వృద్ధనారీపతివ్రతా"యని యందురుగదా! ఉన్నదంతయుఁ దుడిచిపెట్టుకొని పోయినతరువాతఁ బశ్చాత్తాపము, శ్మశానవైరాగ్యము రావలసినదే! గతజలసేతుబంధనముకదా!

సీ॥ వారాంగనలగూడి ♦ వయసువమ్ముగఁజేసి, కాషాయమునుదాల్చు ♦ ఘనుఁడొకండు
దుష్టవర్గముఁగూడి ♦ తుళ్ళిగంతులువైచి, తులసిపూసలఁదాల్చు ♦ తులువయొకఁడు
సారఁబ్రాందియుఁద్రాగి ♦ సానికొంపలఁమ్రగ్గి, వేదాంతములుబల్కు ♦ వెధవయొకఁడు
ధనధాన్యములుమాపి ♦ దారిద్ర్యమును బొంది, ధర్మంబులను జెప్పు ♦ శర్మయొకఁడు
తే॥ భార్యబిడ్డలఁబితరుల ♦ బాధపెట్టి, జపముధ్యానంబుజేసెడు ♦ జడుఁడొకండు
దొమ్మరిలఁదూరితొత్తుల ♦ తోడమెలఁగి, చెప్పుఁగ్రొత్తగనీతులు ♦ జేరియొకఁడు.

ప్రభా — సోదరా! నిక్కంబు! ఈఘోటక బ్రహ్మచారిత్వమును గపటవైరాగ్యమును వీరికి వనితామణిసందర్శనంబు గలుగునంతవఱకే! ప్రపంచమునందందరును శుకుఁడు, హనుమంతుఁడు, భీష్ముఁడు మొదలగు మహామహులవలె నస్ఖలిత బ్రహ్మచారులగుదురా!

చ॥ శిరమును బోడిజేసుకొని ♦ సిగ్గునువీడి, విభూతిదాల్చుచున్
గరమున భైక్ష్యపాత్రమును ♦ గల్గినమాత్రనె మోక్షమబ్బునే
దురితమువాయునే మనసు ♦ దుష్కలుషంబుల నెంచకుండునే
సరసిజనేత్రిపై వలపు ♦ సయ్యనఁబాయునె శాంతినిల్చునే.

విక్రమ — నేనువరించిన కన్యకామణి నాకులభ్యమగువఱకును నేనస్ఖలిత బ్రహ్మచారినే. అంతవఱకును మోహంబునకును నాకును సగవెఱుక!

భరత — లేతలేతసొరకాయ లెన్నియైననుఁ దెగనరుకవచ్చునుగాని మోహబంధంబులఁ ద్రెంపుట సాధ్యముగాదు!

చ॥ వనమున దూరిన న్నిరము ♦ బాగుగముండన మాచరించినన్
ఘనతఁ గషాయవస్త్రములఁ ♦ గట్టిన లేక వివస్త్రుఁడైన నా
కును నలమున్ భుజించినను ♦ ఘోరముగాఁ దపమాచరించినన్
వనజదళాక్షిపై మరులుఁ ♦ బాయునె మోహము మానిపోవునే.

చక్కని చంద్రబింబాస్య కనఁబడినంతనే గుటకలు మ్రింగని పురుషోత్తముఁడున్నాఁడా!

చ॥ ధనముల మీఁద నాశ వని♦తామణిపై ననురాగ మోహముల్
కనకవిభూషణంబులును ♦ గాంతివిభాసితమందిరంబులున్
ఘనమగు కీర్తి గౌరవముఁ ♦ గాంచఁగఁ గోర్కెయుఁ దృష్ణ లేనిచో
మనుజుఁడు దైవతుల్యుఁడగు ♦ మాన్యుఁడతండె తలంచి చూచినన్.

పద్మ—మిత్రులారా! మీ చరిత్రంబు జెప్పుమని యడిగినందులకా రహస్యంబులు చెప్పక పోఁగా మమ్మధిక్షేపించి యీ యనవసర ప్రసంగములు జరుపుట?

విమ—అప్పుడే యంత యుడుకబోతు తనమెందులకు లోకసామాన్య విషయంబుఁ జెప్పునపుడు గుమ్మడికాయల దొంగయనిన భుజములనుఁ దడవిచూచుకొనవలెనా? మీ పేరెత్తితిమా! మీ యూరెత్తితిమా! ఐనను పాపిష్ఠికాలము! నిజమాడిన నిష్ఠూరము, నారాయణా యనిన బూతుమాట! నిజము చెప్పిన నబద్ధమువలెఁ గన్పించును, నా కెందులకు! నా చరిత్రమడిగినారు గాన దాపక చెప్పుచున్నాను వినుఁడు.

చ॥ కొడుకును బాసి కోమలిని ♦ ఘోరతరంబగు మోహవార్ధిలోఁ
బడిఁ మునుగంగఁజేసియును ♦ బంధుల యాప్తుల నీతివాక్యముల్
పెడచెవిఁబెట్టి తండ్రికిని ♦ చేరమిఁగూర్చెడు కన్నతల్లికిన్
గడుఁబరితాపమున్గలుగఁ ♦ గాఁగల యాస్తిని దోఁచి పెట్టి రో
పడఁతిని బాగు చేసిన కృ♦పాళుని భార్యను బ్రాణమిత్రమా.

పద్మ—ప్రేయసీ! ఎన్నిదినంబులకు నీ సందర్శన భాగ్యము లభించెను! నా నేరములన్నియు క్షమించి యాలింగన భాగ్యమను గ్రహింపుము (అని కౌగలించుకొనఁబోవును. విమలాదిత్యుఁడు దూరముగా తొలఁగును).

విమలా—వారాంగనలు లేనప్పుడు కులాంగనలు పనికివత్తురుకాబోలు! మీ కేమి మదఁపుఁబిచ్చి లేదుకదా! పురుషులైనది స్త్రీలైనదిగూడఁ వెలియకఁ వర్తించుటయేనా?

చ॥ పురుషవరేణ్యులంచు మదిఁ ♦ బొంగుచు క్రిందును మీఁదెఱుంగకే
పరపురుషావళింగదియ ♦ భావ్యమె కన్నులు లేకపోయెనే
పురుషులొ పద్మగంధులొకొ ♦ బుద్ధినెఱుంగవె హాస్యమాత్రకై
సరసిజనేత్రనంచనినఁ ♦ జయ్యనఁబైఁ బడనెంతు వక్కటా.

చ॥ తపము వినాశమొందెఁగద ♦ దానము ధర్మము వమ్మొనర్చెదే
జపము విరాగముల్ త్రిటిని ♦ జంబుగ వీడఁదలంచి తక్కటా
కపటులు దుష్టవర్తనులు ♦ గంజదళాక్షులు వారినమ్మినన్
సఫలతజెందునే తపము ♦ సాగునె యోగము మోక్షమబ్బునే.

నవ్వుటాలకు నిన్ను వెక్కిరించిన నింత రాద్ధాంత మొనర్చితివిగదా! పాప మీ నాఁటికిఁ బెండ్లామనిన బెల్లముగా నున్నది గాఁబోలు! నీవంటి వారవనితా రసికాగ్రగణ్యునకుఁ బెండ్లాము బాగుండునా! వారాంగనల రసికత్వము పెండ్లాడిన పెండ్లామున కుండునా.

పద్మ—మిత్రమా! మనోవ్యథా భారంబుచేఁ గృంగియున్న నన్ను నీ హాస్యంబుచే నేల మఱింత నొప్పించెదవు.

విమల—అటులైనఁ ద్రికరణశుద్ధిగా వచింపుము! నీ ప్రేయసి నీయదృష్టము బాగుండి నీ కంటఁబడిన నామెను గైకొందువా? లేక పరిత్యజించి సన్యాసాశ్రమంబున నే యుండెదవా?

పద్మ—నా కెందులకువచ్చిన సన్యాసమిది! తప్పక తిరిగి గృహస్థాశ్రమమవలంబించెదను! నా సతీమణి యెక్కడనున్నదో వచింపుము.

విమలా—ఆలోచించి చెప్పెదను. అచ్యుతా! నీమాటయేమి?

ప్రభా—సోదరా! అచ్యుతుఁడు వెర్రి పద్మనాభుఁడుగాడు మెత్తపడుటకు; చేతులారా నింటిలోనుండి వెళ్లఁగొట్టిన భార్యను గైకొనుట కచ్యుతుఁడు వెర్రి వెంగళప్పయనుకొంటివా?

అచ్యుతుడు:—మిత్రులారా!

ఉ॥ మాసె సమస్తసంపదలు • మాసె ధనంబులు ధాన్యరాశులున్
మాసె యహీనవైభము • మాసె ననిందిత కీర్తిశోభలున్
మాసెను భూషణావళులు - మాసెను మాన్యములిండ్లు భూములున్
మాసెనుఁ గీర్తిగౌరవము • మావనితామణినన్ను బాయఁగన్.

ఉ॥ తిండికి బట్టకున్నఱపు • దీనత హెచ్చెను, బంధుకోటిలో
మెండపకీర్తియు న్గలిగె - మేటిసుకీర్తియు నాశముం గనెన్
బండగుకాపురంబునకుఁ • బాయనిమచ్చయు సంఘటిల్లె నా
యండజయానఁగూడి మను • నంతటి భాగ్య మిఁ కెన్నఁడబ్బునో.

ప్రభా—ఏటిమాటలు! దగ్గర లేనంతసేపు వాపోవుటయేగాని దగ్గరకు వచ్చిన తరువాతఁ చీవాట్లును చెప్పుదెబ్బలేగదా! ఈ కూడీ కూడని కాపురఁపుఁ బెంట విరగడైపోయినదని నీభార్య యెచటఁ గాలముగడపుచున్నదో! మొంగవాఁడవు నీ కేమయ్యా? యాఁడుదానివలె వాపోయెదవు! ఎప్పుడింటినుండి తరిమివేసినావో యప్పుడే మరణముఁ జెందినదనుకో! ఘటశ్రాద్ధముఁజేసి నావంటిదాని నెవ్వరినో పెండ్లాడరాదా? అప్పుడు నీవును నేనును టింగురంగాయని రతిమన్మథులవలెఁ గాలము గడపవచ్చును.

చ॥ అలకలురాచి పువ్వు కుసు•మాళి నలంకరణంబుఁజేసి కో
మలమగు బాహువల్లరుల • మందముగాఁ బెనవైచి ప్రేమతో

సలలితమాధురీమహిమఁ ♦ జక్కని పాటల ప్రొద్దుఁబుత్తునే
నలిపుల వేణులింతకును ♦ నాదర మెక్కుడు జేతుకే నినుఁ.

ఉ॥ ఆటలనాడువాఁడ నిను ♦ బాయిగ సౌఖ్యపయోధిముంచెదన్
బాటలఁబాడి కేరెదనుఁ ♦ బల్లవపాణులు సిగ్గుఁజెందఁగన్
దేటగుముద్దు పల్కులనుఁ ♦ దియ్యనిమోవాము సొంపుఁబెంచెదన్
గాటపు మన్మథాంబకఁపుఁ ♦ గాయము మాన్పెదఁ బ్రాణమిత్రమా.

అచ్యు—మిత్రమా? యేటిమాటలు! పురుషులు పురుషులనుఁ బెండ్లియాడుదురా! మీసోదరుఁడు పద్మనాభుని గేలిచేసినట్లు నన్ను గేలిసేయన్యాయమా! సంతాప భారంబునఁ గ్రుంగుచున్న నన్ను రక్షించు నుపాయంబాలోచింపుము ! ఆ యరణ్య మృగంబుల వాతఁబడిన నీవిరహబాధఁ దప్పించుకొనెడివాఁడనే! నీవు నన్ను రక్షించియు నా కపకారం బేయొనర్చితివి!

ప్రభా—అగును! మేము నీ కొనర్చినది యపకారము, నీవు నీభార్య నిల్లువెళ్ళఁ గొట్టినది యుపకారము! ఎవరితప్పు వారెఱుంగని కలికాలమువచ్చినది!గురివింద గింజ తన నలుపుఁ దానెఱుంగదు!

ఉ॥ ఆలినిగొట్టి గెంటనగు ♦ హానియొనర్పుచుఁ దిట్టఁగానగున్
హేళనఁజేసి నిందలను ♦ హెచ్చుగమోపి కఠోర చింతనం
బాలోనరించి వాతలను ♦ బాగుగఁ బెట్టఁగఁజేతు లాడెడిన్
లాలనఁజేసి ప్రేమము వె ♦ లార్చుటకింతయు నేరరెవ్వరున్.

అచ్యు—(స్వగతము) ఇతనికి నాభార్యనుఁ గొట్టుటయుఁదిట్టుటయు, వాతలుఁబెట్టుటయును గురించి యెట్లు తెలిసెను? ఇతని రూపరేఖావిలాసంబులుఁ జూచినచో మా యనసూయ లక్షణంబులే గాన్పించుచున్నవి. ఇదేమి మాయయో! (ప్రకాశముగా) మీరు మాకుటుంబరహస్యము లెల్లెఱింగితిరో గదా! మా యనసూయ జాడ యెఱింగినచోఁ దెల్పిపుణ్యముఁగట్టుకొనుఁడు.

ప్రభా—అనసూయ యెవతె! నీభార్యారత్నము కాఁబోలు! పాప మింకెక్కడి యనసూయ! చచ్చియేలోకంబున నున్నదియో?

అచ్యు—అయ్యో! అయ్యో? అనసూయా? (అనిమూర్ఛిల్లిన యందఱుఁ బరిచర్యఁజేసి మూర్ఛఁదేర్తురు).

విమలా—సోదరా! ఎట్టికఠోరంపు వార్తఁదెల్పితివి! ఆమె బలవన్మరణముఁబొందనున్నపుడు మనమామెకు ధైర్యంబుఁగూర్చి యామె దుష్ప్రయత్నంబులుమాన్పి, యామెభర్త నన్వేషించి తెచ్చెదమని శపథంబొనర్చితిమిగదా? అసంగతిఁ జెప్పక యిట్టి విడ్డూరంపువార్తఁ బల్కితివేమి !

ప్రభా—అనసూయ, యనసూయ యని కలవరించుచునుండ నిజమైన ప్రేమయో లేక వట్టి భేషజమో కనుఁగొనుట కట్లుఁ బల్కితిని! ఇంతలో మునిఁగిపోవునదేమియు లేదు! నిజముగా నామెయెడఁ బ్రేమయున్నయెడల నామె సందర్శనంబుఁ

జేయుంపుమని మనలను వేడరాదా! అప్పుడేయామెను దీసుకొని వచ్చి యతని పదపద్మంబుల సన్నిధిఁ బడవైతుముగదా!

అచ్యు—(సేవఁదేరి)

ఉ॥ సోదరులార నాయనుఁగు • సుందరదివ్య విలాసులార మి
మ్మాదర గౌరవంబులను • నాత్మఁబ్రశంసయొనర్చి వేడెదన్
నాదగు బంగరుంబ్రతిమ • నా సుగుణంబుల భాగ్యరాశియున్
నాదుతపః ఫలంబుఁ నిక • నాకనుఁదమ్ములఁ జూడఁగల్గునే.

మిమ్ము గడ్డంబుఁ బట్టుకొని బ్రతిమాలెద. నాప్రాణనాయకినిఁ జూపి పుణ్యముఁ గట్టుకొనుముఁ.

ప్రిభా—(దూరముగఁబోవుచు) గడ్డముఁబట్టుకొనిఁ బ్రిణయ కోపముఁ దీర్చుటకు నేను మీప్రాణనాయకి ననుకొంటెరా! మీరింతపరితపించు చుంటిరిగాన,మీభార్యను మీకుఁజూపిన నాకేమి బహుమాన మొసంగెదరు!

అచ్యు—మీరేమికోరిన నది యొసంగెదను.

ప్రిభా—అవజ్రఁపు టుంగరం బొసంగుఁడు.

అచ్యు—(గిచ్చఁబడి) మీ కీ యుంగరమే కావలెనా! వేఱువస్తువును గోరఁజాలరా?

ప్రిభా—

ఉ॥ చాలును జాలుఁ నీదుసర•సత్వము సత్యము గానవచ్చెనే
జాలిమనంబుతో వెదకి • జాయనుఁదోకొని వచ్చియిచ్చినన్
వైళమ ప్రేమభావమున • వజ్రఁపు టుంగరమీయలేవు నా
కేలనుఁ గష్టనష్టము లిఁ•కేలఁ బ్రయాసము,వ్యర్థ దంభముల్.

మీ ప్రేయసిని మీరే వెదకికొనుఁడు! మీ ప్రాణాపాయము నుండి రక్షించి మీ వ్యాధులను మాన్పి, మీ మోహంబునుఁ దీర్చి మీ ప్రాణనాయకిని మీకుఁ గూర్చుట బద్ధకంకణంబుఁ గట్టుకొన్నందులకుఁ జెప్పుతోఁగొట్టి బుద్ధిఁ జెప్పినారదియే పదివేలు. రేవుదాటినతరువాతఁ దెప్పఁ దగులవేయువారు మీవంటివారే కాఁబోలు!

అచ్యు—మిత్రమా! నన్నుక్షమింపుము! కారణం బరయకయే యాగ్రహపడెదవేమి! నావలనఁ దప్పున్నచో శిక్షింపుము.

చ॥ పరిణయమాడుకాలమునఁ • బద్మదళాక్షిని బాయకంచు నా
దరమున మామనాకొసఁగెఁ • దధ్యమునమ్ముము తన్వఁబాసి యుం
గరమును జూచిప్రాణములు • గట్టిగఁదాల్చుచు నున్నవాఁడ బం
గరువగ లిత్తునోపనులుఁ గ్రిన్ననఁజేసి ఋణంబుఁ దీర్తునో
సరసిజనేత్రినన్నయిచి• జాయనుఁజూపుము నీకుమ్రొక్కెదన్!

ప్రభా—చాలుజాలు లెండి యీయాపదమ్రొక్కులు! అటులైన మీకీ యుంగరమే గావలెఁగాని మీ ప్రాణనాయకి యక్కఱలేదన్నమాట! సరియే! మీ యుంగరమునే ప్రాణేశ్వరిగాఁదలంచి గుటకలుమ్రింగుచుండుఁడు! సోదరా! రమ్ము మనము పోవుదము. (అని పోవుచుండఁగా నచ్యుతుఁడు వారినాపును.)

అచ్యు—మిత్రమా! యిట్టి సంకట పరిస్థితులయందు బావమఱఁదివలె నింత హేళనఁ జేసెదవేల! ప్రాణములేని యుంగరమెక్కడ? ప్రాణేశ్వరియెక్కడ! ఉంగరమొసంగి ప్రాణేశ్వరుని దెచ్చుకొనఁజాలని మూర్ఖశిఖామణి ననుకొంటివా? ఉంగరమిదే గైకొనుము! (ఉంగరమిచ్చును) నీటముంచిననుఁ బాలముంచినను భారమునీదే! నా ప్రాణేశ్వరిని జూపుభారము నీపైనుంచితి!

ప్రభా—అట్లు మార్గములోనికివచ్చి మాయగ్రహమును సంపాదింపుఁడు! మీ ప్రేయసిని వారమురోజులలో సర్వజనానుగ్రహ పాత్రుఁడైన మాధవరావు కలక్టరు గారింటికిఁ బంపితును. మీరచటకు విచ్చేయుఁడు.

విక్ర—మిత్రులారా! నాప్రాణమును రక్షించితిరి! నాస్నేహితులయొక్క భార్యల నన్వేషించి వారి కప్పఁజెప్పుచుంటిరి! నా దీనదశనుజూచి, నేనువరించిన తన్వీరత్నము భారతి యెచ్చటనున్నదో చెప్పి పుణ్యముఁ గట్టుకొనరా?

భారత—మిత్రమా! "యేడ్చెడుదాని మొగఁడు వచ్చిన నా మొగఁడును వచ్చు"నని పూర్వ మొకయిల్లాలు ధైర్యము వహించినదట! అట్లే నీస్నేహితులు మోహ వారాశిలో మునకలువేయుచుఁ బరితపించుచుండ, వారలను రక్షింప వారి భార్యలు నడుముఁ గట్టుకొని వచ్చుచుండఁగా నీ(ప్రేయసిమాత) మేలరాదు! నే నష్టకష్టంబులంబడి నివరించిన బాలికామణినిఁ గలక్టరుగారి గృహంబు నకుఁ దీసుకొనివచ్చెద! ఏమి బహుమానము! అరువుబేరముగాదు! ముందు బహుమాన మొసంగి తరువాత తరుణీరత్నంబునకై కనిపెట్టుకొనియుండవలయు నీముద్రిక నొసంగదవా?

విక్రముడు—అట్లేఁ గైకొనుము! నా ప్రేయసినిమాత్రము తక్షణము తీసుకొని రావలయును.

పద్మ—మిత్రమా! నాప్రాణనాయకి సందర్శనమెప్పుడు.

భారత—మీ ముగ్గురియొక్క తరుణీరత్నంబులను నేఁటికి వారమురోజులలో నాది వారమునాఁడు కలక్టరుగారింటికిఁ బంపెదము! అటకేగి మీరు వారిని వరింపుఁడు.

# పంచమాంకము

## పంచమరంగము

తిరుపతికొండపై నొక యాశ్రమము, ఒక ముని జపమొనరించుచుండును. ప్రక్క నొక యోగిని పరిచర్యలు జేయుచుండును.

ముని—(జపమాలఁ ద్రిప్పుచుఁ గన్నులు దెరచి).

హరేరామ హరేరామ రామరామ హరేహరే
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే॥

సాధ్వీమణి! నీవు చాలా కాలమునుండియు నాకుఁ బరిచర్య లొనరించుచున్నావు! నా సహాయ్యంబున నీవఁగల్గుఁ బ్రయోజనమేమి!

చ॥ మునులము సాధువర్యులము ♦ మోదము ఖేదము వీడి సర్వదా
మునికుల రక్షకున్ హరిని ♦ మోదముతోడ భజింతుమిట్టి మ
మ్మనిశముఁ గొల్చువారలకు ♦ నందఁగ రాని ఫలంబులుండునే
వనరుహనేత్రినన్గొలువ ♦ వచ్చిన కారణమేమి దెల్పుమా.

యోగిని—తపోధనాగ్రగణ్యా! మీకుసపర్యలొనరించుటచే నాజన్మ ధన్యంబయ్యె! మీ దర్శనభాగ్యంబుచే నాజన్మతరించె! మీ శీతలకరుణా కటాక్ష వీక్షణంబులు నాపైఁబఱపి నన్ను దుఃఖవారిధినుండి దరింపఁజేయ వేడుచున్నాను.

ఉ॥ అంగన లేతబ్రాయమున ♦ నాదరమొప్పఁగఁగూడి యాడి వే
భంగుల స్నేహమున్నలిపి ♦ పల్మరు సౌఖ్య రసాబ్ధిఁ దేల్చి న
న్నంగజు బాణబాధలకు ♦ నర్పణఁజేసి మదీయనాథుఁడే
భంగినిఁ గాలమున్గడపఁ ♦ బొల్పడెనో తెలియంగఁ జెప్పుమా.

ముని—మానినీమణీ! ఏల దుఃఖముం దెదవు! నీ పరితాపంబుఁ దీర్పఁ దిరుపతి వెంకటేశ్వర దైవంబునకు సాధ్యంబుగాని మావంటి మానవ మాత్రులు జేయునదేమియు లేదు.

ఉ॥ తల్లిని దండ్రిని న్విడిచి ♦ తొల్లిటివేల కషాయవస్త్రముల్
ఉల్లము దుఃఖమందగను ♦ యోగతపంబులుఁ బూననేలొకో
పిల్లలు లేరె? నీ గృహము ♦ వీడి విరాగము గొంటివేలనీ
వెల్ల యుదంతమున్దెలుపు ♦ మేల హృదీశుఁడు నిన్నుఁ బాసెనో.

ఉ॥ నాథుఁడు నీదుపైనలిగి ♦ న్యాయముమాలి పరాభవించెనో
వేదనపాలుఁ జేయుచును ♦ వెంగలియై కడుఁగొట్టి తిట్టెనో
క్రోధముఁబూని కష్టములుఁ ♦ గోర్కులు దీర్పఁగ లేదటంచునిక్
బాధలుఁబెట్టి పొనడఁచి ♦ భంగము పాలొనరించెనో గదా.

చ॥ నగలునుఁ దారహారములు ♦ నాణెములౌ మణిభూషణంబులున్
సొగసగు మేల్మివస్త్రములు ♦ సుందరమందిర రాజవాసముల్

ధగధగ లాడురత్నములు ♦ తళుక్కు మెఱుంగు లౌసంగువస్తువుల్
జగతిని లేనివింతలనుఁ ♦ జాలఁగఁగోరుచు భర్తకెప్పుడా
పగటునసహ్యతక్ గొలిపి ♦ వేదన పాలొనరించినావొకో.

ఏకారణంబున నీభర్త నిన్నుఁబాసెను ? కారణము లేనిది కార్యముపుట్టదు కదా? "యత్రధూమ స్తత్రవహ్నిః" యని పెద్దలుఁ బల్కెదరు! పంచప్రాణంబులు నీపైఁబెట్టుకొన్న నీ ప్రాణనాథుఁడు నిర్నిమిత్తంబుగా నిన్ను వీడునా? నమ్ముటకు శక్యముగాకున్నది.

యోగిని—మహానుభావా! ఏమి చెప్పుదు! దుఃఖమువలన నోటమాటరాకున్నది! నా లోపమువలననే నామనోనాథుఁడు నన్ను విడిచినాఁడు.

ముని—సతీరత్నమా! ఏమిలోపము.

ఉ॥ మానిని భర్తదైవమని ♦ మానసమందు నెఱుంగవొక్కొ నే
దీనుఁడు కూరుఁడైన యతి♦ధీబలసంయుతుఁడైనఁ గాని య
జ్ఞానము నందునున్నను ర ♦ సజ్ఞతగూడిన లేకయుండినన్
మానవతీమణుల్ మదిని మానక ♦ నాథునిగొల్వఁగావలెన్

యోగిని—మునివరరత్నమా! బాల్యమాదిగా నాచరిత్రంబు విన్నవించెద నాలింపుఁడు? నాజనకుఁడు గొప్పయుద్యోగియై యుండఁగా వారి యాజ్ఞానుసారముగా నేను హూణవిద్యాభ్యాసం బొనర్చితిన్, తుదకువారి యాజ్ఞనుల్లంఘించి డాక్టరు పరీక్షఁజదివితిని.

ముని—బాల్యంబున జననీజనకులయాజ్ఞ నుల్లంఘించిన నింకపెద్దదాననైనతరువాతఁ బ్రాణనాథునియాజ్ఞ తిరస్కరించుట కష్టముకాదు. కన్నతల్లి కర్ణపుష్పంబులుఁ ద్రెంపిన కూరాగ్రేసరునకుఁ బినతల్లిదుద్దులుత్రెంపుట బీరపువ్వులుగోయుట గదా!

యోగిని—డాక్టరు పరీక్షఁజదువుచుండఁగా నచట సర్వశుభలక్షణ సంపన్నుండును సుగుణాలవాలుండునుఁ గుశాగ్రబుద్ధియు నగు మధుసూదనుఁడను నొకవైద్య విద్యార్థితో స్నేహంబుఁగలిగెఁగాని హూణవిద్యాగర్వాతిరేకంబునను ఈశ్వరసృష్టిని సర్మజనులును సమానులను నభిప్రాయంబువలనను నాయజ్ఞత్తవలనను నన్ను వివాహమాడవలయునని మధుసూదనుఁడును, నొక తురష్కుఁడును, నిమ్నజాతీయుఁడునుఁ బోరాడి, తుదకుమధుసూదనుని గాయఁబఱచి నన్నా తురుష్కుఁడేకాంతగృహంబున బంధించె.

ముని—పాపము! నీబంధనంబు మధుసూదనుఁడు విడిపించెనా? లేక నీవేవిడుపించుకొంటివా?

యోగిని—మానిచంద్రమా! ఆతురుష్కమందిరంబున నే నష్టకష్టంబులుఁ బడుచుండ నొకమానవతీమణి చెలికత్తెగావచ్చినన్ను విడిపించి నన్నుఁబాసిచనియె! ఆ చెలికత్తె రూపరేఖావిలాసాదులఁ దర్కించిన కొలఁదిని నాప్రాణనాథుఁడైన

మధుసూదనుఁడే వచ్చినన్ను విడిపించెనని తోఁచుచున్నది! నాబుద్ధిమాంద్యంబు వలనను, దుఃఖసముద్రంబున మునిఁగియుండుట చేతను నా చెలికత్తెయే మధుసూదనుఁడని యప్పుడు గ్రహింపఁ జాలనైతి !

చ॥ కటకట యెంతగానిలుచుఁ ♦ గష్టములన్భరియించు చుండెనో
తటతటమంచు గుండియలు ♦ దద్దయుఁ గొట్టుకొనంగసాగెఁ నేఁ
బటుతరమైన శ్రద్ధఁగొని ♦ పట్టణముల్ విపినంబులెల్లనో
క్కటఁ గలయంగఁనంతటనుఁ ♦ గాంచితి నందని మ్రానిపండునా
యటునిటునెల్ల జూచితిని ♦ యందనిమ్రాని ఫలంబురీతిగన్
నెటఁగనుపింపఁ డేమిగతి ♦ యెట్లుభరింతు వియోగతాపముల్.

ముని—సుదతీమణీ! నీప్రాణనాథుఁడని చెప్పుచుంటివి! నీవాతనినెపుడు వివాహమాడితివి.

యోగిని—మునికులతిలకా! నేనాతని వివాహమాడలేదు! వివాహమాడఁదలంచితిని. ఏమట్లునవ్వెదరు !

ముని—(నవ్వుచు) నీ తెలివితేటలకు నవ్వకేమిచేయమనెదవు! ఎప్పుడో చిన్ననాఁటి స్నేహితుడఁట! పెండ్లిగిండ్లికాలేదు. చిన్నపుడే విడిచిపోయినాఁడు! అతనిని గూర్చి విరహామా! ఈవిశాలవిశ్వప్రపంచంబున నతఁడుతప్ప నీకు వివాహమాడుటకితరులు గనుపింపలేదా? సేతుశీతనగపర్యంత భూమండలం బన్వేషించి యతనిని వెదకఁదలంచుచో నీ జన్మమే గాదు నూరుజన్మములైనను జాలవు.

ఉ॥ ఈవిరహంబు నోరువక ♦ యేటను నూతిని వహ్నిఁగూలెనో
భావమునన్విరాగమున ♦ భస్మముఁదాల్చి మునీంద్రుఁడయ్యెనో
నీవలెనిన్ను నాతఁడును ♦ నేమముతో వెదుకంగఁ బూనెనో
మీవెతవేంకటేశ్వరుడే ♦ మెచ్చితొలంగఁగఁ జేయఁగావలెన్.

సతీమణీ! నేనొకరహస్యంబుఁ బల్కెద నాకర్ణింపుము.

చ॥ మిసిమిసెసంగు ప్రాయమును ♦ మేలగువిద్యయు సద్గుణంబులున్
రసికతయున్గలట్టియొక ♦ రమ్యవిలాసఁపు సుందరాంగుపిన్
వెసవరియించి వైభవము ♦ వెచెలగంగ సుఖింపరాదొకో
యసమశరుండె మాధవుఁ ♦ డహా! యిఁకనన్యువరింపరాదొకో.

యోగిని—మునిచరిద్రమా! మీరెఱుంగని న్యాయంబును ధర్మంబులును లేవు. త్రికరణశుద్ధిగా వరించిన ప్రాణనాథునివీడి యన్యులను వివాహమాడుమని పల్కుట తమవంటి మహాత్ములకుఁ దగునా! భరతవర్షంబున మానవతీరత్నంబులు తమ మనస్సున వరించినవారిని వీడి యితరులను వివాహమాడనొల్లరని తమకు తెలియనిదికాదు.

ముని—సతీమణీ! నేను నీవిరహంబుఁ జూడఁజాలక యిట్లు పల్కుచున్నానుగాని వేఱుగాదు! అతనిని వరించుట ధర్మమే! కాని సాధ్యాసాధ్యంబులు చూడ

కలదా? కొండమీఁది కోతి రావలయునన్న లభ్యమగునా? ఇప్పుడతఁడే దేశంబుననున్నవాఁడో! నీతిక్క తిరిగిన తరువాత నీవాతని వివాహమాడఁదలంచినను వాతఁడు నిన్నంగీకరించునో? యంగీకరింపఁడో? అతఁడింతకు పూర్వమే యన్యసతీమణిని వివాహమాడెనేమో? అతనికై వట్టి యడియాసలు బెట్టుకొని భూమండలంబంతయుఁ దిరిగి వేసటఁబొందనేల! నామనవిఁ జిత్తగింపుము.

చ॥ సరసుడనాదు నేను సర♦సంబులనెంతయు జాణవీవు నేఁ
బరవనితామణిన్మదిని ♦ వాంఛయొనర్పఁగ లేదు సుమ్ము నీ
చరితము రూపమున్సుగుణ♦సంపద నా మదికింపుఁగూర్చన
న్వరునిగఁగోరి సమ్మదము♦ వాంఛితమున్సమకూర్పుకోమలీ!

ఉ॥ అంగనలెందఱో తిరిగి ♦ యంగజబాధ విరాళిఁ బొందుచున్
బొంగివివాహమాడఁగను ♦ బోరిరిగాని యదేమికర్మమో
నింగినిమీనమేషములు ♦ నిక్కచు లెక్కడుచుంటిఁగాని వా
రింగమనింప నైతిని వ♦రించితినన్నిఁకఁ బెండ్లి యాడుమా.

యోగిని—కపటచరితా! దంభవ్రతా!

ఉ॥ నీకపటంపు మౌనమును ♦ నీ మునివేషకషాయ వస్త్రముల్
నీకుటిలంపుఁ బల్కులును ♦ నీబకవృత్తియు ధర్మవాక్యముల్
నీకలుషంపు యోగమును ♦ నీదుతపంబును గొప్ప జేసితిన్
నాకిటఁగీడుఁ గోరుట మ♦నంబున నెంచఁగనైతినక్కటా.

చ॥ అబలను కష్టమందుఁబడి ♦ యక్కట నాథునిగూర్చి సౌఖ్యముం
బ్రబలఁగ జేయుదీవనుచుఁ ♦ బ్రార్థనసేయఁగ శిష్యురాలనే
నబము శుభంబెలుంగ నను ♦ న్యాయమె యిట్లు వివాహమాడు మం
చుఁ బలుకునీవు సంయమివి♦ సూరిజనుల్ నినుఁ బెద్దఁజేతురే

ముని—సతీతిలకమా! ఇదియా నీయాక్షేపణము!

సూరిజనులెవరు! మన సౌఖ్యంబులను గమనింపవలెను గాని లోకులెవరో యాక్షేపించెదరని మన సౌఖ్యంబులఁ గోలుపోదుమా!

క॥ కనులకు నింపుసొంపొసఁగు ♦ కన్యలరూప విలాసరేఖలన్
మనమున మెచ్చఁగాఁదగదె ♦ మానిని కోమలబాహువల్లికల్
గొని ముదమారఁ గౌఁగిటనుఁ ♦ గూర్పఁగఁ బాపము నెత్తిఁ గూలునే
నిను విడువంగనోపఁ దరుణీమణి! ప్రేమను గారవింపవే.

చ॥ ఇట నను డించిపోవఁ మది♦నిచ్చజనించెడు నీకుగాని నే
నెటు నినుబోవనిత్తునిది ♦ యేటిచమత్కృతిచాలుఁ జాలు నేఁ
దటుకున బెండ్లియాడుదును ♦ తన్విశిరోమణి నిన్నుపూలతోఁ
బటుతరపూజసల్పెదను ♦ భక్తిమెయింగయికొమ్ము వేడెదన్.

ఉ॥ సుందరమందిరావళుల • సొంపగు బంధురకాననంబులన్
విందగు పూలతోటలను • వేడుక మీఱ నదీతటంబులం
దందముఁ జందమున్గలుగు • హర్మ్యములందును బెక్కురీతులన్
విందుల నారగించుచును • వేవిహరింపఁగ రమ్ము కోమలీ!

ఉ॥ జీవితమా? క్షణంబు మన•సేగద సౌఖ్యనిదానకంబు నిన్
భావమున న్వరించితినిఁ • బద్మదళాక్షిరో గైకొనంగదే!
యీవయసు న్బ్రమోదమును • నెప్పుడు శాశ్వతమంచు నెంచెదే?
యౌవనజాక్షిరో సుఖము • లొందుము, ప్రాణము నిల్పు మ్రొక్కెదన్.

యోగిని — కపటమౌనివర్యా! నీవు పయోముఖవిషకుంభము వంటివాడవు! తృణావృత కూపసన్నిభుండవు! గోముఖవ్యాఘ్రంబవు! నిన్ను నమ్మి నేమోసపోయితిని.

మ॥ తపముం జేసినదానికి న్ఫలము ఛీ! • తన్వింజెఱన్ బెట్టుటే
జపముం జేసి పరాంగనాతతిని ని•చ్చుం బట్ట న్యాయంబొకో
కృపయుం ధర్మము శీలము న్మఱచెదే • క్రూరత్వముం జూపెదే
యపవర్గంబెటు గైకొనన్గలవు నీ • వజ్ఞానివై మూఢుఁడా!

చ॥ ననుఁ జెఱఁబెట్ట నెంచినను • నమ్ము వృథాశ్రమ మౌను సుమ్ము నే
ఘనముగఁ బ్రాణము న్విడుతుఁ • గంజదళాక్షుని సంస్మరించుచున్
అనలమునందు దూకెద మ•దాయువుపీడ విషంబుఁ ద్రావుదున్
ననుఁ జెనకంగ వచ్చినను • న్యాయవిధి న్వధియింతుఁ జూడుమా.

(అని తననడుమునుండి కృపాణముఁ బెఱికి మీఁదిడుకఁ బోవును)

ముని — సతీమణీ! నేనొర్చిన కఠినపరీక్ష సైరింపుము.

మ॥ అకటా నిక్కము పల్కువాఁడ వినుమా • యబ్జాక్షి! యెల్లప్డు నీ
నికటంబందుననుండి లేశమయినన్ • నీకష్టము న్బాపకే
ప్రకటంబౌ బహుదుఃఖముల్గడిచినన్ • బ్రజ్ఞావిహీనుండనై
సుకముం బాపితి మాధవుండను సుమీ • చూపింపు దాక్షిణ్యమున్.

చ॥ తురకలు బోరువాఁడు నను • ద్రోచిన కారణమద్దియే మొ? నే
నిరతము నీదు ప్రేమము నె • నిష్కపటంబుగఁ గోరియుండితిన్
గరుణవహించి గైకొనుము • కంజదళాక్షిరొ వేడువాఁడ నన్
మఱచినదానవో గనుము • మాధవుఁడన్నిను బ్రేమఁ గోరితిన్॥

సరస్వతీదేవీ! నీవును నేనును విద్యాభ్యాస మొనర్చుకాలంబున నీవు వ్రాసిన ప్రేమలేఖలివియే వీక్షింపుము! కఱకుతురకల హస్తంబులనుండి నిన్ను సంరక్షించునపుడు నాకుఁ గలిగిన గాయంబులు వీక్షింపుము! నిన్ను తురుష్కుల మందిరంబునుండి మాధవీరూపంబునఁ దప్పించి నిన్ను మెప్పించిన నీవొసంగిన యమూల్యాంగుళీయకం బిదె పరిశీలింపుము! నీకొఱకై భరతఖండంబంతయుఁ దిరిగి

తిరిగి వేసారి, నీ సందర్శనంబునకై సకల భక్తజనాభీష్ట సంధాయకుండగు తిరుపతి వేంకటేశ్వరు పదసాన్నిధ్యంబున మౌనవృత్తి నవలంబించియున్నవాఁడ! నా భాగ్యదేవతవు. నీవు నన్నన్వేషించుచు వచ్చుటచే నాజన్మము కృతార్థంబయ్యె! నానోములు ఫలించె! నన్నుఁగైకొనుము.

యోగిని—ప్రాణనాథా! నాతప్పు సైరించి నన్ను బ్రోవుఁడు! వెదుకఁబోయిన తీఁగె పాదంబులఁదగిలినట్లయ్యె! నేను నీ దాననే! మన పాణిగ్రహణ మహోత్సవంబు తిరుపతి వేంకటేశ్వర పదపద్మసాన్నిధ్యంబుననే జరుగుఁగాక!

## షష్ఠమరంగము

[కలక్టరు మాధవరావు మందిరము. ప్రవేశము- మాధవరావుభార్యలు సరోజని, ప్రభావతి; పద్మనాభుఁడు, అచ్యుతుఁడు, విక్రముఁడు]

ప్రభావతి—సోదరీ! సరోజినీ! వీరెవరో నీ వెఱుంగవు గాఁబోలు! పద్మనాభుఁడు, అచ్యుతుఁడు నాచెల్లెండ్ర భర్తలు, విక్రముఁడు పద్మనాభుని సోదరి భారతి వరించిన వన్నెకాఁడు, ఈ యచ్యుతశర్మ నాచెల్లె లనసూయాదేవిని తల్లిదండ్రుల యాజ్ఞచే నిల్లువెడలఁ గొట్టించెను.

సరోజని—అక్కా! అచ్యుతశర్మ జగదేక ప్రతాపుఁడన్నమాటే! మనచెల్లెలు వీరితో సంసార సౌఖ్యమనుభవించుటకుఁ గాపురంబునకు వెళ్ళెనా? లేక వీరి తల్లిదండ్రుల కూడిగంబుసల్పి చెప్పుదెబ్బలుఁ దినుటకు వెళ్లెనా! మనసోదరి యిక్కడ లేక యెన్నికష్టంబులు గుడుచుచుండెనో? వీరు మాత్రము పెండ్లికుమారుల వలె మన యింటి మనుగుడుపులు గుడుచుచున్నారు.

అచ్యు—వదినెలారా! మీరెంత యాక్షేపించినను సరియే! నేను మీసోదరి నన్వేషించుచుండఁగా నొక మహామహుఁడామె యిచటకు వచ్చునని నన్నుఁబంపినాఁడు! ఆమెవచ్చినచోఁ దెల్పుడు మీకుఁ జాలపుణ్యముండును! ఆమెను జూపిన తరువాత మీ రెన్ని చివాట్లైననుఁ బెట్టవచ్చును.

సరో—ఆమెవచ్చిన మాత్ర మేమిలాభము! మీతలిదండ్రులు వెళ్ళగొట్టిన తన్వీరత్నంబును మీ రెట్లు తిరిగి గ్రహించెదరు! అది జననీ జనకుల యాజ్ఞోల్లంఘనము గాదా?

అచ్యు—నేనుఁ బశ్చాత్తాప మందితిని. ఆసతీరత్నంబును నెత్తిపై నెక్కించుకొని గౌరవింతును.

సరో—పతివ్రతా తిలకంబును భర్త నెత్తిపై నెక్కించుకొనుట యబ్బురంబుగాదు! మహాదేవుఁడు భాగీరథీదేవిని శిరంబుపైఁ దాల్పలేదా! ఆమహావిష్ణువు మహాలక్ష్మిని హృదయపీఠంబున ధరింపలేదా! చతుర్ముఖబ్రహ్మ సరస్వతీదేవిని దన

ముఖ పద్మంబున ధరింపలేదా! శంకరుఁడు పార్వతీదేవి కర్ధశరీరంబు బంచి యీయలేదా? అట్టియెడ మీరు మాయనసూయాదేవిని నెత్తిపై కెక్కించుకొనుట మీకు గౌరవమే! అక్కా పద్మనాభశర్మబావగారి విశేషమేమి!

ప్రభావతి—వారు రసికాగ్రగణ్యులు! భువనైక మోహనోద్ధత సుకుమార వారవనితా జనితా ఘనతాపహర సంతత మధురాధరోదిత సుధారసధారలు గ్రోలిన శృంగార రసాధిష్ఠాన దేవతలు! వారవనితామణి మోహజాలంబునఁ జిక్కి యిల్లును నాడలును గుల్లజేసుకొని యర్ధాంగి నెడఁబాసి యన్వేషించుచు నిటకరుదెంచిన మహానుభావులు! మన చెల్లెలు విమల ప్రాణనాథుఁడు.

సరో—అక్కా! మన బావ లొకరినిమించినవారొకరు! భార్యయుండఁగా నితర వనితను బెండ్లాడువారొకరు! తల్లిదండ్రులయాజ్ఞ విని పుస్తెఁగట్టిన యిల్లాలి గంగపాలు జేయువారొకరు! వారవనితను మఱఁగి యర్ధాంగిని వీడువారొకరు! అఘటన ఘటనా పటిష్ట చారిత్రులు! అద్వితీయ శూరాగ్రగణ్యులు! తెల్లనివెల్లఁ బాలును నల్లనివెల్ల నీరునని తలంచు వనితామణులను మోసముఁ జేయుటయే వీరి ప్రతాపము గాఁబోలు!

[కలక్టరు మాధవుఁడు ప్రవేశింపఁగా నందఱు నిలిచి తరువాత నందఱు నాసీను లౌదురు]

మాధవు—సతీమణులారా! దుఃఖసంతప్తులైన వీరి నెట్లోదార్చెదరోయని ప్రక్కనుండి మీసంభాషణంబు వినుచుంటిని? చాలుఁజాలు! ఇంటికివచ్చిన యతిథి వర్గంబునుఁ దూలనాడుటయే సత్కరించుటయా? మీకు బావలైన హేళనకుఁ బరిహాసంబునకు సమయమిదేనా? వారిచటఁదమ సతీమణులను జూచుటకు గంపెడాసతో రాఁగా? వారినిట్లు తూలనాడి నొప్పించెదరా! వారిభార్యలను వారికప్పగించిన తరువాత మీరెంత హేళన జేసినను వారాదరంబున భరింతురు! "శుష్కప్రియాలు, శూన్యహస్తంబు" లన్నట్లు మీ పరిహాసంబువలన వారికి దుఃఖోపశమనంబు గల్గునా! సోదరులారా! వగవవలదు! మనమందఱమును నీగయ్యాళిగంపల ప్రేమపాశంబులం దగుల్కొంటిమి! వారి వాక్యంబులు శూలంబులవలె హృదయంబున నాటినను, వారి నిష్కల్మష ప్రేమవలన మన కూరటగలుగవచ్చును! సతీమణులారా! భార్యల నన్వేషించుచున్న వీరి కష్టంబులు తీర్పుటకు మార్గంబుఁజూడరా.

సరో—నాథా! ప్రపంచంబున స్వలాభం బపేక్షింపక యెవ్వరును నేకార్యమును నిర్వహింపరు! మేముకష్టపడి వారిభార్యలను వారికిఁగూర్చినచో మాయొడిలోఁ బడు ఫలమేమి.

విద్యు—మందభాగ్యుఁడనైన నేనేమొసంగఁగలను!

పద్మ—లక్ష్మీసంపన్నులైన మీకేమి ప్రత్యుపకారం బొనర్పఁగలను.

అక్రి—నా ప్రియురాలిని భారతిని జూపుమని నేనిదే త్రికరణశుద్ధిగా నమస్కరించి బ్రతిమాలుచున్నాను.

సరో—విక్రమా! లెమ్ము! నీవు నీ ప్రియురాలియెడ నెట్టి క్రౌర్యమును జూపింపలేదు. నీ యనురాగమే భారతిని నీవశముజేయును లెమ్ము! బావలారా! మీ భోగభాగ్యంబులు మా కేమియు వలదు! మా చెల్లెండ్ర నపరిమితానురాగ తత్పరులై గౌరవించిన నదిగేమీ మీరు మాకొసంగు ప్రతిఫలము.

అచ్యు—త్రికరణశుద్ధిగా నట్లొనర్చెదనని ప్రమాణముఁ జేయుచున్నాను.

పద్మ—దైవసాక్షిగా నట్లొనర్చెదనని శపథముఁ జేయుచున్నాను.

ప్రభా— } మే మిదే వెళ్ళి మా మంత్రి ప్రభావంబున మా చెల్లెండ్రను భారతిని
పరో— } దీసుకొని వచ్చెదము (అని లోపలికేగి విమలను అనసూయను భారతిని దీసికొనివచ్చి) సతీమణులారా! అరుగో మీ ప్రాణనాథులు! మీ రాకకై చంద్రునిరాక నిరీక్షించు చకోరకంబుల భాతి నెదురుచూచుచున్నారు.

పద్మ—

సీ॥ తల్లిదండ్రులమాటఁ ♦ దలపైననిడి పాడు, గావించితిని సిండు ♦ కాపురమును
అక్కచెల్లెండ్రిడు ♦ నాజ్ఞలఁబాలించి, భార్యను విడనాడి ♦ భంగపడితి
ధనమదాంధత చేత ♦ దర్పంబు పైఁగప్ప, సరివారులేరని ♦ సాగియుంటి
తిట్టికొట్టితిఁగాని ♦ దీవించి ముద్దాడి, గౌరవంబునుజూపఁ ♦ గడగనైతిఁ
తే॥ గష్టనష్టంబులన్నియుఁ ♦ గడచిపోయె, దాసుతప్పులు దండానఁ ♦ ద్రోసిపైచి
కోపతాపంబుఁబొందక ♦ కోమలాంగి, తప్పు సైరించి యేలుమో ♦ ధన్యచరిత.

ఉ॥ అక్కట పుణ్యశీల నిను♦నక్కటికం బొక యింతలేక ప
ల్మిక్కటమైన బాధలను ♦ మించినదుఃఖము పాలుజేసితిఁ
మక్కువ నాదరింపు నను ♦ మన్ననజేసి సగౌరవంబుగఁ
బొక్కఁగ శీతలేక్షణఁపు ♦ సోయగము న్ప్రసరింపు నాపయిఁ.

విమల—నాథా!

చ॥ ఘనుఁడవు సత్కృపాగరిమ ♦ గాంచుచుఁగైకొనినాఁడ వద్దియే
మనమున మోదమున్గొలిపె ♦ మానిని వే! క్షమియింపఁజాలు నే
యనయము నిన్నుఁగొల్చుటయ ♦ నాపరమేశ్వరు నాజ్ఞయౌట భ
క్తిని బదపద్మముల్గొలచి ♦ తేలెద సౌఖ్యపు సాగరంబునఁ.

ఉ॥ తిట్టిన తిమ్మిన న్నిగుల ♦ దీవనలిచ్చిన సౌఖ్యమబ్బినఁ
గొట్టిన వాతఁబెట్టినను ♦ గోమలి భర్తను బాయవచ్చునే
కొట్టినదానికి న్వగవఁ ♦ గ్రోధముతో నిను బాసినందునఁ
బెట్టిన దుఃఖమందితిని ♦ నేరుపు ష్మి క్షమియింపు నాయకా.

ప్రాణనాథా! తప్పులెల్ల నావిగాని మీవిగావు! మీయర్థాంగిని మీ కేమి యొనర్చినను మీకధికారముగలదు. గాని మీపదసాన్నిధ్యంబునుండి ద్రోసి వేయుటచే మీపదములను గొల్చుభాగ్యము లేకుండ నొనర్చిరి! కాని తుదకు సేవజేసి మిమ్మాపదనుండి తప్పించు నదృష్టము మాకుఁ గలుగనే కలిగినది!

పద్మ—హృదయేశ్వరీ! నీవు నాకెట్టిసేవ యొనర్చితివి?

విమల—మీరును మాబావగా రచ్యుతశర్మయు విక్రముఁడునుమహారణ్యంబున బెబ్బులి వాతఁబడినప్పుడు నేనును నాసోదరియు భారతియు మిమ్ము రక్షింపలేదా?

అచ్యు—మీ రెక్కడ మమ్మురక్షించితిరి! మమ్మురక్షించినవారు విమలాదిత్యశర్మయుఁ బ్రభాకరశర్మయు, భారతశర్మయుగాని, నీడనుజూచి జడిసికొనునట్టి భీరువులు, యువతీరత్నంబులు మీరు రక్షించితిరనిన నమ్మ సాధ్యమగునా!

అనసూయ—(ఉంగరముఁజూపుచు) ప్రాణనాథా? యీయుంగరము మీదేనా! ప్రభాకరశర్మ నాకొసంగిన యుంగరమిదేనా! మీప్రాణనాయికి నిచటకు రప్పించెదనని శపథముఁజేసిన ప్రభాకరుఁడే యనసూయగా మారె.

పద్మ—అటులైన విమలాదిత్యుఁడే విమలయయ్యెను గాఁబోలు!

విమల—మనోనాయకా! మీ తెలివి తేటలు కోటలు దాటుచున్నవి! అవులించినఁ బ్రేవులు లెక్కించు తమకుఁ జెప్పవలసిన దేమున్నది! మీయాజ్ఞానుసారముగ విమలాదిత్యుఁడే విమలయయ్యె!

భారతి—

చ॥ జనకునిబాసి తల్లివిడి ♦ చయ్యనఁగాననమందుఁజిక్కి నే
ననయము దుఃఖమందుచును ♦ నాత్మఁగృశించుచు నున్నవేళ నా
మనమున దుఃఖముల్ దొలఁగ ♦ మాకనుదమ్ములఁ గానుపించి, ద
ర్శనమునఁ గష్టనిష్ఠురత ♦ మాయముజేసితి పండుకోతికిన్
నను నొసగంగనుండ దయ ♦ నన్వరియింపవె ప్రాణనాయకా!

విక్రము—

ఉ॥ బాలరో! ధైర్యమందుమిఁకఁ ♦ బాసెను నీ వ్యధ నేఁటితోడనే
బాలుఁడనై ప్రతిజ్ఞలను ♦ ఒట్టెతి నిన్వరియింతునంచు ని
న్నేలుదు భార్యగాఁగ సఖి♦ నెన్నఁడు నా ముదిపండుకోతికిన్
బాలుగఁజేయ సుమ్మి యిదె ♦ బాయుము నీ హృదయాను తాపముల్.

ఉ॥ సుందర మందిరావళులఁ ♦ జొక్కపుఁ బూఁబొదరిండ్ల సొజ్జలం
దందములైన కాననము ♦ లందు లతాగృహా సీమలందు నిం
దిందిర వాసమైపరగు ♦ దివ్యసుసౌరభ పుష్పరాశి నా
నందము లందుచుండెదవు ♦ నమ్ము సతీమణి నిన్వరించితిన్.

విక్రము—భారతీదేవి రూపరేఖా విలాసంబులు భారతశర్మ యందుఁ గన్పడియె! భారతశర్మను భారతీదేవియని గుర్తింపఁజాలనైతిని. నేనెంత మందమతిని — భారతీ! నీవు పురుషవేషము వేసితినని యొక్కమాటయైనను జెప్పవైతివే! ఎంత మోసముఁ జేసితివి!

భారతి—ప్రాణనాథు నన్వేషించుటకు సతీమణి యెన్ని వేషంబులు వేసిన నవి మోసంబులుగావు.

సేవకుడు—అయ్యా! డాక్టరు సరస్వతీదేవిగారును, నింకొకరును గలసి తమ దర్శనంబునకు వచ్చుచున్నారు.

మాధ—సరియే! ప్రవేశపెట్టుము.

[సరస్వతీదేవియు మధుసూదనరావును బ్రవేశింతురు.]

మాధ—(ఆశ్చర్యముతోఁజూచుచు) దయచేయుఁడు! తాము క్రొత్తగా చార్జి పుచ్చుకున్నారు గాఁబోలు! క్షేమమా!

సర—నాథా! ఆట్లాశ్చర్యముతోఁ జూచెదవేమి! నాసోదరి యాస్పత్రిలో జబ్బుతోనున్నపుడు సంజీవియొసంగి ప్రాణదానం బొనర్చినవారు వీరే! సోదరీ మనసరస్వతీదేవిగారు వచ్చినారు!

ప్రభావతి—అమ్మా! క్షేమముగా నున్నారా? ఈజిల్లాకెప్పుడు వచ్చినారు! వీరెవరు.

సరస్వతి—క్షేమముగా నేయున్నాము! వీరు మా స్నేతులు! బంధువులు సుప్రసిద్ధ డాక్టరులు.

మాధవ—(ఆశ్చర్యముతోఁ దేరిపాఱఁజూచుచు) డాక్టరుగారూ! మీకుఁ గోపము రానిచో నొక ప్రశ్నయడిగెదను? మీతలిదండ్రులెవరు? మీకాపుర మేజిల్లా!

సరస్వతి—(నవ్వుచు) కలక్టరుగార తలిదండ్రు లెవరో మాతలిదండ్రులును వారే!

మాధవ—సోదరీ! నిన్ను ప్రథమంబున గుర్తింప నందులకు క్షమింపుము!

సరస్వతి—క్షమించుటకు నీవలనఁదప్పేమి! నీ వింగ్లండునుండివచ్చిన తరువాత నిదియే ప్రథమ దర్శనం బగుటచేతను, గాలమువలన మార్పులు జెందుటచేతను నను గుర్తింపవైతివి! వీరి నెఱుంగుదువా? నీ బావగారు! నీసోదరి పాణిగ్రహణంబునకై తిరుపతి వెంకటేశ్వరుల పర్వతశిఖరంబునఁ దపం బొనర్చిన మహనీయులు!

మాధవ—బావగారు నమస్కారము! ఆహా! నేఁడెట్టి సుదినంబు! నాసోదరిని బావను వీక్షించుటచే బహుమోదావహంబయ్యె! మీరు మీ మీ ప్రాణనాథులను గలసి కొంటిమని యెంతప్రమోద మానసులై యుంటిరో నాసోదరిని బావను జూచుట చేత నే నంతయమందానందకందళితహృదయారవిందుండ నైతిని.

సేవకుఁడు—(ప్రవేశించి) ఒక యోగిని తమదర్శనంబు వాంఛించుచున్నది.

మాధవ—శీఘ్రముగాఁ బ్రవేశపెట్టుము.

(పద్మిని ప్రవేశించి)

పద్మిని—అయ్యా! తమకందఱకునమస్కారము (అచటనున్న వారినందఱిని కేరిపాఱఁ జూచి) అహా! నేఁ డెట్టి సుదినంబు! వారు పద్మనాభశర్మయు విమలా దేవివలె నున్నారే! నిశ్చయముగా వారే! కాలము వారిని నన్నెంతగా మార్చివైచినది! స్వామీ! మండలాధీశా! వెదుకఁబోయిన తీగె కాలిని జుట్టు కొన్నట్లయ్యె! నామనవిఁ జిత్తగింపుఁడు! పూర్వపు టాశ్రమంబున నేను పద్మినియను వారకాంతను. నామూలముననే పద్మనాభశర్మ తనసుహైశ్వర్యం బును గోల్పోయి యష్టకష్టంబు లనుభవించెను! కాలక్రమంబున నాహేయ జీవితమైన పడుపువృత్తిపైరోసి సన్యాసాశ్రమంబుఁ గైకొని, యా సేతుహిమా చల మధ్యస్థ తీర్థక్షేత్రంబుల స్వామిదర్శనంబుఁ జేయుచుఁ బద్మనాభశర్మకై యన్వేషించితి! నాయాస్తినంతయు నాల్గుభాగంబులుగా విభజించి యొక భాగముఁ బద్మనాభశర్మకును, రెండవభాగము పేరిశెట్టికిని, దక్కిన రెండు భాగంబులు భారతవర్షంబున వ్యభిచారవృత్తి నశింపఁజేయుటకుఁ దగిన యేర్పా ట్లొనర్పుటకును దస్తావేజు వ్రాయించి మిమ్ముఁ బరిపాలకకర్తగా నేర్పా టొనర్చితి! తా మధ్యక్షతవహించి యీ సంస్కరణంబు నిర్విఘ్నంబుగా నెర వేర్పవలయు! భూసురవర్యా! పద్మనాభశర్మా! సోదరి విమలాదేవీ! నా చేసిన దోషంబులు మన్నించి మీ పూర్వసంపదలతోఁ దులఁదూగుచుండుఁడు.

మాధవ—పద్మినీదేవీ! నీజన్మమే సఫలమైనది! అజ్ఞానాంధకారంబున మునిఁగి, మోహాతిరేకంబున విచ్చలవిడిగా సంచరించినను, జ్ఞాననేత్రంబుఁ దెరచి, నీ కలుషచారిత్రంబునకుఁ బశ్చాత్తాపంబునొంది, వైరాగ్యంబుఁదాల్చి, సర్వ సంగపరిత్యాగినివై, నీయాస్తియంతయు సత్పాత్రదానం బొనర్చితివి! నీవంటి మహిళా రత్నంబులే భారతఖండంబున యశశ్చంద్రికల దశదిశల వెదజల్లు చున్నారు! ఆచంద్రతారకంబుగా జగద్విఖ్యాతిఁజెందిన సీత, సావిత్రి, దమయంతి, చంద్రమతి, మొదలైన పతివ్రతామతల్లులకు జన్మభూమియైన భరత వర్షంబున వ్యభిచారమే ముఖ్యవృత్తిగాఁగల కులంబు లున్నవనినచో నది మన కందఱకుఁ దీరని కళంకము గదా? అట్టి కళంకమును దొలఁగించి, భరతఖండ వనితారత్నంబుల సదాచార కుల శీల సంపత్తియుఁ బాతివ్రత్య మహిమంబు నాచంద్ర తారకంబుగా నెలకొల్పుటకు నీవుచేసిన సర్వసంగపరిత్యాగమే మూలకారణంబగుఁ గాక!

ఉ॥ భారతవర్షమందు సువి♦భాసితలౌ సుదతీమణుల్సదా
చారము సద్గుణంబులును ♦ శాస్త్రవిచారము ధర్మశీలముల్
శూరతధీప్రభావ మతి♦శోభయుఁ గల్గి యశోవిహారలై
కోరినకోరిక ల్బడసి ♦ కోరిచరింతురు గాక యోగ్యలై.

# తప్పొప్పులపట్టిక

స్త్రీపాత్రిలలో రుక్మిణి - జనార్దనరావు విధవకూతురు.

| పేజి | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 11 | 26 | లభియించితివిం | లభియించినదిం |
| ,, | 29 | మూకల | మూకలు |
| 13 | 18 | సాధింతులే | సాధింతువే |
| ,, | 24 | పేరుత్తక | పేరెత్తక |
| 17 | 22 | సాహసంలక్ష్మిః | సాహసేలక్ష్మి |
| 25 | 11 | నరయనైతి | నరసియుంటి |
| 31 | 18 | వర్షంబులకు | వర్షంబునకు |
| 33 | 20 | భూతకల్పన | అభూతకల్పన |
| 40 | 21 | జూపు | జూపి |
| 48 | 4 | వాగ్ఘ | వాగ్ఝ |
| ,, | 12 | న్యాయాధిపదం | న్యాయాధికారిపదం |
| 49 | 17 | కాసులీసము | కాసువీసము |
| 51 | 6 | పూచికవుల్లైన | పుచ్చినవక్కైన |
| 53 | 12 | బాపునుమ్మ | బాపునయ్య |
| 57 | 12 | జిలికి | జివికి |
| 58 | 17 | జాలనధము | జాలధనము |
| ,, | 29 | నష్టంబు | నడ్డంబు |
| 59 | 5 | యజమానిని | యజమానినని |
| ,, | 14 | జరిపెడి | జదివెడి |
| 60 | 1 | తలంచుటయే | వలదనుటయే |
| ,, | 16 | నెప్పటి | నేటికి |
| ,, | 33 | నన్ను | నన్యు |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 62 | 23 | మఱలు | మఱులు |
| ,, | 27 | నాయృదయము | నాహృదయము |
| 68 | 27 | కట్నుంటులు | కట్నుంబులు |
| 75 | 18 | భేక్కొంచు | బేర్కొంచు |
| 80 | 7 | శోధన | శోభన |
| ,, | 16 | వత్తురె | వత్తువె |
| ,, | 19 | నేత్ర | నేత్రి |
| ,, | 21 | యగుత | యగును |
| 83 | 2 | దుష్ప్రావ | దుష్ప్రాపి |
| ,, | 4 | గాపాడుమా | గాపాడవే ! |
| ,, | 5 | నిశాంత | నిశాత |
| ,, | 31 | సీతను | నతను |
| 85 | 13 | అయ్యో ! | అయ్యా! |
| 94 | 21 | ఇక్కనే | ఇక్కడనే |
| 96 | 1 | నీజన్మ | నాజన్మ |
| 97 | 15 | కక్గుఱితి | కక్కుఱితి |
| 98 | 8 | కాంతులకు | కాంతలకు |
| ,, | 29 | కూతురు | కోడలు |
| ,, | | 'భారతీ ! ' అనునది మొదలు కడమనున్న రెండుపంక్తులు లేవు. | |
| 99 | 1 | భారతీ ! | అనసూయా ! |
| ,, | 5 | భారతిని | కోడలిని |
| ,, | 17 | గణామైన | గనిమైన |
| 108 | 6 | దెలసిన | దెలిసిన |
| 109 | 17 | ముఁగి | మునిఁగి |
| 114 | 31 | లేఖలు | రేఖలు |
| ,, | 35 | హోయి | బోయి |

| పేజి | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 117 | 26 | నేత్ర | నేత్రి |
| 118 | 29 | నేత్ర | నేత్రి |
| 121 | 3 | సేవదేరి | సేదదేరి |
| ,, | 9 | కొనుము | కొనుడు |
| ,, | 23 | గూర్చుట | గూర్చుటకు |
| 122 | 7 | ప్రాణేశ్వరుని | ప్రాణేశ్వరిని |
| 125 | 8 | లేదు | |
| 126 | 21 | నబము | నభము |
| ,, | 22 | బలుకునీవు. సంయమివి. | బలుకనీవు. సంయమివై. |
| 127 | 24 | మాధవుండను | నీదునెచ్చెలి |
| ,, | 28 | మాధవుడన్నినుఁ బ్రేమగోరితిఁ | మానిని! నే మధు సూదనుండనే? |
| 130 | 23 | బాక్కుఁగ | స్రుక్కుక |
| 131 | 12 | నాకొసంగిన | కొసంగిన |

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | IPLA 102 B/96 |
| పుస్తకం పేరు | [illegible] సరస్వతి |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 149 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 2, 6, CL, BCL, 4 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | thosin |
| పేజీలు విడదీసినది | nandhini |
| స్కాన్ చేసినది | Prateyusha |
| పరీక్ష చేసినది | SANDHYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | nil |
| తప్పులు | no |
| పరిస్థితి | good |